# మన పిల్లల పాటలు

(పిల్లల జానపద గేయ సర్వస్వం)



సంపాదకుడు:

డాక్టర్ వెలగా వెంకటప్పయ్య

# మన పిల్లల పాటలు

(బాలల జానపద గేయ సర్వస్వం)



సంపాదకుడు

డాక్టర్ **వెలగా వెంకటప్పయ్య**, Ph D



# చేయూత

ఈ గ్రంథ ప్రచురణకు తోడ్పడిన




తెలుగు సాహిత్య, సాంస్కృతిక సంఘం, న్యూయార్క్



తెలుగు కళా సమితి, న్యూజెర్సీ సంఘాల
అధ్యక్షులు, కార్యవర్గ సభ్యులకు
నిండు కృతజ్ఞతలు



స్వర్ణోత్సవ కానుక (1952-2002)

ముఖ చిత్రం : బాపు
చిత్రాలు : వాసు

వెల : రూ. 130/- $10/-

ప్రతులకు :

డాక్టర్ **వెలగా వెంకటప్పయ్య**
4-22-27 ఐతానగరం
తెనాలి 522 201
ఫోన్ : 91-8644-228585
e-mail . drvelaga@yahoo com

ముద్రణ : 2003
వాసు ఆఫ్‌సెట్ ప్రింటర్స్,
విజయవాడ. ఫోన్ : 2438324, 5528324

బాల సాహితీవేత్తలు
సౌజన్యమూర్తులూ
బాలబంధువులూ ఐన

**వేజండ్ల సాంబశివరావు**
**కవిరావు**
**అలపర్తి వెంకట సుబ్బారావు**
గార్లకు



**"Indian children's rhymes and chants survived many a national storm. The wealth of the country was plundered by the invaders, but who could carry off these rhymes and chants from India's little son's and daughters? The people were the victims of great catastrophies, but none could kill the children's indigenous games and home spun songs".**

**DEVENDRA SATHYARTHI**
Indian Children's Rhymes and Chants
(Modern Review - Oct-Nov 1936 P 39)



# పాటల సూచిక

# పిల్లల జానపద గేయాల పరిచయం

## పరిచయం

తెలుగు సంస్కృతికి మూలకందాలైన తెలుగు పిల్లల తొలి పాటలు ఏనాటివో యిదమిత్థంగా చెప్పలేము. కర్తలెవరో తెలియదు. బిడ్డల మనసెరిగిన తల్లులు, తల్లి ప్రేమకు పాత్రమైన బిడ్డలు తొలి కవులు అనవచ్చు. దీన్ని బలపరుస్తూ చింతా దీక్షితులు (1891-1960) గారు బాల వాఙ్మయంలోని చాల పాటలకు కథలకు "తల్లి హృదయమే కర్తృత్వం వహిస్తుంది" అన్నారు. అందులో ఆశ్చర్యం లేదు. "తీయని పెదవులతో బిడ్డని మనసార స్పృశిస్తుంది తల్లి. బిడ్డ కళ్ళనిండా తల్లి మొగమే కనిపిస్తుంది. ఆమె మధుర హృదయం నుంచి ఏవో పిలుపులు గుసగుసలు మాటలుగా పాటలుగా పొంగాయి. తల్లి బిడ్డల మధ్య ఆ నిముషంలో, కాలాన్ని స్తంభింప జేసిన ఆ నిముషంలో, ప్రాణ క్రాంతిని బిందువుగా కేంద్రీకరించిన ఆ నిముషంలో వెలువడే భావాలే బాలసాహిత్యానికి ఆలంబనం. ఆ మాటలే పాటలే ఏ నాటికీ చెరగని తరగని మధుర నిధులు" అంటారు నార్ల చిరంజీవి. కనుకనే వాల్మీకి ఆది కావ్యానికి నాంది విషాదం ఐతే బాల సాహిత్యానికి నాంది తల్లి నిండు హృదయం. చెక్కిళ్ళపై మెరసిన ఆనందం, కళ్ళల్లో నిండిన సంతోషం. ఇవి తొలినాటి బాల సాహిత్యానికి దోహదాలు అందాం.

## కవితా విస్తృతి

మన తొలి జానపద సాహిత్యోద్ధారకులు టేకుమళ్ళ అచ్యుతరావు (1880-1947) గారు "ప్రపంచంలో యేయే దేశపు వాఙ్మయం పరిశీలించినను ప్రథమమున పదములు - పాటలు మాత్రమే కనిపించుచున్నవి. ఇవియే వాఙ్మయ వాహినిని పోషించే సెలయేళ్ళు" అని రాసిన దానిలో ఎంతో సత్యం ఉంది. తెలుగుదేశంలోని తొలి సాహిత్యం అంతా ఇలాగే ఉంది. బిడ్డల ఆలన పాలన లాలన ఆనాటి కవితా వస్తువులు. వినోద వేళలు, పండుగలు. పబ్బాలు, తిరునాళ్ళు, జాతరలు, ఆచారాలు ఆనాటి సాహిత్యానికి రంగ స్థలాలు. వారి కవిత్వంలో జాను తెలుగు పాలు ఎక్కువ. కవితాధార వారి సొమ్ము కనుక జానపదులను వాచస్పత్యకారుడు -

"కృతయజ్ఞాయ మేధావీ
బుధోజ్ఞాన పదశ్శుచి"

అని యజ్ఞం చేసిన వారితో పండితులతో సమానం చేసి పవిత్రులని ప్రశంసించాడు. అటువంటి రస హృదయులైన వారి నుంచీ, నారీమణుల నుంచి వెలువడిన సాహిత్యం ఆపాత మధురంగా ఉంటుంది. సెలయేరులా గలగలా జాలువారుతుంది. మృదు మధురంగా స్వచ్ఛంగా, నిసర్గ మనోహరంగా ఉంటుంది. ఆనందమే ప్రధానంగా, వినోదమే ఉపాధేయంగా వెలుగొందుతుంది. సురుచిరమైన తెలుగు నుడికారపు నడకతో వడివడిగా పరుగిడుతుంది. ఈ సాహిత్యంలోని పాత్రలు నిత్యం మన కనుసన్నలలో మెలిగే తల్లులు, తండ్రులు, తమ్ములు, చెల్లాయిలు, అక్కలు, బావలు, అన్నలు, వదినలు కాబట్టి ఈ బాంధవ్య బంధాలు ఉన్నంత కాలం తొలి తెలుగు పిల్లల పాటలకు తొలికాపు నిస్తుంది. అవధులకు విధులకు అతీతంగా నిలుస్తుంది. ఆచంద్ర తారార్కం ప్రకాశిస్తుంది.

తెలుగు వారిని గురించి హరీంద్రనాథ్ ఛటోపాధ్యాయ అన్నారు - "వీరూ వారూ అనే తేడా లేకుండా తెలుగు వారిని కదలించామంటే కవితా రసం చిందుతుంది". అది ఈనాడే గాదు - ప్రాచీన కాలం నుంచే ఆ గౌరవం మనకు దక్కుతుంది. "ముఖే ముఖే సరస్వతీ" అన్న నానుడి తెలుగు వారికే చెందుతుంది.

అది మన సొత్తు. దానికి సాక్ష్యంగా తెలుగు దేశంలో వేల సంఖ్యలో గేయాలు - ఇతర రచనలు - నన్నయ్య తిక్కనల మాట అలా ఉంచి - జానపదుల నుంచి రావడం విశేషం కాదా!

తరతరాలుగా అనాదృతమైన ఈ సాహిత్యం సేకర్తల పరిశోధకుల చేతిలో పడిం తర్వాత జానపద సాహిత్యమనీ, ప్రజా వాఙ్మయమనీ, ముగ్ధ మధుర వాఙ్మయమనీ, దేశి రచనలని, ఆశురచనలనీ అనేక పేర్లతో పిలువబడింది. ఐతే జానపద సాహిత్యమనే మాట రూఢీలో నిలిచిపోయింది. జానపద అంటే ఒకప్పుడు కేవలం పల్లెటూరి ప్రజలు పాడుకొనే లేదా చెప్పుకొనే సాహిత్యం అనే భావన ప్రచారంలో ఉంది. అది పూర్తిగా నిజం గాదు. ప్రసిద్ధ జానపద సాహిత్యవేత్త Alan Dandes తన Study of Folklore అనే గ్రంథంలో Any group of people, what so ever, who share atleast common factor (P 2) అన్నారు. అనగా జానపదులంటే ఏదైన ఒక విషయంలోనైనా భావసామ్యం కలిగిన జనసముదాయం అని వారి భావన. వారు ఆటవికులు కావచ్చు, గిరిజనులు కావచ్చు, చివరకు నగర వాసులైనా కావచ్చు. వారు వీరనక అందరిలో జానపదులున్నారనేది సారాంశం.

భారతదేశంలో ఈ శతాబ్ది పూర్వార్థంలో జానపద సాహిత్యాన్ని గురించి అపారమైన పరిశోధన చేసిన దేవేంద్ర సత్యార్థి భారతీయ జానపద సాహిత్య వైశిష్ట్యాన్ని గురించి ఇలా అన్నారు. "భారతదేశంలో లక్షలాది జనుల కోసం తలుపులు తెరచి ఉంచిన కవితా సంకేతాల దేవాలయాలవి. ఇవి జనుల హృదయాలలో నుంచి పొంగి వచ్చిన మాటలు కావడం చేత వాటిలో ఉండే పల్లె వాసుల స్వచ్ఛంద జీవితంలోని కష్ట సుఖాలను మనం అనుభవిస్తాము". జానపదులలో నిసర్గ మనోజ్ఞమైన సహజ సుందర కవితా ప్రతిమ ఎలా స్పందిస్తుందో - ఆ స్పందన మన హృదయాలకు ఎలా హత్తుకుంటుందో సత్యార్థిగారు వివరించారు. మన జానపద సాహిత్యం విస్తృత పరిధిలో మన సంస్కృతి సంపదను నిక్షిప్తం చేసుకుంది. ఆ ఛాయలలోనే బాలల జానపద సాహిత్యమూ పయనించింది.

సంప్రదాయం సాహిత్యానికి ఎంతటి సుదీర్ఘమైన చరిత్ర ఉందో - ఇంచుమించు అంతటి చరిత్ర జానపద సాహిత్యానికీ ఉంది. దాన్ని సేకరించి పోషించి భద్రపరచాలనే శ్రద్ధ, అష్టదిగ్గజాలను పోషించిన వారికి, కనకాభిషేకాలను చేయించిన వారికి కలిగిన దాఖలా లేదు. సాహిత్య పోషకుడైన సి పి బ్రౌన్ (1798-1884) దృష్టి బాలసాహిత్యం వైపుకు మరలినట్లు లేదు. అయితే బాల సాహిత్యానికి చేరువగానున్న తాతాచార్ల కథలను సేకరించి "శాశ్వతంగా ఇండియాను వదలి లండన్ వెళ్ళబోయేముందు" ఆయన కథల్లో కొన్నిటిని ఏరి చిన్న పీఠిక రాసి ఒక సంపుటిగా 1885లో అచ్చువేశారు ఇంగ్లీషు తర్జుమాతో సహా. ఆ తర్వాత దక్షిణ భారత దేశంలోని జానపద గేయాలను సేకరించాలనే సంకల్పం మొదట Charles E Grover కు కలిగి ఆయన Folk Songs of South India (1871) అనే గ్రంథం ప్రచురించారు. ఆయన జానపద గేయాలకు బదులు వేమన పద్యాలను చేర్చాడు. పిదప 1872లో యం రాఘవయ్య ప్రచారంలో ఉన్న రామాయణాన్ని ప్రచురించారు. 1900లో ఏలూరుకు చెందిన నందిరాజు చలపతిరావు (1878-1960) గారు స్త్రీల పాటలను ప్రచురించారు. అందు పిల్లల పాటలు కొన్ని గలవు. 1905-1906లో Indian Antiquary - vol xxxv లో కొన్ని బాల గేయాలను రోమన్ లిపిలో ప్రచురించారు. ఆ తర్వాత బాలగేయాలు ప్రత్యేకంగా గ్రంధ రూపంలో ప్రచురించడం ప్రారంభమైంది.

| ప్రచురణ | పుస్తకం పేరు | సంకలన కర్త |
|---|---|---|
| 1912 | బాలగీతావళి - 1 | వెంకట పార్వతీశ్వ కవులు |
| 1916 | బాలికా భూషణము | బి వి రంగయ్య |
| 1924 | ఆంధ్ర పదములు - పాటలు | టేకుమళ్ళ అచ్యుతరావు |
| 1941 | నవ్వులు - పువ్వులు | గొర్రెపాటి వెంకట సుబ్బయ్య |
| 1941 | పాత పాటలు | టేకుమళ్ళ కామేశ్వరరావు |
| 1949 | బాలానందం | వేదుల సత్యనారాయణశర్మ, కాళహస్తి వీరభద్రస్వామి |
| 1953 | బొమ్మరిల్లు | కోట సోదర కవులు |
| 1954 | బాలభాష | వేటూరి ప్రభాకరశాస్త్రి |
| 1955 | సెలయేరు | నేదునూరి గంగాధరం |
| 1960 | తెలంగాణ పిల్లల పాటలు | బిరుదురాజు రామరాజు |
| 1963 | బాలగీతాంజలి | సామవేదం జానకిరామశర్మ, నోరి రామశర్మ |
| 1979 | తారంగం తారంగం | ఎం కె దేవకి |
| 1983 | తప్పట్లోయ్ తాళాలోయ్ | ఆంధ్రప్రదేశ్ బాలల అకాడమీ |
| 1983 | చందమామ రావే | ఆంధ్రప్రదేశ్ బాలల అకాడమీ |
| 1983 | బుర్రుపిట్ట | ఆంధ్రప్రదేశ్ బాలల అకాడమీ |
| 2001 | ఆడుతూ పాడుతూ | జిల్లా ప్రాథమిక విద్యా పథకం |
| 2002 | పాడుకుందామా | పల్లి తిరుపతిరావు |

## స్వరూప స్వభావాలు

సాహిత్య విమర్శకులు పంచాగ్నుల ఆదినారాయణశాస్త్రి (1890-1951) గారి అంచనా ప్రకారం "జానపద సాహిత్యం అంతులేక యున్నది. విభాగాలు అనంతంగా ఉన్నవి. సారం ఇసుక పాతరవలే, నీటి చెలమలవలే తోడిపోయుచున్న కొలది యెడతెగక ఉబుకుచుందును" అని చెబుతూ దీనిని సమగ్రంగా పరిశీలించవలసినదిగా మనవి చేశారు. జానపద వాఙ్మయోద్ధారకులు నేదునూరి గంగాధరంగారు - "కళామధురిమకు కాణాచియైన త్రిలింగధాత్రిలో ఈ జీవభాష, తీయని భాష, మిసిడి మీగడదేరు నుడికారము, వయార మొలుకు సూక్తులు, సూక్తులలో యుక్తులు, యుక్తులలో మకరందము చిందులాడు మాటలు కలిగి తెలుగు భాషామతల్లి రసవాహినియై పొంగి పొరలినవని" వివరించారు. జానపద వాఙ్మయ స్వరూపాన్ని కొంతవరకు చవిచూపారు. వేటూరి ప్రభాకరశాస్త్రి (1888-1950)గారు "ఈ ముగ్ధమధుర వాఙ్మయం హృద్యవచోవల్లరుల మయ" మన్నారు. డాక్టర్ బిరుదురాజు రామరాజుగారు తన తెలుగు జానపదగేయ సాహిత్యము (1978) అనే సాధికార సిద్ధాంత వ్యాసంలో జానపదగేయ సాహిత్య స్వరూపాన్ని గురించి ఈ విధంగా ప్రస్తావన చేశారు. ఈ సాహిత్యానికి -

1 ప్రత్యేకమైన కవి ఉండరు.
2 రచనా కాలం తెలియదు.
3 నియమిత స్వరూపం లేదు.
4 రచనా కాలం ఇదమిత్థమని లేదు.

5 మౌలిక ప్రచారం ద్వారానే జీవనం
6 సహజ శైలి - పాడుకొనుటకు వీలు.
7 వస్తువు జనసామాన్య పరిచితం.

పైన వివరించిన లక్షణాలుంటాయని వివరించారు. డాక్టర్ వేల్చేరు నారాయణరావు (1932-) గారు తమ పరిశోధనా వ్యాసంలో మరికొన్ని లక్షణాలను ఊహించారు

1 ఒక పాదం ఒక మూర్తి (Unit)
2 పాద నిర్మాణంలో పడికట్టు పద్ధతి
3 పునరుక్తి (Refrain)
4 పాత్రోచిత సంభాషణ లేకపోవడం
5 కధ కొత్తది కాకపోవడం

Chamber's Encyclopaedia అజ్ఞాతకర్తృత్వం, సామూహిక ప్రచారం, మౌఖిక సంప్రదాయం, ప్రాచుర్యం సారళ్యం అనేక మనస్సుల నాకర్షించి సంపాదించిన జాతీయత, జానపద గేయ లక్షణాలని వివరించింది. ఈ మూడు సూచికలలో వివరించిన లక్షణాలలో సమాన లక్షణాలు కొన్ని ఉన్నా - వీటి సమ్మేళనం జానపద సాహిత్య లక్షణాలను తెలుపుతాయి. అవే పిల్లల జానపద సాహిత్యానికి చేరువగా ఉంటాయి ఈ సాహిత్యంలో గేయాలు ఎక్కువ స్థానం ఆక్రమిస్తాయి.

## బాల గేయ స్రవంతి

జానపద గేయ స్రవంతిలో బాల గేయాల సంఖ్య తక్కువగాదు. అచ్చయినవి వందల సంఖ్యలో, అచ్చుకాక మౌఖికంగా ప్రచారమౌతున్నవి, మరుగు పడిపోయినవి వేల సంఖ్యలో ఉంటాయి. బ్రిటన్‌లో వీటిని Nursery Rhymes అనీ అమెరికాలో Mother goose అనీ అంటారు. ఏ భాషలో ఉన్నా అపారమైన విస్తృతీ అసాధారణమైన మాధురీగరిమ నింపుకున్న రసగుళికలు. ఈ గేయాలు కఠిన పదజాలాన్ని, కావ్యాలంకారాలనీ, అసహజ పాండితినీ, ఎరువు తెచ్చుకోక, హృదయంలో నుంచి వచ్చే ప్రేమకీ, అందానికీ రంగులు పూయక స్వచ్ఛంగా సూటిగా పాడిన పాటలు. డాక్టర్ యస్వీ జోగారావు (1923-1992) గారు సెలవిచ్చినట్లు "జానపద గేయాలు తత్కవిహృదయ మధురములై తక్కిన ప్రజలకు తరతరాల వారికి నిసర్గమనోజ్ఞములై గానకళతో మేళవించి ఆ మధుమాధురులు చూరలిచ్చినవి" అన్నారు. ఈ గేయాలు చారిత్రక ప్రాధాన్యంతో, శాస్త్రీయ విషయాలతో, సాహిత్య విలువలతో అపూర్వ విస్తృతి, విన్నాణం సంతరించుకున్నాయి. వైవిధ్యం ఏర్పరుచుకున్నాయి. ఈ సాహిత్య వర్గీకరణ డాక్టర్ ఆర్వీయస్ సుందరంగారు స్థూలంగా ఇలా చేశారు.



ఒక్క గేయ విభాగాన్ని డాక్టర్ రామరాజుగారు తమ సిద్ధాంత వ్యాసంలో ఈ విధంగా విభజించారు.

గేయ సాహిత్యం

పౌరాణిక – మత – పారమార్థిక – పిల్లల – కరుణ – హాస్య – –

బాల గేయ సాహిత్య విభజన విషయం ఆలోచించవలెను. ముద్రణలో లభిస్తున్న బాలగేయ సాహిత్య సంపద దృష్ట్యా బాలగేయాలను తదితర జానపద ప్రక్రియలను ఇలా విభజింప వచ్చును.

బాల సాహిత్యం

గేయాలు కథలు ఇతరాలు

గేయాలు

పాపల పాటలు (0–5 సం. వయసు) పిల్లల పాటలు (5–14 సం.)

పాపల పాటలు

తల్లులు పాడేవి పిల్లలు పాడేవి ఇతరులు పాడేవి

ఉగ్గు, జోల, లాలి, ఊయల పాటలు

పిల్లల పాటలు

పండుగ పాటలు ఆటల పాటలు పిల్లల రచనలు సూక్తులు

ఇలా ఎన్ని విభాగాలైనా చేయడానికి తగినంత వైవిధ్యం, సామాగ్రి ఈ సాహిత్యానికి ఉంది. ఇచ్చట గేయాలు, పాటలు సమానార్థకంలో వాడారు. పాపల పాటలు 0–5 వయసు గల బాలలను ఉద్దేశించినవి మాత్రం Nursery Rhymes అనే అర్థంలో ప్రయోగించారు. వీటినే బుజ్జగింపు పాటలు అనికూడా అంటారు.

బుజ్జగింపు పాటలు

ఉగ్గు పాటలు జోల పాటలు లాలి పాటలు ఊయల పాటలు మిగతా పాటలు

మిగతా వాటిని అనగా 5–14 సం బాలలకు ఉద్దేశించిన వాటిని పిల్లలు పాటలు అని స్థూలంగా అనవచ్చు. ఐతే బాలలకు సంబంధించిన కథాగేయాలు, కథలు, సామెతలు తగినన్ని గ్రంథస్థం కాలేదు. పొడుపు కథలు మాత్రం తగినన్ని సేకరించారు. పైగా వాటిని నవీన విషయాలతో అన్వయించి అనేక కొత్త కథలు ఉత్పన్నం కావడానికి పత్రికలు కూడా తగిన దోహదాన్నిచ్చాయి.

## తేనె సొనలు

సుమసౌరభాలను వెదజల్లడంతోబాటు బాల సాహిత్యం మధురాతి మధురమైన తేనెసొనలను తల్లులకు, పిల్లలకు, పెద్దలకు అందిస్తుంది. అందరినీ ఆకర్షించగల కృష్ణాంశ బాల సాహిత్యంలో ఉంది సాహిత్య ప్రచారానికి అవసరమైన శైలి, ఛందస్సు, అలంకారాలు, సంగీత ఛాయలు, సంస్కృతీ చిత్రణ అందు సహజంగా ఇమిడిపోయాయి. అంతేగాక చిత్రలేఖనం, నృత్యం, ముద్రణా, సౌందర్యం బాల సాహిత్యం వల్ల వన్నెలు చిన్నెలు సంతరించుకొని పరిపుష్టి చెందుచున్నాయి. బాల సాహిత్యంలో అంకుర ప్రాయంగా కనిపించిన కవితా లక్షణాలు కూడా ప్రౌఢ సాహిత్యంలో అనలు కొనలుగా అల్లుకొని అందరినీ అలరిస్తున్నాయి. అందుచేతే బాల సాహిత్యం మరే సాహిత్యానికి ఒక శాఖగాకాక ఒక ప్రత్యేక సాహిత్య స్వరూపంగా వెలుగొందుతూ దిన దిన ప్రవర్ధమాన మౌతూ ఉంది.

## సంస్కృతి

తెలుగు తనమే తెలుగు సంస్కృతి. తెలుగు వారి ఆచారాలు, పాటలు, అలవాట్లు, కట్టుబాట్లు, కళలు, పండుగలు, పబ్బాలు, నగలు-నాణ్యాలు, కట్టు-బొట్టు ఇవన్నీ కలిస్తే తెలుగువారి జీవిత విధానం వ్యక్తమౌతుంది. అదే తెలుగు సంస్కృతి అని స్థూలంగా చెబుతారు. పండిత జవహర్‌లాల్ నెహ్రూ సంస్కృతిపై చేసిన ఒక ప్రసంగంలో (1950) "సంస్కృతిని నిర్వచించడం కష్టమని చెబుతూ, అదొక అసదృశ్యమైన శక్తి అనీ, అశేష ప్రభావాల ముక్తాఫలం అనీ, జాతితోబాటు దానికి చెందిన ప్రతి వ్యక్తికీ విలక్షణత్వమిచ్చే ఒక దివ్య ప్రతిభా విశేషం సంస్కృతి అనీ" దాని నిర్వచనం ముక్తసరిగా చేశారు. వారి సోదరి విజయలక్ష్మి పండిట్ భారతీయ విద్యాభవన్ వారి ఆహ్వానంపై "మన సంస్కృతి" పై రాజాజీ ఇచ్చిన మూడు ఉపన్యాసాలు గల సంపుటానికి తొలి పలుకులు రాస్తూ "ఆత్మ నిగ్రహం సాధించిన అలవాటే సంస్కృతి" అన్న రాజాజీ మాటలను వివరిస్తూ, "మానసికంగా, దైహికంగా, మానవుని అవసరాలు తీరిన పిదప అతని మూర్తిత్వానికి గౌరవ సౌరభాలను సంతరించేది సంస్కృతి" అంటారు.

ప్రసిద్ధ పత్రికా సంపాదకుడు నార్ల "ఆంధ్రప్రభ" దిన పత్రిక సంపాదకీయంలో "జీవితానికున్న విస్తృతి, దానికున్న వైవిధ్యం, దానికున్న విలక్షణత్వం సంస్కృతికి కూడా ఉన్నది. కాబట్టి సంస్కృతిని నిర్వచించడం కష్టం. ఐతే ఏది జాతి జీవితానికి విలువనిస్తుందో, వైశిష్ట్యాన్ని కూర్చుతుందో దానిని సంస్కృతిగా భావించవచ్చునేమో" అని ముగిస్తారు. "వాస్తవానికి ఒక జాతి ప్రజానీకం సంపూర్ణ చరిత్రయే సంస్కృతి చరిత్ర అంటారు" ఖండవల్లి లక్ష్మీరంజనంగారు.

ఏమైనా జాతి జీవితానికి విలువ వెలుగు నిచ్చేది, విశిష్టత చేకూర్చేదీ సాహిత్యమే. అది పెద్దల సాహిత్యం కావచ్చు. బాల సాహిత్యం కావచ్చు. సంస్కృతీ ప్రసార విషయంలో ఆ తేడాలేదు. విద్యాబుద్ధులను, సంప్రదాయాలను నేర్పడంలో తెలుగు తల్లులకు వారికి వారేసాటి. ముక్కుపచ్చలారని దశలో తల్లి పాపకు ఎవరెవరి ఎడ భక్తి ప్రపత్తులు ప్రదర్శించాలో ఇలా తెలియజేస్తుంది.

లాలను పోసీ　　నడువగ చూచీ　　మాటలు నేర్పే
పాలను తాపీ　　అడిగినవన్నీ　　ఆటలు నేర్పే
జోలను పాడే　　తడియక ఇచ్చే　　పాటలు నేర్పే
అమ్మకు జేజేలు　　నాన్నకు జేజేలు　　గురువుకు జేజేలు

బిడ్డ మరికాస్త ఎదిగాక బిడ్డ చదువుకోవాలని కలలుకంటూ -

చదువుకో నాయన్న - చదువుకో తండ్రీ
చదువుకొంటే నీకు - సౌఖ్య మబ్బేను

అంటుంది. ఇది తెలుగు తల్లి సంప్రదాయం. తరతరాలుగా తెలుగు కుటుంబాలలో అనూచానంగా వస్తున్న ఆచారం.

తెలుగు వారికి ఇష్టమైన పండుగ సంక్రాంతి. ఆ సమయంలో గంగిరెద్దులు ఊరూర తిరుగుతాయి. జానపదులు బసవన్నను ఉద్దేశిస్తూ -

బాబుగారికీ దణ్ణం పెట్టు
పత్తిగింజలు పెడతారంట
కాసులు మువ్వలు కడతారంట
పట్టు శాలువలు కప్పెదరంట
దూడూ దూడూ బసవన్న

అని పాడతాడు. తెలుగు వారి సాంస్కృతిక జీవనంలో సంక్రాంతి వేడుకలు విశిష్టమైనవి.

కుటుంబ జీవనంలో తెలుగు వారికున్న అనుబంధం, ఆప్యాయత, నమ్రత, మరే ప్రాంతం వారికి ఉండవేమో. తెలుగు వారి కోడలు పుట్టింటికి వెళ్ళేముందు భర్త అనుజ్ఞతో బాటు అత్తమామల, అక్కల, బావల, అనుమతి తీసుకునే వినయ సంపన్నమైన కోడలను గురించి -

"కలవారి కోడలు - కలికి కామాక్షి"

గేయంలో తెలియ వస్తుంది. బిడ్డ పెద్దయ్యాక అనుసరించి మర్యాద పాటించి కుటుంబ గౌరవం కాపాడవలసిన విషయాలు చిన్నప్పుడే నూరి పోస్తారు పెద్దలు. ఇది మన ఆచారము. ఇలాటి ఉదాహరణలు శతాధికంగా లభిస్తాయి. ఈ గేయాలన్నీ తర తరాలుగా వస్తున్న మన సంస్కృతీ సంపద కనుక మన ఆచారాలు, అలవాట్లు, అందు మిళితమై ఉన్నాయి.

## ఛందస్సు, అలంకారాలు

భారతీయుల దృష్టిలో తెలుగు కావ్యాలు గద్యం, పద్యం, చంపువు - అని మూడు విధాలుగా ఉన్నాయి. "గద్యతే ఉచ్యతే అనేవ ఇతి గద్యమ్" అను ఉత్పత్తిని బట్టి వచనంలో రాసిన కావ్యం గద్యం అనవచ్చు. "పద్యతే అనేవ పద్యమ్" అనే వ్యుత్పత్తిని బట్టి పద్యంలో విషయ నివేదనతో బాటు గతి అవసరమైనట్లు కనుపిస్తుంది. ఈ గతి సమకూర్చే సాధనం ఛందస్సు. గద్యపద్యాలు కలగలుపు చంపువు. కావ్య రచనకు ఛందస్సు ప్రాణం. పద్యమైనా గేయమైనా గీతమైనా ఛందోబద్ధమై క్రమశిక్షణతో నడిచే సైనికుడిలాగ నడక సాగిస్తాయి. లెక్క ప్రకారం నడుస్తాయి. అందుచేతనే ఏ ఇతర భాషలకన్నా ఛందోబద్ధమైన "తెలుగు కవిత తేనెలూరుతుంది" అనే ప్రశస్తి పొంది ఉంది.

సృష్టిలో తొలి శ్లోకం క్రౌంచమిధున సంయోగ సందర్భంలో శోకతప్త హృదయుడైన వాల్మీకి మహర్షి చెప్పిందేనంటారు. దాన్ని వారి శిష్యులు -

"సమాక్షరైతుశ్చతుర్భిర్యః
పాదైర్గీతో మహర్షిణా"

అని చెప్పుకొన్నారు. ఇది సమాక్షరాలను కలిగి, నాలుగు పాదాలు కలిగి మహర్షి చెప్పిందంటారు. కనుకనే అది పాదబద్ధం, అక్షర సమమూ, తంత్రీలయ సమన్వితమూ ఐన తేజోపుంజం అయింది.

బాల సాహిత్యంలో కూడా ఛందస్సులోను, ఛందస్సు లేకుండాను చాల కావ్యాలు వచ్చాయి. బాల సాహిత్యంలో ప్రకృతికీ మనస్సుకు అవినాభావ సంబంధం ఉంది. ప్రకృతికి శ్రుతి లయ ఉన్నది. ఈ రెంటికీ బద్ధమై ప్రకృతి నడుస్తూ ఉంటుంది. పసిపిల్లలు పుట్టినది మొదలు ప్రకృతికి సన్నిహితంగా ఉంటారు. ప్రకృతి గీతికి అనుగుణంగా వారి శరీరం స్పందిస్తూ ఉంటుంది. అందువలన ప్రకృతికి సహజగుణాలైన శ్రుతిలయలకు అనుగుణంగా ఉండే సాహిత్యం ప్రయోజనకారి అవుతుంది. బాల సాహిత్యంలో ఆటలాడుతూ ఉన్నట్లుగా ఉండే "ఆట వెలది" ఛందస్సులో పద్యాలవతరించాయి.

*చేత వెన్నముద్ద చెంగల్వ పూదండ*
*బంగరు మొలతాడు పట్టుదట్టి*
*సందిట తాయతులు సరిమువ్వ గజ్జెలు*
*చిన్ని కృష్ణ నిన్ను చేరి కొలుతు*

ఈ పద్యాన్ని పిల్లలు ఎంతో ఆనందంతో చదువుతారు. ఇలాగే పిల్లలకు సులువుగా నడిచే ద్విపద నడక కూడా "తకతకిట – తకతకిట" అనే ఐదు అక్షరాలు తాళానికి ఒదిగి ఉండటం వలన మంచి గమకం ఊపు కలిగిస్తుంది.

*గోరంత దీపమ్ము కొండలకు వెలుగు*
*గోపాలకృష్ణమ్మ గోవులకు వెలుగు*
*మాడంత దీపమ్ము మేడలకు వెలుగు*
*మారాజు అబ్బాయి మాకళ్ల వెలుగు*

ఇవే కాదు, దసరా పద్యాలు కూడా ఈ ద్విపద రూపంలోనే అల్లుకున్నాయి. పిల్లలు గిలకలను చేతబట్టి బుక్కాగుండా బాణాలను వదలుతూ –

*అయ్యవారికి చాలు ఐదు వరహాలు*
*పిల్లవాళ్ళకు చాలు పప్పుబెల్లాలు*

అనే మకుటంతో ఎన్నో పద్యాలు చదువుతారు. చిత్రమేమంటే ఈ పద్యాలను పద్యాల వలె చదువక పాటలా పాడుతారు. పాటకు కావలసినంత ఊపు పట్టు ద్విపదలో విరివిగా చోటు చేసుకున్నది. ఇలాగే తేటగీతలు, కందాలు, రగడలు కూడ బాల సాహిత్యంలో విరివిగా ఉన్నాయి.

కాగా, పసిపాపలకు, పిల్లలకు అనువుగా ఉంటే సాహిత్యం అవసరం ఉండనే ఉంది. అందుకోసం రచయితలు మాత్రా ఛందస్సును, ప్రాసలను క్రమాలంకార విధానాన్ని అనుసరించారు. నిజానికి బాల సాహిత్యంలో ఈ రకమైన ప్రక్రియలే అధికారికంగా ఉన్నవి. ఏవో కొన్ని మాత్రలను లెక్కకు తీసుకోవడం ఆ లెక్క ప్రకారం మాటలను కూర్చు కోవడం, అదే విధంగా గేయాన్ని పూర్తిగా నడపడం ఇందులోని ప్రక్రియ. సాధారణంగా రెండు, నాలుగు, ఆరు, ఎనిమిది, పది ఇలా సరిసంఖ్యతో కూడిన మాత్రలతో రాసిన గేయాలే బాల సాహిత్యంలో విరివిగా చోటు చేసుకున్నాయి. లెక్కలలో అవృత్తాలకు ఇవి బాగా పొదిగి, పాడుకొనడానికి కూడ వీలుగా ఉంటాయి. కనుక ఈ విధమైన రచనలే ఎక్కువగా రచించారు.

"చందమామ రావె జాబిల్లి రావె
కొండెక్కి రావె కోటివేలు తేవె"

ఇది నాలుగు మాత్రల ఛందస్సు - ఇలాగే -

"గుడు గుడు గుంచం, గుండే రాగం
పావడ పట్టం - పడిగే రాగం"

"చెమ్మ చెక్క చేరడేసి మొగ్గ
అట్లు పోయంగ, ఆరగించంగ"

ఈ విధానంలో సాగిన గేయాలు -

"తారంగం - తారంగం"
"తోడు పాయసం తోడు"
"ఏనుగమ్మ - ఏనుగు"

మొదలైన గేయాలు అనేకం ఉన్నాయి.

పిల్లలకు భాషలోని పదాలు పరిచయం కావడం వారిలో ఉత్సాహం పెరగడం, ఉల్లాసంగా ఉండడం ఈ గేయాల లక్ష్యం. ప్రతి పదానికి అర్థం ఉండాలనీ, అర్థం తెలియాలనే ఆశయం నాటి రచయితకు లేదు. ఈ ఆశయంతో రాసిన గేయాలలో ప్రాసను తప్పనిసరిగా ఆశ్రయించ వలసి వస్తుంది. ప్రాసలలో ఒకే సారూప్యం గల పదాలు ఉంటాయి. అలా ఉంటేనే అది ప్రాస అవుతుంది. కాగా బాల సాహిత్యంలో "ప్రాస" స్థానం అద్వితీయం, అత్యవసరం అవుతున్నది.

పిల్లలకు విశేషంగా ఆసక్తిని కలిగించే సాహిత్య ప్రక్రియలలో క్రమాలంకార సాధనాన్ని మించినది మరొకటి లేదేమోననిపిస్తుంది. ఒకే "పదం" పదే పదే పద్యంలోగాని, పాటలోగాని ఆమ్రేడితం కావడం వలన రచనకు సొబగు సమకూరుతుంది. అట్టిది ఆకర్షణీయంగా ఉండడమే గాక అర్థంలో చమత్కారం మనసును ఆకట్టుకోవడం వంటి సత్ఫలితాలు లభిస్తాయి. పోతన భాగవతంలో -

పలికెడిది భాగవతమట
పలికించెడివాడు రామ భద్రుండట నే
పలికిన భవహరమగునట
పలికెదవేరొండు గాథ పలుకగ నేలా?

పద్యంలో "పలుకు" శబ్ద పలుకు గిలుకులు, కూర్చిన శోభ ఇంతా అంతా కాదు. ఏడిద కామేశ్వరరావుగారు-

తాతవంటి తాతలేదు
గాంధీ తాతవంటి తాత
తాత తాత అని పిలువగ
తాత అతడె గాంధీతాత

"తాత" పదం ఆమ్రేడితం చేయడం వలన గేయానికి మంచి ఊపూ తూగూ వచ్చాయి. ఈ ప్రక్రియలోనే గొలుసు విధానంలో గేయం సాగిపోతే - కొన్ని పదాలు ముచ్చట గొలుపుతూ మురిపాలు చిందిస్తాయి.

కంచికి పోతావా కృష్ణమ్మా – ఆ కంచివార్త లేమి కృష్ణమ్మా
కంచిలోన ఉంది అవ్వ – ఆ – అవ్వ నాకు పెట్టు బువ్వ –
బువ్వ ఉన్నదిగాని కృష్ణామ్మా నీకు – పప్పు ఎక్కడిదోయి కృష్ణమ్మా –
కోమటి అప్పు – ఆ అప్పు నాకు పెట్టు – నాకు పప్పు

ప్రశ్నోత్తరాల రూపంలో సాగిపోయే ఈ పాటలలో పదాలు రెండు మూడుసార్లు దొర్లడం, తద్వారా – ప్రశ్నకు ప్రత్యుత్తరం దొరకడం – ఆ పదాల పసందుతో బాటు చివరికంటూ పూర్తి కావడం క్రమాలంకార ప్రక్రియలో ఒక పద్ధతి. ఈ విధంగా బాల సాహిత్యంలో పదాల పలుకులు ఆమ్రేడితాల విన్యాసాలు – అపారంగా బయలుదేరి ప్రాచీన, ఆధునిక బాల సాహిత్యాన్ని సర్వదా పరిపుష్టం చేశాయి.

ఒక విధంగా చూస్తే బాల సాహిత్యంలో "ఛందస్సు అలంకార ప్రక్రియకే ఎక్కువ ప్రాధాన్యం" ఉన్నట్లు అనిపిస్తుంది. కేవలం అలంకరించేది అలంకారం కాకుండా ప్రయుక్త విషయానికి వన్నె తెచ్చేది అలంకారమైనది! ఈ అలంకారాలు, ఆమ్రేడితాలు, మాత్రా ఛందస్సులు పిల్లలను గిలిగింతలు పెడతాయి. వారి మనస్సులను ఓలలాడిస్తాయి. పిల్లల మనస్తత్వం లాగ పిల్లల సాహిత్యం కూడ కొంత స్వతంత్ర భావ పూరితమై నేటికి దినదిన ప్రవర్ధమానంగా వెలుగొందుతూ వస్తున్నది.

## సంగీత సౌరభాలు

తెలుగువారి సంగీత సంప్రదాయాలకు భరతుని నాట్యశాస్త్రం, మతంగుని బృహద్దేశి, శారఙ్ఞ దేవుని సంగీత రత్నాకరం ఆధార గ్రంథాలు. నందికేశ్వరుని అభినయ దర్పణం తెలుగు దేశంలోనే రచించినట్లు చెబుతారు. శారఙ్ఞ దేవుడు –

*గీతం నాద్యం తథానృత్యం త్రయం సంగీత ముచ్యతే*

అని సంగీత రత్నాకరంలో చెప్పాడు. గీతం, వాద్యం, నృత్యం ఈ మూడూ కలిస్తే సంగీతం అవుతాయని అది హృద్యమంగా ఉంటుందని వారి భావన. ఈ సంగీతానికి మూలం సృష్టి. అది శ్రుతి బద్ధమైనది. ప్రకృతి సహజమైన ఈ శ్రుతిలయలు ప్రకృతిలోని గమనమంతా క్రమబద్ధంగా నడిపిస్తాయి. సృష్టి స్థితి లయ ఈ మూడు కార్యాలు క్రమ విహితంగా ప్రవర్తిస్తాయి. క్రమబద్ధమైన ఆ ప్రవర్తనను శ్రుతిలయ అంటాడు సంగీత పితామహుడు పురందరదాసు.

పసిపాపల గుండెలకు లయ ఉన్నట్లే పాప కంఠ స్వరానికి కూడా శ్రుతి ఉంది. ఈ రెండూ ప్రకృతి ప్రసాదించినవే. పసితనంలో పాపలు ప్రకృతికి చాల సన్నిహితంగా ఉంటారు. ఆ సాన్నిహిత్యం పాప ఎదుగుతున్న కొలదీ పలుచబడుతుంది. ఆ స్థానంలో స్వయం వ్యక్తిత్వం చోటుచేసుకుంటుంది. ఇది ప్రకృతి సహజం.

ఈ సహజ లక్షణాన్ని ఆలంబనం చేసుకొని పూర్వులు కొన్ని ప్రయోగాలు చేశారు. పసిపాప నుడులకు, నానుడులకు, ముద్దు ముద్దు తొక్కు పల్కులకు, నడకలకు, అతి సమీపంలో నుండే ఏక తాళం – ఖండగతినీ – ఈ రెంటినీ దృష్టిలో పెట్టుకొని ఆ గతులకు సరిపడే మాటలను కూర్చిపెట్టారు. తాళాలను ఈ విధంగా అమర్చుకున్నట్లే రాగాలను కూడా ఎంచుకున్నారు. అట్టివాటిలో మోహనరాగాన్ని ముందు పేర్కొనవచ్చు. ఈ రాగానికి స్వరస్థానాలు తక్కువ.

"సరిగ పదసా
సాదప గరిసా"

ఈ రాగాన్ని అనడానికి ఎక్కువ శ్రమ ఉండదనీ, ఏ మాత్రం ప్రయత్నించినా అనగలుగుతారనీ వారు ఊహించారు. అట్టే ఎక్కువ ఇబ్బందిలేని రాగాలను కూడా. మరి కొన్నిటిని అనగా - జంఝూటీ, అసావేరి, బిలహరి, బహుదా మొదలైనవి.

ఈ రాగాల చాయలలో ఏక ఖండ తాళాలకు అనుగుణంగా పదక్రమాన్ని నడిపినట్లయితే బాలలకు సన్నిహితమౌతాయని వారు ప్రయోగాలు చేశారు.

"చేత వెన్నముద్ద చెంగల్వ పూదండ
బంగరు మొలతాడు పట్టుదట్టి"

"వానా వానా వల్లప్ప
వాకిలి తిరుగు చెల్లప్ప"

మొదలైన గేయాలన్నీ రాగాలకు, తాళాలకు ఒదిగి నడిచేవై ఉన్నాయి. ఇంకా చిత్రమేమంటే ఈ గేయాలు పాడేటప్పుడు రాగం చాయ మాత్రంగానే సాగుతుంది. లయ మాత్రం కొంత బింకంగా నడుస్తుంది. బాల గేయాల ఎడ ఈ "రాగాలు" దోబూచు లాడినట్లు ఉన్నా పిల్లల కోసం తల్లులు పాడే పాటల్లో రాగ వరుసలు నిండురూపంలో ఉంటాయి అట్టి పాటలలో లాలిపాటలు, జోలపాటలు ముఖ్యమైనవి.

"కస్తూరి రంగ రంగా
కావేటి రంగ రంగా"

"రామలాలీ మేఘశ్యామలాలీ"

"జో అచ్యుతానంద
జోజో ముకుంద"

మొదలైన పాటలకు అమర్చిన రాగాలు అతి సున్నితమైనవి. ఎక్కువ తికమకలు లేనివి. కనుకనే శతాబ్దాలు దాటినా ఆ రాగాలు వాటి చాయలు పసిహృదయాలకు ఎంత సున్నితమైనవో - పాడేవారికి తెలుస్తుంది. ఆ లాలిపాటలు పాడినంత మాత్రాన పిల్లలు ఇట్టే నిద్రపోగలగడం గమనిస్తే ఆ రాగచాయల శక్తి ఎటువంటిదో అర్ధమౌతుంది. నాట్యభైరవి రాగంలో నెల్లూరు ప్రాంతంలో ఏడ్చే పిల్లలను ఓదార్చేందుకు-

"ఉళుళూ ఆయీ ఆయీ ఆయీ
ఆపదలు గాయి
చిన్న వాళ్ళనుగాయి శ్రీరంగశాయి"

అని పాడినప్పుడు ఆ పాటలో మాధుర్యానికి పిల్లలు నిద్రపోతారు. అంతేగాదు శతాబ్దాల తరబడి చూస్తే అట్టి నిండైన రాగచాయలు, గమనం - మాధుర్యం గల ఫణితులు మరికొన్ని రాలేదు. అంటే ఆ రాగాలను ఫణితులను నిర్ణయించిన పెద్దల ప్రతిభ ప్రస్ఫుటమౌతుంది. ఇట్లే -

"శిశుర్వేత్తి పశుర్వేత్తి
వేత్తి గాన రసం ఫణి"
"జోలల్లుపాడితే పాపలకు నిద్ర
జో జో జో..."

అని తల్లులు పాడతారు. ఆ నాగస్వరం ఎట్టిదో ఆ రాగం అలాటిది. మేళిమోళి అనే రాగంలో నాగస్వరం బుర్రలోంచి వచ్చే ధ్వని అపూర్వమైనది. ఆ బుర్ర ధ్వనికి – ఆ రాగానికి ఆ పాటల గమనానికి అనుపమ సంయోగం కుదిరింది కనుకనే నాగస్వరం అజరామరమై నిలబడింది. దానికదే గొప్ప నాదం అయింది.

పిల్లలకు, తల్లులకు, పాములకు మాత్రమే గాదు – పశువులకు అట్టి ధ్వనులు, రాగాలు ఏర్పడిపోతాయి. వేణువు ధ్వని పశువులను ఆకర్షించినంతగా మరొక ధ్వని ఆకర్షింప లేదు. బాలకృష్ణుడు మురళి చేతబట్టి ఆలపిస్తే గోవులు ఆయన చుట్టూ చేరి నిలబడి నెమరు వేస్తుండేవి ఆనాడేకాదు ఈనాడు కూడా పల్లెపట్టులలో అనగా ఒకింత నాగరికత ప్రపంచానికి దూరంగా ఉండే పల్లెతావుల్లో వేణువు లాంటిదే పొడగాటి మురళి ఊదుతూ పశువులను కాస్తుంటారు గొల్ల కాపరులు. ఆ వేణువు ధ్వని తరంగాలు వినగానే ఎక్కడి వక్కడ మేస్తూవున్న పశువులు పరుగుతో చక్కా వస్తాయి. ఆ రాగం, ధ్వని అంత సమ్మోహనమైనది.

ఇలాగ కొన్ని రాగాలు, కొన్ని తాళాలు, గీతులు, నడకలు, బాలలకు, తల్లులకు, పశువులకు, ఆనందం కలిగిస్తాయి. ఆ రాగచాయలు ఎంతో అనుభవ ఫలితాలు. వీటిని బాల గేయాలకు ఛాయా మాత్రంగా అమర్చి బాల గేయాలను అమరంగా తీర్చిదిద్ది మనకిచ్చి పోయారు పెద్దలు. అందుకే అవి చిరంజీవులు, చిరస్మరణీయాలు, బాల గీతాలకు వెలుగు దివ్వెలు.

తెలుగు బాలకవితకు, తెలుగు సంస్కృతికి ఇదంతా వెయ్యేళ్ళ విపుల సంకలనం కాకపోయినా ఒక పెద్ద ప్రయత్నం మాత్రమే. ఇంత కాలమూ బిడ్డలు సాంస్కృతీ స్రవంతిలో పెరిగి దేశ ప్రగతిలో భాగస్వాములయ్యారు పెరుగుతున్న అవసరాలకు అనుగుణంగా ఇంతకంటే మంచి అవకాశాలు వసతులు బిడ్డలకు కల్పించవలసి ఉంది. ఉజ్జ్వల భవితవ్యానికి పిల్లలకు ఈనాడు వారికి అవసరమైన పుస్తకాలు అందించాలి.

Let us give children the books
They need for better world.

అన్నారు పెద్దలు. ఈ విషయాన్ని అందరూ గుర్తించాలి. అంతేకాదు **"నీకు క్షణం తీరిక చిక్కితే నీ బిడ్డకేదైనా బోధించు. నీ చేతిలో ఒక్క కాసుంటే అది నీ బిడ్డకై వెచ్చించు"** అనే సూక్తిని కూడా గమనంలో ఉంచుకుంటే మన బిడ్డలు ప్రయోజకులౌతారు. మన దేశం ప్రగతి పథంలో పయనిస్తుంది.

*"నహికల్యాణ కృత్కశ్చిత్ దుర్గతింతాత గచ్ఛతి"*

మంచి పనులు చేసిన మానవుడెపుడూ దుర్గతిని పొందడు – అని పై శ్లోకంలో గీత చెబుతోంది. పిల్లలు భగవంతునికి చేరువగా ఉంటారు. వారి కోసం చేసే ఏ పనైనా భగవంతుడు సంతోషిస్తాడు. లోక కల్యాణం ప్రసాదిస్తాడు.

## ప్రత్యేక మనవి

ఈ గేయాల సేకరణ ఒకసారి జరిగింది కాదు. నా మిత్రులు, నేనూ గత యాభై సంవత్సరాలలో సేకరించినవి. తెలుగునాడు అన్ని ప్రాంతాలకు చెందినవి. కొన్ని గేయాలలో ప్రాంతీయమైన యాస ఉండవచ్చు. గేయాలు పాడడంలో వాటి రూపాలలో, చరణాలలో కూడా మార్పులు చేరి ఉంటాయి. హెచ్చు మార్పులున్న గేయాలను కూడ ఈ సంకలనంలో చేర్చడం జరిగింది. పరిశీలించగలరు.

– సంపాదకుడు

# ప్రార్థన గేయాలు



భారతీయులకు, తెలుగువారికి – పిన్నలకు – పెద్దలకు – ఉదయమే ప్రార్థన చేయడం ఒక ఆచారం. ప్రార్థన పిదప దినచర్యను ప్రారంభించడం ఒక సంప్రదాయం. ప్రార్థన వలన ఏకాగ్రత, చిత్తశుద్ధి, తద్వారా చేయదలచుకున్న పనులు ఫలప్రదమౌతాయని మనవారి నమ్మకం. తెలుగు బిడ్డలకు ప్రార్థనలు ఉగ్గుబాలతో నేర్పుతారు. ఉపాధ్యాయులు బాలలకు ఓం నమః శివాయః తో విద్యాబోధన ప్రారంభిస్తారు. తెలుగులో ప్రార్థనా గీతాలు అపారంగా వచ్చాయి. అవన్నీ తెలుగు పిల్లల అలవాట్లను, ఆచారాలను తెలుపుతాయి. తెలుగు పిల్లలు –

> "పొద్దున్నే పొద్దున్నే లేద్దామా?
> అందుగల పూవులు కోద్దామా?
> కోసినవి రాసులు పోద్దామా"

ఆ తర్వాత వాటన్నిటినీ దండలుగా గుచ్చి అందరూ కలసి –

> "దేవుడిగుళ్ళోకి పోదామా?
> కిర కిర తలుపులు తీద్దామా?
> దేవుడుమెళ్ళో వేద్దామా?"

అంటూ పాడతారు. పిల్లలందరికీ కృష్ణుడంటే ఎంతో భక్తి. కృష్ణ లీలలు వారికెంతో ఉత్సాహాన్ని, ఉత్తేజాన్ని ఇస్తాయి. బాలకృష్ణుని పిల్లలు ఇలా ప్రార్థిస్తారు.

> "చేత వెన్న ముద్ద, చెంగల్వ పూదండ
> బంగరు మొలతాడు పట్టుదట్టి
> సందిట కడియాలు, సరిమువ్వ గజ్జెలు
> చిన్నికృష్ణ నిన్ను చేరి కొలుతు"

ఇలాగే ఇష్టదైవాలను, తల్లినీ, తండ్రినీ ప్రార్థించే గేయాలు ఎన్నో ఉన్నాయి. శంకరంబాడి సుందరాచారిగారి తెలుగు తల్లి గేయాన్ని కూడా ఇందు చేర్చడం జరిగింది. ఇదొక మినహాయింపు.

## 1 సంప్రదాయ శ్లోకాలు

### విఘ్నేశ్వర ప్రార్థన



శుక్లాంబరధరం విష్ణుం
శశివర్ణం చతుర్భుజం
ప్రసన్నవదనం ధ్యాయే
త్సర్వ విఘ్నోపశాంతయే॥

అగజానన పద్మార్కం
గజానన మహర్నిశం
అనేక దంతం భక్తానా
మేకదంత ముపాస్మహే॥

### గురు ప్రార్థన

ధ్యానమూలం గురోర్మూర్తిః
పూజామూలం గురోఃపదం
మంత్రమూలం గురోర్వాక్యం
మోక్షమూలం గురోఃకృపా॥

గురు ర్బ్రహ్మ గురుర్విష్ణు
ర్గురు ర్దేవో మహేశ్వరః
గురు స్సాక్షాత్పరం బ్రహ్మ
తస్మై శ్రీ గురువేనమః

### సరస్వతీ ప్రార్థన



సరస్వతీ నమస్తుభ్యం వరదే కామరూపిణీ
విద్యారంభం కరిష్యామి సిద్ధిర్భవతు మే సదా
పద్మపత్ర విశాలాక్షీ పద్మకేసరి వర్ణినీ
నిత్యం పద్మాలయా దేవీ సామాంపాతు సరస్వతీ
భగవతీ భారతీ నిశ్శేష జాడ్యాపహా॥

యా కుందేందు తుషార హార
ధవళా యా శుభ్రవస్త్రాన్వితా
యా వీణావరదండ మండితకరా
యా శ్వేత పద్మాసనా
యా బ్రహ్మాచ్యుత శంకర
ప్రభృతి భి ర్దేవైస్సదా పూజితా
సా మాంపాతు సరస్వతీ
భగవతీ నిశ్శేష జాడ్యాపహా॥

## 2 జానపద గేయాలు

### చిన్ని కృష్ణుడు

చేతవెన్న ముద్ద చెంగల్వ పూదండ
బంగరు మొలతాడు పట్టుదట్టి
సందిట కడియాలు, సరిమువ్వ గజ్జెలు
చిన్నికృష్ణ! నిన్ను చేరి కొలుతు

## శ్రీకృష్ణులవారు



ఎవ్వరే నా స్వామి నవ్వుల్ల తండ్రి
శంఖ చక్రాలతో జన్మించినాడు
నవ్వు ముఖముతో నా తండ్రి కృష్ణా!
పువ్వుటుయ్యెలలోను పొంగేవురా
నిద్రపో నిద్రపో నీల వర్ణుండా
బలభద్రు తమ్ముడా! హరి! నిద్రపోరా!
నిద్రకు వెయ్యేండ్లు నీకు వెయ్యేండ్లు
నందగోపకుమారా! నవనీతచోరా!
మందరగిరిధరా! మాధవ కృష్ణా!
ఏడవకు నా తండ్రి! యేడవకు కృష్ణా!
పాడి యూచెద నిన్ను బాల గోపాల

## గోవిందుడు

గోవిందుడమ్మ - గోపాలుడమ్మా!
కొబ్బరీ బెల్లమూ కొని తెచ్చెనమ్మా!
ఏడు మేడలు మీద నన్నుంచెనమ్మ
ఏడాదికోసారి తావచ్చెనమ్మ
గజ్జెల్ల పాపణ్ణి నే గంటినమ్మ
ఎత్తుకుని ముద్దాడ తానెవ్వరమ్మ
చిక్కుడు చెట్టుక్రింద కొస్తే ఛీ ఛీ అనిపిస్తు
కాకరచెట్టు క్రిందకొస్తే కాదుకాదనిపిస్తు
పొట్లచెట్టు క్రిందకొస్తే పోపో అనిపిస్తు
పల్లెటూరు గనక బతికిపోయాడు
పట్నవాసమైతే పట్టుకు తన్నిస్తు

## రామభజన

శ్రీరామ రాముడోయి - రామభజన
రామన్న రాముడోయి - రామభజన
అయోధ్య రాముడోయి - రామభజన
కోదండ రాముడోయి - రామభజన
భద్రాద్రి రాముడోయి - రామభజన
పట్టాభి రాముడోయి - రామభజన
గోవింద రాముడోయి - రామభజన
గోపాల రాముడోయి - రామభజన
గోవింద రాముడోయి - రామభజన

## సూర్యనారాయణ స్తవం

పుట్టేటి భానుడా పుష్యరాగపు చాయ
శ్రీ సూర్యనారాయణా
పుష్యరాగముమీద పొంగుబంగరు చాయ
శ్రీ సూర్యనారాయణా
జామెక్కి భానుడా జాజిపువ్వుల చాయ
శ్రీ సూర్యనారాయణా
జాజిపూవులమీద సంపెంగ పువు చాయ
శ్రీ సూర్యనారాయణా
మధ్యాహ్న భానుడా, మల్లెపూవు చాయ
శ్రీ సూర్యనారాయణా
మల్లెపూవులమీద మంచి వంపు చాయ
శ్రీ సూర్యనారాయణా
మూడ్జాముల భానుడా, మునగపూవు చాయ
శ్రీ సూర్యనారాయణా
మునగపువ్వుమీద ముత్యంపుపొడి చాయ
శ్రీ సూర్యనారాయణా



గ్రుంకేటి భానుడా, గుమ్మడీపూ చాయ
శ్రీ సూర్యనారాయణా
గుమ్మడీ పువ్వుమీద కుంకుం పువు చాయ
శ్రీ సూర్యనారాయణా
అన్నిటా మముబ్రోచి ఆరోగ్యములు -
ఐశ్వర్యముల నిమ్ము శ్రీ సూర్యనారాయణా!

## నిత్యదానము

నిత్యదానము చేత - నియమంబు గలుగు
నిత్యదానము చేత - కష్టాలు తొలగు
నిత్యదానము చేత - సత్యంబు దొరకు
నిత్యదానము చేత - నిఖిలము లభించు
నిత్యదానము చేత - నిరయము నశించు
నిత్యదానము చేత - నెలతకూ జూడ
నిత్యముగ వైకుంఠ - సామ్రాజ్య మబ్బు

## పల్లె పదాలు

కృష్ణ కృష్ణ అనియేవు కృష్ణు తలచేవు
కృష్ణుదేమి కావలెను శ్రీ రాధకృష్ణా?
అన్నగారి కొడుకు అతి సుందరుండు
మేళంబు లాడేటి మేన అల్లుండు
శ్రీరామ జయరామ శృంగార రామ
చారు విక్రమ రామ చంద్రగిరి రామ
రామరామ అనియేవు రాము తలచేవు
రామేమి కావలెను రాఘవుల సీత?
మా తండ్రి కల్లుడు మా అత్తకొడుకు
భక్తితో సేవింప నా ప్రాణ విభుడు

**2**

శ్రీరంగం వెళ్ళేటి చిన్న వైష్ణవులు
అదిగో చూడరయ్య గాలి గోపురము
గుళ్ళోను చూడరే రంగనాయకుల స్వామి
మెడనిండా ముత్యాలు మేలుపతకాలు
తలనిండ పుట్టు వెంట్రుకలు తనరారురాక
అష్ట రావి రేక నొసలు మెరియంగ

## సింహాద్రి అప్పన్న

సింహాద్రి అప్పన్న గుళ్ళముందార
చిన్నవాడు సన్నాయి చిలకల్లు వ్రాసు
చిలకల్లు వ్రాయంగ చిట్టికరణమ్మ
మెచ్చి దీవనలిచ్చి లక్షవేయేళ్ళు
ఒక్క పరుగున వెళ్ళి ఎక్కితిని కొండ
మొక్కితిని సింహాద్రి నారసింహులను
నారసింహుడవయ్యా నా దాతవయ్యా
నావార్ని రక్షించ నీ భారమయ్యా
నీకు సేవలుచేయ నా భాగ్యమయ్యా

## దేవుని పెండ్లి

దేవుని గుడిలో - దేవర పెండ్లి
చక్కగతీర్థం - సాగించారు
పిన్నలు పెద్దలు - వేంచేశారు
బాజాలవిగో - వాయించారు
నిండా మెఱసిన - జెండాకట్టి
తావులనింపె - దండలుచుట్టి

గణగణమ్రోగే - గంటలుకట్టి
స్వామిని రథమున - సాగించారు
బాలకులారా! - భజనలు చేయుచు
బాలికలారా! - పాటలు పాడుచు
రండీ వేంకట - రమణునిచూడ
రండీ రండీ - రథమును లాగ

### భజనలు



పొద్దు పొద్దూ లేద్దామా!
అక్కల్లారా పోదామా!
పోయి పొన్నలు తెద్దామా!
తెచ్చి దండలు గుచ్చుదామా!
గుచ్చి రాముని మెడలో వేద్దామా!
దేశీ భజనలు చేదామా!

## 3 ప్రార్థన పద్యాలు

### భరత మాతకు వందనం

భరత మాతకు వందనం
భరత భూమికి వందనం
కన్నతల్లికి వందనం
కల్పవల్లికి వందనం



### పూజ

పొద్దున్నే పొద్దున్నే లేద్దామా?
అందుగల పూవులు కోద్దామా?
కోసినవి రాసులు పోద్దామా?
సాలింటికాడ సన్నదారం తెద్దామా?
దాసరింటికాడ సన్నసూది కొందామా?
అన్ని దండ దండలుగ గుచ్చుకొందామా?
దేవుడి గుళ్ళోకి పోదామా?
కిరకిర తలుపులు తీద్దామా?
దేవుడు మెళ్ళో వేద్దామా?

### మాతృ పూజ

అరటిపళ్ళు కొబ్బరి కాయలు అమ్మవారికి
పూటుగా ధనమంత - పూజారికి
చెంగల్వ పూదండ - సీతామాలక్ష్మికి
చేతిలో కాసూలు - సన్యాసికి
భక్తితో మొక్కాలి - మా అమ్మకూ
చేతులు జోడించి - చెలువు మీర
తల్లి కంటె వేరు దైవం
ఇలను లేదు ఎంచి చూడ
తల్లిగాచు ఎపుడు మనల
పాలు యిచ్చి పెంచుచుండు
ఎందుగానీ ఏమిరానీ
తల్లి మనకూ త్రోవ జూపు
మాతృ పూజా మనకు మేలు
మాతృ సేవా మనకు చాలు

### పితృ పూజ

రామా రామా బడి కెందుకురా?
చదువుకుండే టందుకురా.
చదువుకుండే దెందుకురా?

జ్ఞానం కలిగే టందుకురా.
జ్ఞానం కలిగే దెందుకురా?
సంపాదించే టందుకురా.
సంపాదించే దెందుకురా?
పెండ్లి అయ్యే టందుకురా.
పెండ్లి అయ్యే దెందుకురా?
బిడ్డల గనే టందుకురా.
బిడ్డల గనే దెందుకురా?
పెంచుకుండే టందుకురా.
పెంచుకుండే దెందుకురా?
ముప్పున సాకేటందుకురా.
సాకిన లాభమేమిటిరా
మోక్షం పొందేటందుకురా!

**రాములవారు**



శ్రీరామ! రఘురామ! శృంగార రామ!
చారు విక్రమ రామ! చంద్రముఖ రామ!
భక్తిజన దారిద్ర భంజనుడ! రామ!
ముక్తిదాయక! రామ! మునివంద్య! రామ!
శివునిల్లు విరిచిన శృంగార రామ!
అట్టె సీతను చెట్టపట్టిన రామ!
ధరణిజపతి! రామ! దశరధరామ!
పట్టంబు చేకొన్న పట్టాభిరామ!

**నమస్కారం**

వెనకా వెనకా – వేముల తోట
కనకా పండ్లు – కాముని రూపులు
మేఘా శంఖులు – మెత్తని గోళ్లు
దూదీమణుగులు – దుప్పటి రేకులు
వాగూనీళ్లు – వనముల పత్రి
తెల్లని గుళ్లో – నల్లని వినాయకుడికి
నాలుగు చేతులవాడికి – నమస్కారం

## 4 జాతీయ గేయాలు

### తెలుగు తల్లి

మా తెలుగు తల్లికి మల్లెపూదండ
మా కన్న తల్లికి మంగళారతులు
కడుపులో బంగారు కనుచూపులో కరుణ
చిరునవ్వులో సిరులు దొరలించు మా తల్లి
గలగలా గోదారి కదలి పోతుంటేను
బిరబిరా కృష్ణమ్మ పరుగులిడుతుంటేను
బంగారు పంటలే పండుతాయి
మురిపాల ముత్యాలు దొరలుతాయి
అమరావతీ నగర అపురూప శిల్పాలు
త్యాగయ్య గొంతులో తారాడు నాదాలు
తిక్కయ్య కలములో తియ్యందనాలు
నిత్యమై, నిఖిలమై నిలిచియుండేదాక
రుద్రమ్మ భుజశక్తి, మల్లమ్మ పతిభక్తి
తిమ్మరుసు ధీయుక్తి, కృష్ణరాయల కీర్తి
మా చెవుల రింగుమని మారుమ్రోగేదాక
నీ ఆటలే ఆడుతాం – నీ పాటలే పాడుతాం
జై తెలుగు తల్లీ ! జై తెలుగు తల్లీ !

– శంకరంబాడి సుందరాచారి

## తెలుగు తల్లికి వందనం

వందనం, వందనం
తెలుగు తల్లికి వందనం
నందనం, నందనం
తెలుగు భూమి నందనం
సుందరం, సుందరం
తెలుగు గడ్డ సుందరం
చందనం, చందనం
తెలుగు నేల చందనం
సుమధురం, సుమధురం
తెలుగు భాష సుమధురం
అందరం, అందరం
తెలుగు బిడ్డల మందరం
ఉండెదం, ఉండెదం
కలసి మెలసి ఉండెదం
పెంచెదం, పెంచెదం
తెలుగు కీర్తి పెంచెదం
పంచెదం, పంచెదం
తెలుగు వెలుగు పంచెదం
వందనం, వందనం
తెలుగు తల్లికి వందనం



## వందేమాతరం

వందేమాతరం
సుజలాం సుఫలాం మలయజ శీతలాం
సస్య శ్యామలాం మాతరం;
వందేమాతరం
శుభ్రజ్యోత్స్నా పులకిత యామినీం
ఫుల్లకుసుమిత ద్రుమదళ శోభినీం
సుహాసినీం సుమధుర భాషిణీం
సుఖదాం వరదాం మాతరం
వందేమాతరం

- బంకించంద్ర ఛటర్జీ

## జనగణమన

జనగణమన అధినాయక జయహే!
భారత భాగ్య విధాతా!
పంజాబ, సింధు, గుజరాత, మరాఠా,
ద్రావిడ, ఉత్కళ, వంగ!
వింధ్య, హిమాచల, యమునా, గంగ,
ఉచ్ఛల జలధితరంగ!
తవ శుభనామే జాగే!
తవ శుభ ఆశిష మా గే!
గాహే తవ జయ గాథా!
జనగణ మంగళదాయక జయహే
భారత భాగ్యవిధాతా!
జయహే! జయహే! జయహే!
జయ జయ జయ జయహే!

- రవీంద్రనాథ్ ఠాగూర్

## సారే జహాఁసె అచ్ఛా

సారే జహాఁసె అచ్ఛా హిందుస్తాఁ హమారా
హమ్ బుల్ బులేఁహై ఇస్కే, యే
గుల్సితా హమారా॥

పరబత్ వో సబ్ సే ఊంఛా హమ్
సాయా ఆస్మాఁకా
వో సంతరీ హమారా! వో పాస్బా
హమారా॥

గోదీమె ఖేల్తీహైఁ ఇస్కీ హజారో
నదియాఁ
గుల్షన్ హై జిన్కే దమ్సే రష్కే
జినాఁ హమారా॥

మజ్-హబ్ నహీఁ సిఖాతా ఆపస్మె
బైర్ రఖ్నా
హిందీ హైఁ హమ్, వతన్ హై
హిందుస్తాఁ హమారా॥

- మహ్మద్ ఇక్బాల్

# ప్రార్థనా పద్య తోరణం



నీ పాద కమల సేవయు
నీ పాదార్చకులతోడి నెయ్యము నితాం
తాపార భూతదయయును
తాపస మందార నాకు దయసేయగదే!

తొండము నేకదంతమును తోరపుబొజ్జయు వామహస్తమున్
మెండుగ మ్రోయు గజ్జెలును మెల్లని చూపులు మందహాసమున్
కొండొక గుజ్జు రూపమున కోరిన విద్యలకెల్ల నొజ్జయై
యుండెడి పార్వతీతనయ యోయి గణాధిప! నీకు మ్రొక్కెదన్

తల్లీ నిన్ను దలంచి పుస్తకము చేతన్ బూనితిన్ నీవు నా
యుల్లంబందున నిల్చి జృంభణముగా నుక్తుల్ సుశబ్దంబు శో
భిల్లం బల్కుము నాదు వాక్కునను సంప్రీతిన్ జగన్మోహినీ
ఫుల్లాబ్జాక్షి సరస్వతీ భగవతీ పూర్ణేందుబింబాననా!

ఒక సూర్యుండు సమస్త జీవులకు దా నొక్కక్కడై దో చు పో
లిక నే దేవుడు సర్వకాలము మహాలీలన్ నిజోత్పన్న జ
న్య కదంబంబుల హృత్సరోరుహములన్ నానా విధానూన రూ
పకుడై యొప్పుచునుండునట్టి హరి నే బ్రార్థింతు నశ్రాంతమున్!

ఎవ్వనిచే జనించు జగ మెవ్వనిలోపల నుండు లీనమై
యెవ్వనియందు డిందు పరమేశ్వరుడెవ్వడు మూలకారణం
బెవ్వడనాది మధ్యలయు డెవ్వడు సర్వము దానయైన వా
డెవ్వడు వాని నాత్మభవు నీశ్వరు నే శరణంబు వేడెదన్.

# జోలపాటలు



వీటిని "దాది పాటలు" అని కూడా అంటారు. జోల పాటలు తెలుగుతల్లి ప్రత్యేకత. ఈ పాటలలోనే తల్లి బిడ్డకు అన్ని విషయాలు చెబుతుంది. తల్లి హృదయానికి దర్పణంగా ముగ్ధ మనోహరంగా జోల పాటలు ఉంటాయి ప్రధానంగా ఇవి తల్లుల రచనలు. ఆ నోట ఆ నోట పాడబడడం చేత మార్పులకు చేర్పులకు గురైనాయి. తల్లి తన ముద్దుల బిడ్డను దేవతలు ఆశీర్వదించాలని వేడుకుంటూ –

*"శ్రీరమ్య దేహ లాలీ! మా ముద్దూ*
*చిన్నారి కూన లాలీ*
*గారాల కూచి లాలీ! మాయప్పా!*
*కంజాతనయన లాలీ॥*
*దేవేశుడా విధాతా నీకు తా*
*దీర్ఘాయు వొసగుగాత॥"*

అని కోరుకుంటుంది. ఐతే ఇది పిల్లల కోసం రాసిన పాట కాదని కృష్ణశ్రీగారి అభిప్రాయం. ఇదే అభిప్రాయాన్ని ఆర్ వి ఎస్ సుందరంగారు తన సిద్ధాంత వ్యాసంలో కూడా వెలిబుచ్చారు. ఐనా ఇవి పిల్లలు పాటలుగానే చలామణి అవుతున్నాయి.

తల్లికి బిడ్డను జోకొట్టి జోలపాడి నిద్రపుచ్చి తాను ఆనందించడమనేది ఒక చర్య మాత్రమే గాదు. అవ్యక్తానందాన్నిచ్చే మధురాతి మధురమైన దివ్యానుభూతి మాటలకు ఆలోచనలకు అందనిది. తెలుగు జోల పాటల్లో తాళ్ళపాక అన్నమయ్యగారి రచన "జో అచ్యుతానంద జో జో ముకుందా" చాల ప్రసిద్ధమైనది. పల్లెలలో, పట్నాలలో ప్రతి గృహంలో ప్రాచుర్యం పొందింది.

ఆ బిడ్డ తల్లికి కేవలం బిడ్డ మాత్రమే గాక అచ్యుతమైన ఆనంద సంధాయకమైన ముకుందుడుగా కనుపిస్తాడు. తల్లి అలా ఊహిస్తుంది. ఆ తల్లి ఊహలన్నీ అమృతధారలుగా రసవద్గంగలా ఆశువుగా ఆమె నోటి నుండి పాటలుగా జాలువారడం మనం చూస్తుంటాము.

"తొలుత బ్రహ్మాండంబు తొట్టెగావించి
నాలుగు వేదాలు గొలుసు లమరించి"

అని పాడుతూ తన బిడ్డను సాక్షాత్తూ బాలకృష్ణుడుగా భావించి -

లాలనుచు పాడరమ్మా బిడ్డ
లక్ష్మీ విలాసుడమ్మా
పాదమున చక్రమమ్మా ఈ బిడ్డ
వేదాంత వేద్యుడమ్మా
వేణునాదంబుతోను ఈ బిడ్డ

అని గొప్పగా అవ్యక్తానందంతో ఊహించుకుంటుంది ఆ అమాయకపు తల్లి అమృతవల్లి. ఈ విధంగా తెలుగు తల్లులు పాడే జోలపాటలలో తెలుగు సంస్కృతీ చాయలు వెల్లివిరుస్తూ ఉంటాయి.

## ఉగ్గు పాటలు

వీటినే పాలపాటలు అని గూడ అంటారు. లాలి పాటలు కూడ కొంత వరకు ఈ కోవకు చెందినవే. ఆరోగ్య విషయం అలా ఉండి ఉగ్గు పట్టడం తెలుగుతల్లి అలవాటు. ఉగ్గు పాటలు తెలుగుతల్లి సంప్రదాయం. ఉగ్గు పదుతూ తల్లి బిడ్డను ఆశీర్వదిస్తుంది బిడ్డ పెరుగుదలను ఆశిస్తుంది.

ఊఁ ఊఁ ఉంగన్న ...
ఉగ్గుపాలు ఇందన్న ...

అంటూ -

జీర్ణం జీర్ణం వాతాపి జీర్ణం
గుఱ్ఱాల్ తిన్న గుగ్గిళ్ళరిగి
ఏనుగుల్ తిన్న వెలక్కాయ లరిగి
అబ్బాయి తాగిన పాలు ఆముదం అరిగి

ఈ గేయం పాపకు అర్థం కావాలని కాదు. గేయం పాడుతూ తల్లి ఒక అవ్యక్తమైన ఆనందానుభూతి పొందుతుంది.

"రోజు రోజుకు పాపాయిలో వచ్చే మార్పు మన సంస్కృతీ స్రవంతిలో మిళితం చేయడానికి ఈ పాల గేయాలు మధురమైన ఆలంబనాలు" అంటారు కవిరావుగారు. ఈ గేయాలలో సాధారణంగా రెండే పాత్రలుంటాయి. అవి తల్లి-బిడ్డ. చిట్టి పొట్టి మాటలతో తల్లి బిడ్డను అలరిస్తుంది. ఇచ్చట భాష భావానికి అతీతంగా ఉరకలు వేస్తుంది. తనకు తెలిసిందల్లా బిడ్డకు తెలియాలనే ఒక అవ్యక్తమైన తపనతో బిడ్డచేయి ఊపుతూ -

"చేయి ఊచమ్మ చేయి వూచు
సంతకు పోదాం చేయి వూచు
శనగలు తిందాం చేయి వూచు
చల్లగ తిందాం చేయి వూచు"

అంటుంది. ఇలా చేయడం తల్లికీ పిల్లకు సరదా కాక బిడ్డకు వ్యాయామం కూడ. డాక్టర్ బిరుదురాజు రామరాజుగారు తెలంగాణా ప్రాంతంలో ప్రచారంలో ఉండే ఒక పాట ప్రయోజనాన్ని ఇలా వివరించారు. "తల్లి శిశువును తన తొడలపై కూర్చుండబెట్టి ఒక చేయి బిడ్డ వీపు పైన మరొక చేయి రొమ్ముపై ఉంచి పాట పాడుచు ముందు వెనుకల కూపుచు తాను కుడి ఎడమల కూగును. శిశువు ఊ ఊ అనుచూ వెనుక ముందుల కూగును. దీనివలన శిశువు శరీరమున కంతటికీ కావలసినంత పరిశ్రమ కలుగును ఊపుతో శరీరమంతట రక్త ప్రసారం జరుగునటులే ఈ పాట యందలి "గంగెద్దా" యను అంత్యప్రాసలు లయను రక్తము వెంట శరీరమంతటను ప్రాకించును" ఉదా :

*"ఊగూ ఊగూ గంగెద్దా*
*ఉగ్గూపాలే గంగెద్దా*
*సోలీ ఊగే గంగెద్దా*
*సోలెడుపాలే గంగెద్దా*
*తాళీ ఊగే గంగెద్దా*
*తవ్వెడు పాలే గంగెద్దా*
*మారీ ఊగే గంగెద్దా*
*మానెడు పాలే గంగెద్దా*
*ఆగీ ఊగే గంగెద్దా*
*అడ్డెడు పాలే గంగెద్దా"*

ఇలా సాగిపోతుంది ఈ పాట. బిడ్డలో ఉత్సాహం రావడానికి ఆ తల్లి గిలిగింతలు పెడుతుంది. బిడ్డ కొంత ఎదిగాక గోరుముద్దలు గొలుసు ముద్దలు తినిపిస్తూ చందమామ ముచ్చట్లు చెబుతూ -

"చందమామ రావె - జాబిల్లి రావె
కొండెక్కి రావె - గోగుపూలు తేవె"

అని పాడుతూ మారాము చేస్తున్న బిడ్డకు గోరుముద్దలు తినిపిస్తుంది తల్లి. ఇలా చేయడం ఈ నాటికీ తెలుగు తల్లికి సరదా. ఆ మాటకు వస్తే బిడ్డను పెంచడంలో తెలుగుతల్లికి ఒక ప్రత్యేకత ఉన్నదనిపిస్తుంది. తన కను సన్నలలో పెరిగిన బిడ్డలో వ్యక్తిత్వం తనంత తానే రూపొందుతుంది. ఆలోచన పెరుగుతుంది. ఊహలు, ఊగిసలాడతాయి. తానే ఒక కవి అవుతాడు. గాయకుడౌతాడు. పాటలు కడతాడు. పాడుతాడు.

"ఉడతా ఉడతా ఊత్
ఎక్కడికెళ్ళా వూత్
నూకలు పెడతా మేకలు కాస్తావ్?
పెద్దపులొస్తే జడవవుకా?"

"ఊగూ ఊగూ బసవన్నా
ఉలవలు తినరా బసవన్నా"

ఇలా కొల్లలుగా గల పాపలని పిల్లలు పాడతారు. ఇది తెలుగు పిల్లల ప్రత్యేక ప్రవృత్తి. తెలుగు జానపద గేయాల సంపద. జోల పాటలు తెలుగునాట అపారంగా నిరాదరణకు గురై చాల వరకు కాలగర్భంలో కలసిపోయాయి. మిగిలినవి చాల తక్కువ. ఉన్న వాటిలో కొన్ని ఇచట ఇస్తున్నాం.

## జోవచ్యు తానంద

జోవచ్యు తానంద జోజో ముకుంద
రావె పరమానంద రామ గోవింద॥
నందు నింటను జేరి నయము మీఱంగ
చంద్రవదనలు నీకు సేవ చేయంగ
నందముగ వారిండ్ల నాడుచుండంగ
మందలకు దొంగ మాముద్దురంగ ॥జోవ॥

పాలవారాశిలో పవళించినావు
బాలుగా మునుల కభయమిచ్చినావు
మేలుగా వసుదేవ కుదయించినావు
బాలుడై యుండి గోపాలుడైనావు ॥జోవ॥

అట్టుగట్టిన మీగ డట్టె తిన్నాడే
పట్టి కోడలు మూతిపై రాసినాడే
అట్టె తినెనని యత్త యడుగ విన్నాడే
గట్టిగా నిది దొంగ కొట్టుమన్నాడే ॥జోవ॥

గొల్లవారిండ్లకు గొబ్బునకుబోయి
కొల్లలుగా త్రావి కొండలనునేయి
చెల్లునా మగనాండ్ర జెలిగి యీశాయీ
చిల్లతనములు సేయ జెల్లునటవోయి ॥జోవ॥

రేపల్లె సతులెల్ల గోపంబుతోను
గోపమ్మ మీ కొడుకు మా యిండ్లలోను
మాపుగానే వచ్చి మామానములను
నా పాపడే చెఱిచె నేమందుమమ్మ
ఒకని యాలినిదెచ్చి నొకని కడబెట్టి
జగడములు గలిపించి సతిపతులబట్టి
పగలు నలుజాములును బాలుండై నట్టి
మగనాండ్ర జేపట్టి మదనుడై నట్టి ॥జోవ॥

అంగజుని గన్న మా యన్న యిటు రారా
బంగారు గిన్నెలో బాలు పోసేరా
దొంగ నీవని సతులు పొంగుచున్నారా
ముంగిట నాడరా మోహనాకార ॥జోవ॥

గోవర్ధనంబెల్ల గొడుగుగాబట్టి
కావరమ్ముననున్న కంసుబడగొట్టి
నీవు మధురాపురము నేలజేపట్టి
రీవితో నేలిన దేవకీపట్టి ॥జోవ॥

అంగుగా దాళ్ళపా కన్నయ్య చాల
శృంగార రచనగా జెప్పెనీ జోల
సంగతిగ సకల సంపదల నీవేళ
మంగళము తిరుపట్ల మదనగోపాల ॥జోవ॥

## హాయి హాయి ఆపదలు గాయి

హాయిహాయనగాను ఆపదలు గడచు
చిన్న వారలగాచు శ్రీవేంకటేశు హాయి॥

రావెరావె పిట్ట రత్నాలపిట్ట
కర్రదేవే పిట్ట కనకణ్ణి కొట్ట హాయి॥

వాసాల మీదది మీసాలపిల్లి
అబ్బాయిచేతిది హంసల్లగిలక హాయి॥

జోలపాపడికి జోడుంగరాలు
చిన్ని నా బిడ్డకు పమిడుంగరాలు హాయి॥

చిన్నారి పొన్నారి చిఱుతడవు నీవు
పొన్న మానుమీది చిన్నికృష్ణుడవు హాయి॥

ఆడితే ముద్దమ్మ పాడితే ముద్దు
అందరికి అబ్బాయి అల్లారుముద్దు హాయి॥

ఏకులరాటమ్ము ఇంటికందమ్ము
మా చిన్ని అబ్బాయి మాకు అందమ్ము హాయి॥



ఉసిరికాయలతోట ఊరికందమ్ము
ఉత్తముడు అబ్బాయి మాకు అందమ్ము హాయి॥
చిన్నారి పొన్నారి చిలుకవే నీవు
గున్న మామిడి మీది చిన్ని కోకిలవే హాయి॥
జోలల్లు పాడితే బాలలకు నిద్ర
నాగస్వరం ఊదితే నాగులకు నిద్ర హాయి॥
జోలలకు జొన్నకూడు బాలలకు వరికూడు
ఏడ్చేటి అబ్బాయికి ఎల్లావులపాలు హాయి॥
ఆ యింటి సందులో యీ యింటి సందులో
అలచంద పూవలె మెరసెనబ్బాయి హాయి॥
ఏడవకు ఏడవకు వెర్రి అబ్బాయి
ఏడిస్తె నీ కండ్లు నీలాలుకారు హాయి॥
నీలాలు కారితే నేనోర్వలేను
పాలైన కారవే బంగారు కనుల హాయి॥
ఊరెల్లతిరిగేటి ఓ ఊరుబిల్లీ
ఊరుకున్నబ్బాయికి ఉగ్గెట్టిబోవే హాయి॥
పాడెల్ల తిరిగేటి ఓ పల్లగాడ్దె
పండుకొన్న పాపనికి పాలిచ్చిపోవె హాయి॥
రాకాసి రావణుని తాను అబ్బాయి
రాజునుకొట్టేసి తా రాజ్యమేలు హాయి॥

చిచ్చోలోలో హాయిహాయి ఆపదలుగాయి
చిన్నవాళ్ళనుగాయి శ్రీవెంకటేశ!
శ్రీవెంకటయ్య దిక్కునీవయ్య
శరణన్న వారిని చేకొనుమయ్య
తిరుపతికి బొయ్యేటి చిట్టిదాసరి
తిరువెంగళప్పకి ఎందరే స్త్రీలు?
పెద్దాపె నాంచారు పేరు తులశమ్మ
అందరిలో చక్కనిది అలుమేలు మంగ
చిలకల్లు చెలరేగి జీడికొమ్మెక్కు
అబ్బాయి చెలరేగి మామ భుజ మెక్కు
మామ భుజ మెక్కి యేమేమియడుగు?
పాలు త్రాగ గిన్నడుగు పాడావునడుగు
ఎందుకు యేడ్చేవు? ఏలయేడ్చేవు?
పాలకు యేడ్చేవు పసి బిడ్డ నీవు
ఆడితే పాడితే అవ్వలకు ముద్దు
చప్పట్లు తట్టితే తాతలకు ముద్దు
చిన్ని నా అమ్మాయి చీమంతెకద్దె
ఏడ్చేటి ఏడ్పుకు కొండలదురును
చిట్టిముత్తెముపుట్టె సీత కడుపున
స్వాతివాన కురిసె సముద్రంబు నిండ
చిన్ని నా అమ్మాయి నవ్విపలికితే
మునిపండ్ల ముత్యాలు విగడ పొగడాలు
చక్కిళ్ళు చామంతి రేకులుబోలు
తీరు తీరూ కొండ తీరైనకొండ
తీరైయున్నదే తిరుపతీ కొండ
అందరిమామలు చందమామలు
అబ్బాయి మామల్లు రామలక్ష్మణులు
బూచివాడికి బువ్వ పెట్టనేరాదు
పెట్టితే అబ్బాయిని పట్టుకొని పోను

నిద్రపో నిద్రపో నీలి వచ్చినది
నీలి జంగమ వెంట బూచి వచ్చినది
నిద్రకు వెయ్యేండ్లు నీకు వెయ్యేండ్లు
నీతోటి బాలురకు నిండు వెయ్యేండ్లు
నిద్రపో నిద్రపో భద్రశయనుడ
బలభద్రశయనుడ! హరి నిద్రపోర.

**3**

ఆట మాణిక్యమే పాట మాణిక్యం
నట్టింట అమ్మాయి రత్న మాణిక్యం
ఆడంగ ముద్దమ్మ పాడంగ ముద్దు
చిన్ని నా అమ్మాయి చీరకేడిస్తే
నెయ్యిరా సాలీడ నేత్రాన పట్టు
మురుస్తు సాలీడు మూణ్ణెల్లు నేసు
అరుస్తు చాకలి ఆర్నెల్లు వుతుకు
వేడుకతో అమ్మాయి వెయ్యేళ్ళు కట్టు
ఆ చీర కట్టంగ అందరికి ముద్దు

**4**

మగువనా అబ్బాయి మాటల్లు జూచి
మాణిక్యములతోటి పొడిచె సూర్యుడు
చిన్ని నా అబ్బాయి చిరుముఖము జూచి
సిగ్గుపడి చంద్రుడు పొడవనేరడు
పొద్దున్నే రావోయి భోగిసూర్యుడ
పొడగన్న వారెల్ల నీకు మ్రొక్కేరు
రాత్తిరికి వస్తేను రామచంద్రుడ
రాచవారోడుచు నిన్ను రానియరు
పుణ్యమ్ము గలవారి పందిళ్ళ క్రిందా
ఆడుచు వుంటేనే తాను అబ్బాయి
పుణ్యమ్ము గలవారి పూతోటలోను
పింఛమిచ్చాడింది సోగల్ల నెమలి
చిలకల్లు మాయింటి చెలికత్తెలమ్మ
హంసల్లు మాయింటి ఆడపడుచులు
కోవెలలు మాయింటి కొత్త కోడండ్లు
అబ్బాయి మాయింటి ముద్దు మనవడు
పుణ్యమ్ము గలవారి పువ్వుల్ల చీర
భాగ్యమ్ము గలవారి పందిళ్ళ కళ్ళూ
అందెల్లు పెట్టేడు తాను అబ్బాయి
అందుకొని ఆ చీర పువ్వుల్లే కోసు
కాళ్ళ కడియాల తాత అబ్బాయి
వద్దు రమ్మని పిలుచు ముద్దు తమ్ముణ్ని
తిరుమంత్రమే వీరి తిరుమేనులైయుందు
పరగద్వయమే వీరి పాదాంబుజములు
చరమార్థమే వీరి చలవ తిరునయనములు
ఉరు నాభికమలమే ఓం కారము
పరంజ్యోతి ప్రణవమే పట్య మంచమాయ
పరగాది శేషుడే పానుపాయ
లాలెమ్మ గుఱ్ఱాలు లంకలు మేసు
అబ్బాయి గుఱ్ఱాలు మేసు పల్లాలు
తొట్టి నాగన్నకు తోడెవ్వరమ్మ
ఏనుగుల ఎక్కేటి రాయప్ప తోడు
ఆడుకొని అబ్బాయి వచ్చె గాబోలు
అందెల్లు చప్పుడాయె అరుగుల్ల మీద
చదువుకొని అమ్మాయి వచ్చె గాబోలు
సరస్వతీ చప్పుడాయె చావిడిలోను
గోల్కొండ కడనుండి డంకా నగారా
గొబ్బున్న కొనివచ్చి గోవిందుకిచ్చె
నెల్లూరి అంగట్లో నెమలి వాలింది

నెమలి కేసిన అంబు నేలకానింది
సింహపురి సింహపురి అందురే కాని
చూపులకు సింహపురి చుట్టుకొల్లారు
కోమట్లకు సింహపురి కొంగు బంగారు
బ్రాహ్మలకు సింహపురి పెన్న స్నానమ్ము
ఇల్లలికి ముగ్గుపెట్టి ఇంతపని చేసి
ఈ యింటి ఆడోడుచు ఎందుపోయినదో?
ఈ యింటి ఆడొడుచు తాను రాజ్యలక్ష్మి
అన్నలతొ వియ్యమ్ము అంద పోయినది
పోక వన్నె చీర కట్ట వేడుకె
పొరుగూరి పెండ్లికి పోనువేడుకె
వన్నె చీరందమ్ము వీడెమందమ్ము
వెలదికి అర్నెల్ల వేకటందమ్ము
పట్టుచీర లందమ్ము పాపడందమ్ము
చుట్టరె చుట్టరె పడక చక్కిలాలు
చిన్న నా అబ్బాయి వడుగు మా యింట
వండరె వండరె వడుగు వంటల్లు
వల్లభుడు జగన్నాధు వడుగు మా యింట
ఆటకూటమ్మున ఆడేటి నెమలి
వేటకాడొచ్చాడు ఆటచాలించు
నాటకపు శాలలో నవ్వేటి పద్మ
నీ మొగుడు వచ్చేడు నవ్వు చాలించు
దిగువ తిరుపతిలోను దీపాలు వెలుగు
ఎగువ తిరుపతిలోను ఏరాజు పెండ్లి
దిగువ తిరుపతిలోను దీపములు వెలుగు
అప్పయ్య అలివేలు మంగ పెళ్ళిళ్ళు
ప్రొద్దు ప్రొద్దు లేచి ఎక్కుదము కొండ
మ్రొక్కుదము మనపాలి వెంకటప్పణ్ణి
శ్రీ వెంకటయ్య దిక్కునీవయ్య
బాలులను రక్షించ నీ భారమయ్య
అలివేలు మంగమ్మ ఆడిన్న పసుపు
అప్పయ్య కోనేట తెప్పలై తేరు
వెంకటప్పని కొండ వెలిశుండ వలెను
ఎప్పటికి పుట్టిల్లు కలిగుండ వలెను

**5**

ఏమే ఓ చిట్టి - ఏడవకే ఈ రొట్టిముక్క
విరచిపెట్టి - నిన్ను పడుకోబెట్టనా జో కొట్టి ఏమే॥
అదుగో బూచివాడు
మన అటక మీదున్నాడు
ఏడుస్తే వాడు నిన్నెత్తుకుపోతాడు ఏమే॥

మిట్ల గ్రుడ్డివాడు
పొణకంత పొట్టివాడు
మన తట్టలో దాగున్నాడు
జడ పట్టుకు లాగుతాడు ఏమే॥

నోరు చూపుతాడు
పలుకోరలు చూపుతాడు
నీ అరడి విన్నాడూ
ఈసారి ఊరుకోడు ఏమే॥

అల్లరి చేయకమ్మ
నీకు బెల్లము పెట్టెదనమ్మా
అల్లరి చేయకమ్మ
పల్లకీ యిదిగోనమ్మా
ఇల్లా అల్లరి చేసేవాళ్ళను
పిల్లికి యిచ్చేస్తాను ఏమే॥

కన్నతల్లి నీవు
కాటికి పెట్టించుకోవే

వాళ్ళ అమ్మాయి చూడు
నిను చూచి నవ్వుతోంది ఏమే॥

ఉయ్యా లూపిస్తాను
బట్లకొయ్యను చూపిస్తాను
నెయ్యా బువ్వ తిను
తాతయ్య నిన్నెత్తి కొనును ఏమే॥

## 6

నిదురపోగదుర బాల
నీపై పదము పాడెదనుజాల
నీవు నిదుర బోకుంటేను
అదుగో బూచాడు మూల
పొంచుండెగదర శ్రీరమణలోల
నిదురపోగదుర బాల
వట్టి రట్టీల కొడుక
మాయన్న ముద్దుల ముద్దు విడకు
కొట్టసాగెదరు నిన్ను
పాలుబువ్వ పెట్టెదమన్న తినకు
నిదుర పోగదుర బాల
తామరసభవుని జనక
చీకటి రాముని బ్రోవు మనక
సోమసుందరుని కొడుక
సత్యభామా రమణి కులిక పడక
నిదురపోగదుర బాల

## 7

ఉల్లాయాచీ! చొల్లా యాచీ!
పొద్దూ పొద్దూ ఒక చాయ పొద్దెక్కి ఒక చాయ
పొద్దుపోయె చెల్లమ్మ పొన్న పూచాయ
జాము జాము వొకచాయ జామెక్క చాయ
జామూపై చెల్లమ్మ పొగడపూ చాయ
దామరాగుంటక్కు తలకడక పోతే
జల్లు జల్లు మని రాలె జాజి పువ్వూలు
నిద్రపోచెల్లమ్మా నీ నిద్రలేలా
నిద్ర కన్నెకలొచ్చి నిన్ను లేపెదరు
నిద్రకూ వెయ్యేళ్ళు నీకూ వెయ్యేళ్ళు
నిన్నుగన్న తల్లికీ నిండు నూరేళ్ళు
అందరీ మామల్లు చందమామల్లు
చెల్లమ్మ మామల్లు రామలక్ష్మణులు
చెల్లమ్మ బుద్ధులూ వేణునాదములు
నిండు పున్నమినాడు చందమామ నిన్ను
కోరి పోయాడమ్మ నీ మేనమామ!
ఏడవకు ఏడవకు వెర్రి చెల్లమ్మ!
ఏడిస్తే నీ కంట్లో నీలాలు కారు
నీలాలు కారితే నే చూడలేను
పాలయిన కారవే బంగారు కండ్లా

## 8

జో జో ముద్దులబాల
జో జో పరమ సుశీల
జో జో భారతపుత్రీ
జో జో సారసప గాత్రీ
చిన్నిమోము చిన్నిపోవ
కన్ను చెదర ఏడువనేలా
కన్నతల్లి కారణములేమొ
కరములెత్తి ఆడవె తల్లి ॥జో॥
దంతపు టుయ్యాలలోన
ధగధగ మెరిసేటి పాన్పుపైన

చింతలేక నిదురాపోవా
ఇంత ఆగడమేమొగాని ॥జో॥
పాలుత్రాగునాడె నీవు
పాడవలెనని సీతా చెరితం
భూమిమీద పరుగిడినపుడే
భూరివిద్యలు నేర్చేవుతల్లీ॥జో॥
భారతీయ నారీమణులూ
భాసిల్లుము సీతాచెరితం
కన్నతల్లి కారణమేమి
ఖరములెత్తి ఆడవె తల్లీ ॥జో॥

**9**

జో జో ముద్దులబాలా
జో జో పరమ సుశీలా
జో జో భారతపుత్రీ
జో జో పాపన గాత్రీ ॥జో॥
చిన్నమోమూ చిన్నబోవా
కన్నులు చెదరి ఏడువనేల
కన్నతల్లి కారణమేమో ॥జో॥
కన్నులు మూయవె కనకపుబొమ్మ॥జో॥
దంతపూటుయ్యాలాలోనూ
ధగధగ మెరసేటి పానుపుపైనా
చెంతలేక నిదురబోవా
యింతీ యాగడమేల
తండ్రీ ॥జో॥
పాలుత్రాగీనాడేవాడు
పాడవలయును సీతాచెరిత ॥జో॥
భూమీమీద పరుగిడినపుడే
భూరివిద్యలు నేర్పవేతల్లీ ॥జో॥

**10**

శ్రీరామ చంద్రుదూ
సీత వల్లభుడూ
యిచ్చుమాఅమ్మాయికి
యిచ్చు సంపదలు
చుక్కలలోను
చిన్న బాలుడున్నాడా
ఆబాల గోపాల
బాలుడున్నాడు
పంచదారకుప్ప
పాలపై తెప్ప
మా చిన్న అమ్మాయి
బంగారుకుప్ప
కోటకుర్చీ మీద
రాజు కూర్చోని
కొమ్మ నిమ్మా పండు
తాతెమ్మ నేనూ
కోటకుర్చీ మీద
రాజు మీ తాత
కొమ్మనిమ్మాపండు
తాను అబ్బాయి
రత్న కంబళిమీద
రాజు మీ మామ
పారాడు పంజరపు
చిలక అమ్మాయి
ఎందాకపోయినది
చిన్న అమ్మాయి
ఏ స్వామి యిచ్చె నే
ఎత్తి ముద్దాడీ

పరమేశ్వరుల రాణి
పార్వతీ దేవి
పార్వతీ యిచ్చింది
పాప అమ్మాయిని
చామంతి పులిగోరు
చుట్రావిరేకు
చిన్నవాండ్లాడెదు
రేపల్లెలోనూ
మాడంత బంగారు
మద్దెకాయల్లు
మహరాజు మాతల్లి
మనుమరాలాయె
ఏరంత వెలుపమ్ము
యిసుక సన్నమ్మ
ఏరుదాటి వెళ్ళింది
ఎవరాడబడుచు
మూటనున్నది పసుపు
పొట్లాన కుంకం
వడినిండ పోకల్లు
పండుటాకుల్లు
భమిడి శ్రీపిల్లమ్మ
సారె వెళ్ళింది
ఊరికి ఉయ్యాల
లమ్మ వచ్చాయి
కొమాళ్ళు గలవారు
కొనరె ఉయ్యాల
కొమాళ్ళు గలవాడు
తావెంకటేశు
కొంగు మాడలు పోసి



కొనెను ఉయ్యాలా
సింహాద్రి అప్పన్న
చిరుతిళ్ళవాడు
లంచమిస్తేగాని
సంతానమీడు
లంచాలు యీయవే
నువ్వు రమణమ్మా
సంతానమిస్తాడు
సర్వేశ్వరుండు
యిక్కడికి సింహాద్రి
ఎంత దూరమ్ము
అల్లవిగో నేరేళ్ళు
తెల్లని గుళ్ళు
తెల్లని గుళ్ళలో
దేముడప్పన్న
నల్లని గుళ్ళలో
ఆది లక్ష్మమ్మ

**11**

శ్రీరామ జయరామ
శృంగార రామ
చారు విక్రమ రామ

చంద్ర రఘురామ
భక్తజన దారిద్ర్య
భంజనుడ రామ
ముక్తిదాయక రామ
మురవైరి రామ
గోవింద గోవిందా
గోకులా నంద
రార పరమానంద
రామ గోవింద
గోవింద గొల్లపల్లెకు
పోకు మయ్యా
గోపికలు నిను వచ్చి
కొట్టేరు స్వామి
గోవింద గోపాల
రార కృష్ణమ్మ
ఆనంద మాడరా
మా పల్లెలోన
మామంద పాల్తాగి
మమ్ము రక్షించు
ఓయమ్మ ఓ తల్లి
ఓ గోపి దేవి,
ఎన్ని నోములు నోచి
కనెను కృష్ణున్ని
వట్టి పిండిని తిని
వరచవుతులండి
వరపడీ కనెనమ్మ
వరద రాజులును
అంత కంతకు ముద్దు
ఆ యశోదకును
వింతలుగ జూపెనే
వేడ్క నొకనాడు
నారాయణా కృష్ణ
నవనీత చోర
ద్వారకాపురి వాస
ధర్మ రక్షకుడా
నారాయణా నిన్ను
నమ్మి నానయ్యా
శరణని నీ మరుగు
జొచ్చి నానయ్యా
నీకు సేవలు చేయ
మా భారమయ్యా.

## 12

అమ్మాయి మామల్లు ఎటువంటివారు
మెడలనిండా రత్నహారాలవారు
అడ్డపాగాలవారు అంగీలవారు
వేడ్క గుఱ్ఱాలెక్కి వేటాడువారు
అమ్మాయి అత్తలు ఎటువంటివారు
చేతితో ఒక పనీ చేయనీవారు

## 13

చదువుకొని అబ్బాయి వచ్చెగాబోలు
సరస్వతీ చప్పుళ్ళు చావిళ్ళలోన
ఆడుకొని అబ్బాయి వచ్చెగాబోలు
అందెళ్ళ చప్పుళ్ళు పందెళ్ళలోన
అబ్బాయి నీ చేను ఏమి పండింది
రాజనం పండింది లక్ష్మీకోరింది
అమ్మాయి నీ చేను ఏమి పండింది
సౌభాగ్యం పండింది సరసమాడింది

పాపకర్మల చేను ఏమి పండింది
పల్లేరు పండింది ఏటగలిసింది

## 14

ఆడుకో ఆడుకో అందాల భరిణ
కులకుల నాట్యాలు కుప్పపడియేని
పాడుకో పాడుకో రత్నాల మొలక
తేనెవాకలు మమ్ము ముంచుకొచ్చేని
ఏడువకు ఏడువకు వెర్రి నా తల్లి
ఏడిస్తే నా గుండె దిటవు జారేని
ఓ బాల మీ మామ ఎటువంటివాడు
రామువంటివాడు రమ్యగుణశాలి
ఓ తల్లి మీ అత్త ఎటువంటిదమ్మ
తేనె గుండెకలది సీతవంటిది
ఓ చిట్టి మీ బావ ఎటువంటివాడు
అందమైనవాడు అతడు చంద్రుండు
ఓ తల్లి మీ అక్క ఎటువంటిదమ్మ
మురిపాల నొలికేటి మొలక వెన్నెల్ల
పేరేమి? పేరేమి? మిరియాల పేరు
ఆ పేరు కాదమ్మ నీదైన పేరు
ఆ పేరు కాదొకో ఆ పేరుకాద
అట్టయితే నా పేరు చిట్టిరాధమ్మ
నీవు రాధవైతే మురిపాల మొలక
నీ చిన్ని కృష్ణుండు నిన్ను చెట్టపట్టు
ఆడుబిడ్డల తల్లి ఆనందవల్లి
ఆడబిడ్డల ఇల్లు అందాలపెల్లు
కొడుకులను కన్నట్టి కోమలిని జూడ
బంగారు పండుల దోస స్మృతికొచ్చు

## 15

గాజుల్ల సెట్టి వోయి కనకాలసెట్టి
తేవోయి అమ్మాయికి తేనెగాజుల్లు
తేనెగాజుల్లసెట్టి వోటెంకాయసెట్టి
నల్లగాజులసెట్టి మావాడరము
మావాడకొచ్చి మా యింటికొచ్చి
మా కస్తూరికి గాజుల్లు తొడిగిపోవోయి
చిన్నారి పొన్నారి గాజుల్ల సెట్టి
తేర మా అమ్మాయికి తేనెగాజుల్లు
దిష్టితగులాకుండ ముష్టిబొద్దుల్లు
పరదిష్టికం కాక నల్లగాజుల్లు

## 16

చిన్ని మా అమ్మాయి సిరి మొగము చూచి
సిగ్గుపడి చంద్రన్న పొడవనేరాడు
మరునాడు అమ్మాయి మాటల్లుచూచి
మాణిక్యాలతో పొడిచె సూరన్న
కోరి మా అమ్మాయి కన్నుల్లుచూచి
కలిగి చందమామ కానరాడాయె

## 17

అందరి మామల్లు దూరాన గలరు
అమ్మాయి మామల్లు చేరువనగలరు
హాయి బోయల్లార ఓ బాలలార
మా బాల రాదుగా మీతోడ ఆడ

పట్టమ్ము పేరేమి పల్లె పేరేమి?
పట్టభద్రునికన్న తల్లి పేరేమి?
పట్టమ్ము ద్వారకా పల్లె రేపల్లె
పట్టభద్రుని గన్న తల్లి యశోద.

ఊరులేలేవాడు ఉత్తముడు అయితే
పాలుపొంగినట్లు పొంగుదురు ప్రజలు

ఉత్తముని పేరేమి? ఊరు పేరేమి?
సత్యపురుషునిగన్న తల్లి పేరేమి?
ఉత్తముడు దశరథుడు ఊరు అయోధ్య
సత్యపురుషుని కన్నసాధ్వి కౌసల్య

## 18

అమ్మాయిని కొట్టినట్లు ఊరెల్లరట్లు
అమ్మాయి నెవ్వరే కొట్టిన్న వారు?
కొట్టికొబ్బరి బెల్లం చేతికిచ్చారు
వెండిది ఉయ్యాల పమిడి గొలుసుల్లు
రామలక్ష్మి ఊపవే అమ్మాయి తొట్టి
పట్టుపరుపులు పట్టుదిండ్లు
అమ్మలూ ఊపవే అమ్మాయితొట్టి

ముత్యాల బొట్టెట్టి పట్టుచీరగట్టి
అటుకులు వడగట్టి ఆడి రమ్మంది
ఆడబోయినచోట మాడ దొరికింది
మాడక్కు చేయింతు మద్దికాయల్లు
మద్దికాయలు ముద్దుమాటలు ముద్దు
అందరికి అమ్మాయి అల్లారు ముద్దు

చిలుకలు చెలరేగి జీడి కొమ్మెక్కు
అబ్బాయి చెలరేగి మామ బుజమెక్కు
మామ బుజమెక్కి తానేమి అడుగు?
పాలుద్రావు గిన్నడుగు పాడావునడుగు
పంతముతో మేనమామ పట్టెను అడుగు

చిలకల్లు చెలరేగి జీడి కొమ్మెక్కు
అలుకతో అమ్మాయి అమ్మమ్మ చంకెక్కు
చిన్ని మా అమ్మాయి చీరకేడిస్తే
నెయ్యవోయి సాలీడ నేత్రాన పట్టు

## 19

జో అచ్యుతానంద జో జో ముకుందా
రార పరమానంద రామ గోవిందా జో॥

తొలుత బ్రహ్మాండములు తొట్టిగావించి
నాలుగూ వేదాలా గొలుసు లమరించీ
బలువైన ఫణిరాజు పానుపమరించీ
చెలులు డోలికలోన చేర్చిలాలించీ జో॥

ముల్లోకముల నేలు ముమ్మూర్తులారా
అడ్డాలలో నేడు బిడ్డలైనారా
ఏ జన్మలో నోములే నోచినానో
యీ జన్మలో నాకు బిడ్డలైనారా జో॥

ఉదయాస్తమయములే ఉక్కు స్తంభములో
నిండు ఆకసమూ అడ్డుదూలముగ
నాల్గు వేదములు బంగారు గొలుసులు
బలువైన భూస్తలము గురుపీరకంబు జో॥

బంగారమని ఏటి చలవటు పఱచి
నేర్పుతో పాపణ్ణి ఏర్పాటుచేసి
ఏడుభవనముల వారేకమైపాద
పేటలో భేరీ మృదంగములు మ్రోయ జో॥

తొమ్మిది వాకిళ్ళు దొడ్డిలోపలనూ
మూర్ఖు లారుగురునూ సాధులైనారు
అందులో ముగ్గురూ మూర్తులున్నారు
తెలివి తెలిపేటివాడు దేవుడున్నాడు జో॥

పట్టవలె ఆర్గురిని పదిలంబుగానూ
కట్టవలె ముగ్గుర్ని కదలకుండానూ
ఉంచవలె నొక్కణ్ణి హృత్కమలమందూ
చూడవలె వెన్నెల భావమందుననూ జో॥

జంట గూడినవాని జాడగనవలెను
ఇంట బ్రహ్మానంద మంటుండవలెను
ఓంకారమని ఏటి తొట్టిలోపలను
తత్త్వమసి యనిదేటి చలువలం బరచి జో॥

**జోల పాట**

శ్రీరమ్య దేహలాలీ! మాముద్దు
చిన్నారికూన లాలీ!
గారాల కూచి లాలీ! మాయప్ప
కంజాత తనయ లాలీ!
సకల లోకాధారుడూ! మునిమనో
జలజాత సంచారుడూ
అకలంక గుణపూరుడూ, మముబ్రోచు
ఆర్యా మనోహరుడూ
ఇందీవ రేక్షుండు నిజభక్త
బృందార కావనుండు
ఇందిందిరాలకుండూ, మముబ్రోచు
ఇందిరానాయకుండు
శ్రీవాగ్మనోధినేత నిజభక్త
చింతాభీష్టదాత
దేవేశుడా విధాత నీకుతా
దీర్ఘాయు వొసగు గాత!

**బంగారు కళ్ళు**

పిల్లమ్మ కన్నుల్లు బీరపువ్వుల్లు
అబ్బాయి కన్నుల్లు కలువరేకుల్లు
కలువ రేకులవంటి నీ కన్నులకును
కాటుక పెట్టితే నీకు అందమ్ము
ఏడవకు ఏడవకు వెఱ్ఱి అబ్బాయి
ఏడుస్తే నీ కళ్ళు నీలాలు కారు
నీలాలు కారితే నే చూడలేను
పాలైనకారవే బంగారు కనుల

**బూచీ**

బూచి వాని బిలువనంపనా గోపాలబాలా!
బూచి వాని బిలువ నంపనా
బూచి వాని బిలువ నంపకపోతే వద్దు వద్దన్నావు
బూచి యిచ్చి జోలపాడీ యూచినాను నిదురబోవు
బూచీవాని బిలువ నంపనా
అల్లమూరగాయ పెరుగు అన్నమారగించుమంటే
వల్ల తేనె జొనలు గావలెను తెమ్ము తెమ్మనేవు
బంతిచేతికిచ్చి ఆడుకొమ్మంటే
పంతగించి వేరుచోట బంతులవిగో తెమ్మనేవు గోపాల!
బాగుగాను పూలపాన్పుపైన బవ్వళించమంటేను
నాగుబాము పడగనెక్కి నాట్యమాడవలె ననేవు
మత్తగజము తెచ్చి చిన్ని తిత్తిలోపల నుంచినా
నెత్తిమీద బెట్టి నన్నెత్తికో యశోదనేవు?
శ్రీరామభద్రగిరి రామదాసునేలు స్వామి
కామితార్థ ఫలములొసగి
కైవల్యము జూపువాడ

**ఉగ్గు పాటలు**

ఊం ఊం ఉంగన్న
ఉగ్గుపాలు ఇందన్న
గంటెడు ఉగ్గు కమ్మన్న
ఉమ్మక కక్కక మింగన్న
ఊం ఊం ఊం ఉంగన్న
ఉంగలు పెట్టక గ్రుక్కన్న

ఓర్వని సవతుల దిష్టన్న
ఒప్పుగ మసలర బుచ్చన్న

**2**

జీర్ణం జీర్ణం వాతాపి జీర్ణం
గుఱ్ఱాల్దిన్న గుగ్గిళ్ళరిగి
ఏనుగుల్దిన్న వెలక్కాయలరిగి
అర్జునుడు దిన్న అరటి పళ్ళరిగి
భీముడు దిన్న పిండివంటలరిగి
గణపతి దిన్న ఉండ్రాళ్ళరిగి
అబ్బాయి తాగిన పాలు ఆముదం అరిగి
పాముల్లే పాకి కుందల్లే కూర్చుని
నందల్లే నడచి గుఱ్ఱమంత పరుగు
ఏనుగంత సత్తువుండేటట్టు
సాకుమీ ఈ బిడ్డను శ్రీ వేంకటేశ

**చందమామ**



చందమామ రావే! జాబిల్లి రావే
కొండెక్కి రావే! గోగుపూలు తేవే
వెండి గిన్నెలో వెన్నయుపోసి
పయిడి గిన్నెలో పాలూపోసి
చందమామ రావే! జాబిల్లిరావే
మా చిన్న బిడ్డతో భుజింతువుగాని
చిన్నన్న శ్రీ రఘుశేఖ మనసు
వెండిగిన్నియ లోపల వెన్నపోసి
పయిడిగిన్ని లోపల పాలుపోసి
చాల దినిపించి పోగదే చందమామ
జేజేలకును బువ్వ! శివుని యొూదలపువ్వ!
జాబిల్లి రాగదే చందమామ!
మెండు చీకటి గొంగ! మెఱయు చుక్క బొజుంగ!
జాబిల్లి రాగదే చందమామ!
చిగురుకైదువుకాను చెలగురావుతు మామ!
జాబిల్లి రాగదే చందమామ!

**2**

చందమామ రావే! జాబిల్లి రావే!
కొండెక్కి రావే! గోగుపూలు తేవే!
ఒలవని పండు ఒళ్ళో ఉంచుకొని
ఒల్చినపండూ చేత బుచ్చుకొని
వెండిగిన్నెలో వెన్న పెట్టుకొని
పయిడిగిన్నెలో పాలు పోసుకొని
అమ్మా నువూ తిందువుగాని
అట్టా అట్టా రావే
చందమామా రావే
జాబిల్లి రావే

**3**

చందమామ రావె జాబిల్లి రావె
కొండెక్కి రావె కోటి పూలు తేవె
బండెక్కి రావె బంతిపూలు తేవె
తేరుమీద రావె తేనెపట్టు తేవె

పల్లకిలో రావె పాలు పెరుగు తేవె
పరుగెత్తి రావె పనసపండు తేవె
నా మాట వినవె నట్టింట బెట్టవె
అన్నీని తేవె అబ్బాయి కియ్యవె

**దాయి దాయీ!**

ఆయి వారింటికి పోయి వద్దామా!
అరటి పళ్ళుత్తములు అందుకొద్దామా!
అబ్బాయి నెవ్వారూ కొట్టినవారు
చిట్టీ పొట్టీ గాజులసెట్టీ
తేర - మా అబ్బాయికి తేనె గాజుల్లూ
దాయి దాయీ చిట్టి తండ్రీ దాయి!

**జోలపాట**

జోలల్లు పాడితే బాలలకు నిద్ర
నాగస్వరం పాడితే నాగులకు నిద్ర
ఆడంగ ముద్దమ్మ, పాడంగ ముద్దమ్మ
అందరికీ అమ్మాయి అల్లారు ముద్దు
తాతలకి ముద్దమ్మ, తండ్రులకు ముద్దు
అంతకన్నా ముద్దు, మేనమామలకు;
చిట్టి చిట్టీ చిట్టి చీమల్లమట్టి
మట్టికిందున్నాడు తొట్టినాగన్న
తొట్టినాగన్నకీ తోడెవ్వరమ్మా
గోవుల్ని కాచేటి గోవిందుడేతోడు
అమ్మాయి నెవ్వరే కొట్టిన్నవారు
చిన్నారి పొన్నారి చిలుకవే నీవు
చిన్న మామిడి క్రింద చిన్న కోవెలవు
ఏడవకు ఏడవకు వెర్రి అమ్మాయి
ఏడిస్తె నీకళ్ళు నీలాలుగారు
నీలాలుగారితే నేజూడలేను

పాలైనగారవే బంగారుకండ్ల
హాయిహాయిహాయి ఆపదలుగాయి
చిన్న వాళ్ళనుగాయి శ్రీవెంకటేశ.

**అందం**

పువ్వు లందం
నవ్వు లందం
నవ్వు లొలికే పాప లందం
చుక్క లందం
రెక్క లందం, రెక్క లార్చెడి పిట్టలందం
బాట లందం
బాట మలుపున కోట లందం
చెరువు లందం
తరగ లందం
తరగపై కమలాలు అందం
నేల అందం
నింగి అందం
నింగిపై ఆ చంద్రుడందం

**చక్కిలిగింతలు**

పప్పుపెట్టి పాయసం పెట్టి
అన్నం పెట్టి అప్పచ్చి పెట్టి
కూరపెట్టి ఊరగాయపెట్టి
నెయ్యివేసి ముద్దచేసి
తినిపించి తినిపించి
చెయిగడిగి మూతిగడిగి
తాతగారింటికి దారేదంటే
అత్తారింటికి దారేదంటే
ఇట్లాపోయి ఇట్లాపోయి
మోచేతి పాలెం ముందర్నుంచి

ఇట్లాపోయి ఇట్లాపోయి
ఇదిగో ఇదిగో వచ్చాం వచ్చాం
చక్కావచ్చాం చక్కావచ్చాం
చక్కిలి గిలిగిలి చక్కిలి గిలిగిలి.

**ఉడుత**



ఉడతా ఉడతా హూత్
ఎక్కడకు వెడతావు హూత్
సంతకు వెడతాను హూత్
ఏమిటి తెస్తావు హూత్
బెల్లం తెస్తాను హలా
నాకిస్తావా?
నే నివ్వను పో! ధూ!!

**నాన్న**

అమ్మలగన్న నాన్న
అంబలిగన్న నాన్న
వజ్రాల తల్లుల నాన్న
వరహాల పేరుల నాన్న
వలక బొజ్జల నాన్న
కాసుల పేరుల నాన్న
కన్న తల్లుల నాన్న

**కితకిత కితకిత**

ఇల్లలికి – ముగ్గేసి
పీటేసి – ఆకేసి
పప్పుపెట్టి – పాయసం పెట్టి
అన్నం పెట్టి – అప్పచ్చి పెట్టి
కూరపెట్టి – ఊరగాయ పెట్టి
నెయ్యివేసి – ముద్దవేసి
తినిపించి – తినిపించి
చేయికడిగి – మూతికడిగి
తాతగారింటికి – దారేదంటే
అత్తవారింటికి – తోవేదంటే
ఇట్లాపోయి – ఇట్లాపోయి
ఇదుగో ఇదుగో – వచ్చాం వచ్చాం
చక్కావచ్చాం – చక్కావచ్చాం
చక్కిలి గిలిగిలి – చక్కిలి గిలిగిలి

**2**

ఇల్లలికి – ముగ్గేసి
ఆకేసి – పీటేసి
పప్పెట్టి – బువ్వెట్టి
పాలోసి – పెరుగోసి
అత్తారింటికి – తోవేదంటే
కిత కిత కిత కిత – కిల కిల కిల కిల

**రక్ష రక్ష!**

సంధ్యరక్ష సర్వరక్ష
దీపరక్ష దివ్యరక్ష
చిన్నమా అబ్బాయికి శ్రీరామ రక్ష

## మరికొన్ని

వెలదిరో! వెంకటరమణ ఎవరి పట్టందు
కాంతరో వెంకటరమణ కన్నతల్లందు
ఇచ్చిన దేవునిబోలు ఈశ్వరునిబోలు
బ్రహ్మదేవుని బోలు బాలల్లబోలు
పంచదారకుప్ప పాలమీద తెప్ప
మాకు వెంకటరమణయ్య ముద్దు
వరహాల కుప్పందు వచ్చె ధనమందు
మామ సత్యం తెచ్చె మాణిక్యాలకంటె
అత్తసీతమ్మ తెచ్చె అద్దాల అంగి
వెన్నారి ముద్దందు వెలగపండందు

**3**

పెదమామ తెచ్చిందు పెంచపులిదండ
నడిమామ తెచ్చిందు నాగభూషణాలు
చినమామ తెచ్చిందు చిలకల్లతొట్టె
అవి మా వెంకటరమణకు అమరుకడియాలు

**4**

గౌను వెనక మోత ఎవడి మోత
చిన్న నాబాలయ్యది గజ్జెల్లమ్రోత
ఊరు వెనుక మోత ఎవరిదిమోత
చిన్న నా బాలయ్యది ఉంగ్రాలమోత

**5**

రమణయ్య చేతుల్లోది వజ్రాలగిలక
చూచిరే ఆ ఎలుక సూరన్న పెట్టె
వాసాల బారేటి మీసాల ఎలుక
పాపకారి ఎలుక పారెయ్యి గిలక
దోసకారి ఎలుక దులుపెయ్యి గిలక

**6**

మందులకు పోవయ్య మామ తరిణయ్య
మరువక తేవయ్య మాచ్చావు పాలు
అవితెచ్చి మా రాజు వెంకటరమణకు పోసె

**7**

వెన్నకు ఏడ్చేవు ఎత్తేవుగిన్నె
వెల్లావు పంపుదురు మీ అమ్మ తాత
పాలకు ఏడ్చేవు పట్టేవుగిన్నె
పాడి బఱ్ఱెల పంపు మీ అమ్మ తాత

**8**

పుక్కిళ్ళు సన్నాలు భుజకీర్తులు
చెక్కిళ్ళు సన్నాలు చెవులు గున్నాలు
కాళ్ళను సన్నాలు గజ్జల కడియాలు
వేళ్ళను సన్నాలు ముద్దుటుంగరాలు

**9**

బుద్ధిగలవాడమ్మ చిన్న నాయన్న
బుజాన విసిరే భుజకంఠమాల
వాసిగలవాడమ్మ చిన్న నాయన్న
వాసియనివేసేరు వరమాల పేరు

**10**

వెంకటరమణ ముద్దుల్లు మద్దికాయల్లు
మద్దికాయలు ముద్దుమాటలు ముద్దు
మామల్లచంకను వెంకటరమణ ముద్దు

**11**

ముద్దుబాలయ్య ముంగిట లాడంగ
ముంతమామిడన్న ముసిరె చిలుకాలు
పగడముల బాలయ్య పందిటాడంగ
పండుమామిడన్న బ్రమిసె చిలుకాలు
వజ్రముల బాలయ్య వాకిటాడంగ
వట్టిమామిడన్నవచ్చె చిలుకాలు




వీటిని ముద్దు పాటలు అనీ, ఇంగ్లీషులో 'లల్లబీస్' అనీ అంటారు. బిడ్డకు వయసొచ్చాక ఏడుస్తున్నపుడు మాన్పించడం కష్టమౌతుంది. ఆ సమయంలో తల్లి బిడ్డను లాలిస్తుంది. ముద్దిడుతుంది. బెదిరిస్తుంది. దండిస్తుంది. దడిపిస్తుంది. బుజ్జగిస్తుంది. బిడ్డ ఏడుపు మానదు. అప్పుడు –

"పిట్టరావె పిట్ట పిల్లలకు తల్లీ
పిల్లలకు పాలిచ్చి పల్లెలకు పోవె"

అని పాడుతుంది తల్లి. కాని అప్పటికి ఏడుపు మానదు. పసిపాప కన్నీరు చూసి మాతృ హృదయం ద్రవించిపోతుంది. ఆ స్థితిని భరించలేక తల్లి –

"ఏడవకు ఏడవకు వెర్రినాగన్న
ఏడిస్తే నీ కనుల నీలాలుగారు
నీలాలు గారితే నే చూడలేను
పాలైన గారవే బంగారు కనుల"

అని ఆశగా బాధపడుతుంది. అప్పటికి బిడ్డను ఓదార్చడం సాధ్యంకాదు. గుక్క పెట్టి ఏడుస్తుంది. తల్లి అశక్తత కనిపిస్తుంది. ఆ సమయంలో దగ్గరున్న తండ్రి తల్లి అమాయకత్వాన్ని ఇలా చమత్కరిస్తాడు.

"ఉడుగుబెట్టుకు ఊయ్యాలగట్టి
ఊగుమని మీయమ్మ ఊళ్లోకి పోయె
పందికొక్కు రావె - పాలిచ్చి పోవె"

జోల పాటలలో వలె లాలిపాటలలో తల్లి తన బిడ్డలలో శ్రీమహావిష్ణువు అంశనే చూస్తూ ఆనందిస్తూ పాట ఎత్తుకుంటుంది.

"చిన్నారి గంటల్లు మూగిమూగల్లు
పన్నగశయనుడే శేషశయనుడు
పందిళ్ళనాడు కొని పాలు తాగి పండు"

తల్లి ప్రవృత్తి విచిత్రమైనది. బిడ్డ తన మేనమామలంత గొప్పవారు కావాలని ఉప్పొంగిపోతూ - పరోక్షంగా తన పుట్టింట వారి గొప్పదనాన్ని, అన్నల గొప్పదనాన్ని చెప్పుకొని మురిసిపోతుంది.

"స్వాతివానలు కురిసె సంద్రంబు కడనూ
చిట్టి ముత్యం బుట్టే సీత కడుపునా
అందరీ మామలు చందమామల్లూ

నాయన్న మామలు రామ లక్ష్మణులూ
పాలుతాగే నాడు పారాడెనాడు
పాడియావు నంపించు నీకు నీ మామ"

అంటూ మేనమామల ఉదారత్వాన్ని కొనియాడుతుంది. ఇలా లాలిపాటలు సాగుతూంటాయి. ఈ పాటలు తల్లి ఊహలే. బిడ్డకు అర్థం చేసుకొనే శక్తి వుండదు. తల్లి కమ్మని గొంతులోని మధుర స్వరాలు, ఆప్యాయత, లాలిత్యం మాత్రం బిడ్డ అర్థం చేసుకుంటుంది. బిడ్డ మంత్రముగ్ధ ఔతుంది. అదే లాలిపాటలలోని విశిష్టత.

బిడ్డలను నిద్ర పుచ్చడం ఈ పాటల ప్రధాన లక్ష్యం. పాటల చరణాల చివర దీర్ఘం తీయడం కనిపిస్తుంది. "ఉఊఊఊ హాయీ" అని దీర్ఘం తీస్తూ, హాయీ అనే పదాన్ని మృదువుగా అవరోహణ స్థాయిలో ఉచ్చరించేప్పుడు బిడ్డకు ఆవులింతలు ప్రారంభమవుతాయి. నిద్రవస్తుంది. తల్లి లక్ష్యం నెరవేరతుంది. తెలుగు దేశంలో లాలి పాటలు కొల్లలు. ఇలాటి పాటలు వందల సంఖ్యలో ఉన్నాయి. ఇందు కనుమరుగైనవి యిన్నని చెప్పలేము.

## లాలిపాటలు

రామా లాలీ, మేఘశ్యామ లాలీ!
తామరస నయనా దశరథ తనయా లాలీ ॥రామ॥
అబ్జవదనా ఆటలాడి అలసినావురా
బొజ్జలో పాలరుగుదాక నిదురుపోవరా! ॥రామ॥
జోలలు పాడి జోకొట్టితే ఆలకించేవు
చాలించి మరియూరకుంటే సంజ్ఞచేసేవూ
అద్దాల తొట్టెలోను నీవు అమరియున్నావు;
ముద్దుపాప ఉన్నాడంటే మురిసేవు - రామా!
ఎంతో ఎత్తు మరగినావు ఏమిసేతురా
వింతగాని కొండనుండు వీర రాఘవా!

**2**

రామా లాలీ మేఘశ్యామా లాలీ!
తామరస నయన! దశరథ తనయా లాలీ!॥రా॥

శ్రీరామా లోక నాయకా శేషశయనా
నారాయణాచ్యుత స్వామి ననుగన్న తండ్రి! ॥రా॥

చిన్నిముద్దుల నాయన్న చిన్నికృష్ణమ్మ
తిన్నంగ సేవింపయ్య తియ్యంగుండేను ॥రా॥

సంపెంగ నూనె తలంటెద స్వామి! నీకు
ఇంపుతోడ చుంచుదువ్వి పైకి రాచెద ॥రా॥

కర్పూర ధూపాన పొగకాపు వేసేను
అబ్బబ్బ! యిక నిద్రబొమ్మీ అచ్యుతానంత! ॥రా॥

**3**

లాలి శ్రీకృష్ణయ్య నవనీల మేఘవర్ణ
బాల గోపాలకృష్ణ పవ్వళించవేమయ్యా
శృంగారముగ నిన్ను బంగారు తొట్టిలో
రంగుగ జోలపాడేను నిదురపోవయ్యా
ఇందరిలోపల నీకు ఎవరు కావలెనయ్యా
ఇందీవరాక్షి కాళింది కావలెనా!
లలితాంగి రుక్మిణీ లలనయె కావలెనా
పలుకు కోకిల సత్యభామ కావలెనా లాలి!

**4**

తూర్పు పాటారింది తొలికోడి కూసింది
కర్పూర కణికలాగను - వేగుచుక్కుంది
నేర్పైన యిల్లాళ్ళు నిద్రపడకలనెత్తి
పాచిపని చేస్తున్న పాటలను పాడేరు
మేలు కొలుపులు కొన్ని కవ్వాలు తిప్పుతూ
గొల్ల కృష్ణుడు నాటి - చల్ల పాటలు కొన్ని
భక్తుడొకడెవ్వడో భజన పాటల పాడి
పడుకుంటె మతి-నిద్రపట్టనీకున్నాడు
పాలేళ్ళు నాగేళ్ళు - పట్టుకొని యెడ్లతో
ఊరవల పొలములకు పారిపోతున్నారు
దాసీలు వాకిళ్ళు - దార్లెల్ల తుడిచితే
కలయంపి జల్లి-పడుచులు ముగ్గులు పెట్టేరు
తెలివొచ్చి వూరెల్ల - తేటగా వున్నాది
కల వచ్చినట్టుగా - కలకల లాడింది

**5**

ఊరుకో అమ్మాయి ఊళ్ళేలు తావు
పండుకో అమ్మాయి పట్నాలు నీవి
చిట్టి ముత్తెం పుట్టి సీత కడుపున్న
మంచి ముత్తెం పుట్టె మాకు అమ్మన్న
స్వాతి వానలు కురిసె సంద్రాల కడను
పాలవానలు కురిసె బంధూల కడను
ఆట మాణిక్యమే పాట మాణిక్యం
ఆడితే ముద్దమ్మ నవ్వితే ముద్దు
నట్టింట మా అమ్మ నవ్వితే ముద్దు
ఊరుకో....

**6**

అద్దారాత్రి ప్రొద్దు
నిద్దురవేళ - నిద్దురవేళ
ఎవరమ్మ మా తలుపు
గోళ్ళమీటేరు -గోళ్ళమీటేరు
మేమమ్మ కుక్కలకు
కూటికొచ్చేము - కూటికొచ్చేము
కూడేల తప్పింది
కూడెట్లుదెస్తూ, కూడెట్లుదెస్తూ
ఎవరమ్మ మా తలుపు
గోళ్ళమీటేరు - గోళ్ళ మీటేరు
మేమమ్మ పిల్లలకు
పాలకొచ్చేము - పాలకొచ్చేము
పాలవేళ తప్పింది

పాలెట్లుదెస్తూ - పాలేట్లుదెస్తూ
ఎవరమ్మ మా తలుపు
గోళ్ళ మీటేరు - గోళ్ళ మీటేరు
మేమమ్మ దూడలకు
మేతకొచ్చేము - మేతకొచ్చేము
మేతవేళ తప్పింది
మేతెట్లు తెస్తూ - మే తెట్లు తెస్తూ
ఎవరమ్మ మా తలుపు
గోళ్ళ మీటేరు - గోళ్ళ మీటేరు
మేమమ్మ త్రాడులకు
నారకొచ్చేము - నారకొచ్చేము
నారోయి పీచోయి
నాకేమి తెలుసు - నాకేమి తెలుసు.

## 7

చందమామ రావె జాబిల్లి రావె
కొండెక్కి రావె కోటివేలు తేవె
బండెక్కి రావె బంతిపూలు తేవె
నట్టింటపెట్టవే మా అమ్మాయికియ్యవే

## 8

చందమామ రావె జాబిల్లి రావె
కొండెక్కి రావె కోటివేలు తేవె
మేడెక్కి రావె మేలిపట్టు తేవె
పరుగునరావె పాలు వెన్న తేవె
ఒలిచినపండు ఒళ్ళో పెట్టుకొని
ఒలవనిపండు చేతితో తెచ్చి
పసిడిగిన్నెలో పాలు పోసుకొని
అట్టాట్ట వచ్చి అబ్బాయి కివ్వవే.

## 9

చందమామ రావె జాబిల్లి రావె
కొండెక్కి రావె కోటివేలు తేవె
బండిమీద రావె బంతిపూలు తేవె
పల్లకీలో రావె పారిజాతం తేవె
తేరుమీద రావె తేనెపట్టు తేవె
ఆటలాడ రావె ఆరగించి పోవె.

## 10

కొండలలో ఉన్నారు మండలేశ్వరులు
కట్టించె నాయన కనకమండపము
చేయించె పెద నాయన వెండిగోపురము
పరిపించె చిన నాయన నల్లనిరాళ్ళు
చూడబోయి తాతయ్య సున్నమేయించె
అడుగబోయిన అవ్వ అరుగు వేయించె
వెళ్ళిచూచిన యత్త మల్లివనమేసె
పరికించి మామయ్య బావి త్రవ్వించె
అక్కయ్య పోసెను వనములకు నీళ్ళు
కోసెను పువ్వుల్లు కోరిమా వదినె
వేసెను మాయమ్మ పూలజడ నాకు

## 11

లాలి లాలీ లాలి లాలయ్య లాలీ
జోలలు పాడితే బాలలకు నిద్ర
నాగసరం ఊదితే నాగులకు ఆట
జోలమామిడి పండ్లు దూరాన కలవు
జోడించి తెస్తాడు అబ్బాయి మామ
అబ్బాయి మామలు ఎటువంటివారు
చెంపకు చేరడేసి కన్నుల్లవారు
అబ్బాయి అన్నలూ ఎటువంటివారు



చేపలంగడి వద్ద చెయి చాచువారు
లాలి లాలీ లాలి లాలయ్య లాలీ

## 12

వేసంగి కాలాన విత్తనాలు పోసె
వెన్నుడి కనుదృష్టి మేఘాలపైన
మాయింటి బాబుల్లు మరి తిరిగి రాగ
బాబుల్ల కనుదృష్టి తమ తల్లిపైన

## 13

ఏటిక్కి కాలువ యెంత దూరమ్మ
ఎత్తి పెంచిన తల్లి కెంత మోహమ్మ
కాలువ నీళ్లన్ని కదు సముద్రమాయె
కదలేని మోహమే కన్న తల్లిక్కి

## 14

ఏటిగట్టు మీద కరివేప చెట్టు
గాలివాన వచ్చి కొమ్మలల్లాడె
కొమ్మలల్లాడెనే గొలుసులల్లాడె
కొని కొన్ని ముత్యాల చేరులల్లాడె
ఆ చెట్లపై నుండి అబ్బాయి రాగ
బంగారు తలపాగ చెంగులల్లాడె

## 15

ఏవాడ వెళ్లేవు అబ్బాయి నువ్వు
ఎవ్వరు కట్టేరు కాళ్ళ మువ్వల్లు
కలవారి పట్టన్ని గారాములన్ని
కంచారి కట్టేదు కంచు మువ్వల్లు
తనతోడి పట్టన్ని తనకు ముద్దన్ని
అన్నయ్య కట్టేదు వెండి మువ్వల్లు

## 16

అందలాలు రెండు పొందుబడి రాగ
ఎవ్వరందలమని నే తొంగిచూతు
మావూరి అందలం మల్లెపూ చాయ
మారాజు అబ్బాయి అమ్మికాబోలు
ఊరివారందలం ఉల్లిపూ చాయ
ఉత్తముదు చిన బాబు అమ్మికాబోలు
కలవారి అందలం కలవపూ చాయ
కాముడు చినబాబు అమ్మికాబోలు

## 17

ఇంతంత దీపమ్ము ఇల్లల్ల వెలుగు
ఈశ్వరుడి చందమామ జగతెల్ల వెలుగు
గోరంత దీపమ్ము కొండల్ల వెలుగు
గోపాలకృష్ణమ్మ మందల్ల వెలుగు
మాడంత దీపమ్ము మేడలకు వెలుగు
మా రాజు అబ్బాయి మా కళ్ళ వెలుగు

## 18

చిన్నారి పొన్నారి గాజుల్ల శెట్టి
తేరె మా అమ్మాయికి తేనె గాజుల్లు
గుడి తిరిగి వచ్చేయి గుడ్ల గాజుల్లు
గుత్తాన మా చిన్న అమ్మిచేతుల్ల

పట్నం తిరిగి వచ్చేయి పచ్చగాజుల్లు
పచ్చన్ని మా చిన్న అమ్మి చేతుల్ల
ఊరు తిరిగి వచ్చేయి ఉత్తగాజుల్లు
గుత్తాన మా చిన్న అమ్మి చేతుల్ల

**19**

లాలీ లాలమ్మా లాలీ
లాలమ్మా లాలీ – లాలమ్మ లాలి

లాలమ్మ గుఱ్ఱాలు
లంకల్లో మేసే – లంకల్లో మేసే
బుల్లెమ్మ గుఱ్ఱాలు
బీడుల్లో మేసే – బీడుల్లో మేసే
అప్పన్న గుఱ్ఱాలు
అడవుల్లో మేసే – అడవుల్లో మేసే ...

ఊరుకో అబ్బాయి
వెఱ్ఱీ అబ్బాయీ – వెఱ్ఱీ అబ్బాయీ
ఉగ్గెట్టు మీయమ్మ
ఊరుకెళ్ళిందీ – ఊరు కెళ్ళిందీ
పాలిచ్చు మీయమ్మ
పట్టామెళ్ళిందీ – పట్టామెళ్ళిందీ
నీలోసె మీయమ్మ
నీలకెల్లిందీ – నీలకెల్లిందీ ...

**20**

లాలీ శ్రీరామా గుణరామా
రవికుల సోమా
పరమడోలిక పాన్పుపై నిను
పవ్వళింపగ చేతూ
పవళింపగా జేతునా తనయా
పాటలూ పాడిస్తూ ||లా||

అల్లరి చేసిననిను
బూచివాళ్ళెత్తుకు పోదురుగ
ఎత్తుకుపోదురుగ తనయా
ఏలేడ్చెదవూ రా ||లా||

అవులో పక్షులు
వృక్షాగ్రముపై
కూయూ చున్నవీరా
కూయూచున్నవీరా
కుమారా కోలాహలామదిగో ||లా||

అదిగో కోకీల
ఆకాశామూపై
ఆడూచున్నదిరా
ఆడూచున్నదిరా
కుమారా అల్లరీ
యికమానూ ||లా||

**21**

లాలనచు ఊచేరు
లలన లందరునూ
ఫాలలోచన నిన్ను
పాన్పుపై నుంచి ||లాలీ||

ప్రణవ పంచాక్షర
పాన్పుగా గాగ
భరితచిత్రుణవమే
బాలీసుగాగా,
చరలింగ చిత్కలులు
దీపములు గాగ,
పరమ సద్గురువందు
పవళించుకోగా ||లాలీ||

లాలి చిద్రుపొంగ
లాలయ్యలాలీ!
లాలి సజ్జన
హృదయ లాలయ్య లాలీ!! ॥లాలీ॥

## 22

లాలీ బాలకృష్ణా లాలీ
లాలీయనుచు బంగారుయ్యల నీకు వేసిరి
వయ్యారముగాను గొల్ల
తొయ్యలెల్లానూ చేరారయ్యా కృష్ణయ్య
ముద్దులయ్యా నెయ్యాములారా ॥లా॥

నీటుగలతొట్టి బాలుడాటమాని
నిదురాపోర
సాటీలేనిమాట నేలా
కోటిరత్నాలా మూట ॥లా॥

తెల్లవార గొల్లపిల్ల లెల్ల
నిన్నల్లుకొనచు
నుల్ల మొల్ల సిల్లూనటా
నెల్లా సేవింతుగాని ॥లా॥

లేచీ నిదురా పోవాకున్నా
బూచీ వారలొచ్చి నిన్నూ
దోచూకొన బోదురు
నే నోచీన నోమూలపంట ॥లా॥

భామలే మొదలే లేమల
మీ మదినికోరి
నార రామలలామలను
ప్రేమదీర పెండ్లిచేయ ॥లా॥

వాశిమీర బొబ్బిలి పురవాసా
శ్రీ శ్రీనివాసా శ్రీశా,
శ్రీ శివరామదాసా
మనోల్లాసా ॥లా॥

## 23

లాలి శ్రీ జనలోల
లీలా వినోదా
లాలి ద్వారకపురి
బాలగోపాలా

తొలుత బ్రహ్మాండంబు
తొట్టెగా వేసి
నాలుగూ వేదములు
గొలుసులమరించీ
బలువైన ఫణిరాజు
పాన్పులమరించీ
చిత్తమనియేటి
దూలములు వేసి

అందముగ జాంబవతి
చందనము పుయ్య
పొందుగా కాళింది
పూవులందియ్యా
మందహాసము రాధ

మనపు లందియ్యా
ఇందుముఖలక్షణా
వింజామరెయ్యా

చుట్టుగోప స్త్రీలు
తొట్టె నూచంగా
కోట రంగారాజు
కోర్కెలొసగంగా

**24**

బాల గోపాల రార
ఉయ్యాలలూగ ॥బాల॥
బాల గోపాల రార
పాలూ వెన్నారగించా
నీలా వర్ణుడ రార
కాళింది మర్దనుడ ॥బాల॥
బంగారు తొట్టేలోనూ
చంగావి మెత్తావేసి
శృంగారించెదను రార
ఓరోరి కృష్ణా ॥బాల॥
గొల్లా వారిళ్ళలోనూ
కుండా పెరుగారగించి
దండితనము సేయకురా ॥బాల॥
అండాజనారక్షక
పుండారీ కాక్షవరదా
పళ్ళుపాలూ పెరుగు
మనయిళ్ళనే కలవుదేవా ॥బాల॥

**25**

కృష్ణ కృష్ణ అనియేవు కృష్ణుతలచేవు
కృష్ణుడేమి కావలెను శ్రీరాధాకృష్ణా?
అన్నగారి కొడుకు అతిసుందరుండు
మేళంబు లాడేటి మేన అల్లుండు

**26**

చందమామ చందమామ – ఓ చందమామ
చందమామ కూతురు – చంద్రగిరి కన్నె
చంద్రగిరి కన్నెకు – నిండుపూలతోట
పూసింది మున్నూరు – పూవుల్లతోట
కాసింది మున్నూరు – కాయల్లతోట
పండింది మున్నూరు – పండుల్లతోట
అందులో ఒక పండు – అందమయిన పండు
ఆ పండుదావున – జీడిగింజ మొలచె
జీడిగింజ జిడ్డి తలుపు – నే తీయలేను
నాకంటే నాచెల్లి – అతి ముద్దరాలు
అతి ముద్దరాలి చేత – పాలు కాగపెడితే
పాలుమీద తేలింది – పగడాల పేరు
పగడాలపేరు తెచ్చి – కోమటింట పెడితే
కోమటోడు పెట్టాడు – గోరంచుచీరె
ఊరివారు పెట్టారు – ఉల్లిమళ్ళి చీరె
మా వారు పెట్టారు – మల్లెమొగ్గల చీరె

**27**

చందమామ చందమామ
ఓ చందమామ చందమామ
కూతురే నీలగిరి కన్య
నీలగిరి కన్య కింద నిత్య మల్లెచెట్టు
నిత్యమల్లెచెట్టు క్రింద జీడిమొలచింది
జీడిగింజ తలుపులు నే తియ్యనేర
నాకంటె చెల్లెలు అతి ముద్దరాల్లు.
అతిముద్దరాల్చేతి పాలవంకిల్లు
పాలవంకిలు మీద భమిడిపువ్వుల్లు
భమిడిపువ్వుల మీద పుంజాయి దండ
పుంజాయి దండపై పువ్వుల రవికె
పువ్వుల రవికె మీద పట్టంచుచీర
పట్టంచు చీరగట్టి ఏ వాడబోదు?



## చిట్టిపాప

చిన్ని మా అమ్మాయి శ్రీ ముఖము చూసి
సిగ్గుపడి జాబిల్లి పొడువగా వెలచు
పందిట్లో అమ్మాయి పాకుతూ వుంటే
పనసపండని జనులు పరుగులెత్తేరు
దొడ్లోను అమ్మాయి దొర్లాడుతుంటే
దోసపండని జనులు దోసిలొగ్గేరు
నీలాలు కెంపులూ నిలువు వజ్రాలు
నిత్యమూ అమ్మాయి నీళ్ళాడుచోట
పగడాలు రత్నాలు పారిజాతాలు
పడలి మా అమ్మాయి పనిచేయుచోట
చూడగా ముద్దమ్మ పాడగా ముద్దు
అందరికి మా అమ్మి అల్లారు ముద్దు.

## మా చిన్నపాప

చందమామ చందమామ ఓ చందమామ
చందమామ కూతురు నీలగిరి కన్య
నీలగిరి కన్యకు నిత్యమల్లె తోట
నిత్యమల్లె తోటకు నీలాల బావి
నీలాల బావికి బుడుగు బుడుగు చెంబు
బుడుగు బుడుగు చెంబుకు వచ్చాయి పాలు
పాలల్లో ఉన్నాది పగడల్ల చేను
చేనుల్లో ఉన్నాది మా చిట్టిపాప
కర్రి ఆవుపాలు గారాన తెచ్చి
కడుపు నిండా త్రాగు మా చిన్నపాప

## ముద్దు

ఆటలు ముద్దు పాటలు ముద్దు
ఆలాపించిన హరికథ ముద్దు
వేషం ముద్దు భాషలు ముద్దు
దైవత గురువుల దండం ముద్దు
చదువులు ముద్దు సఖ్యం ముద్దు
సాటివారిలో సాగిన ముద్దు
పెదవులు ముద్దు బుద్ధులు ముద్దు
అందం చందం అందరి ముద్దు
పొత్తం ముద్దు పొల్తుల ముద్దు
భక్తి శ్రద్ధలు పరువం ముద్దు
సత్యం ముద్దు శౌచం ముద్దు
దానధర్మాలు దక్కిన ముద్దు
పూజముద్దు పునస్కారము ముద్దు
పూజసేయు పుక్కటము ముద్దు
ఆలన ముద్దు పాలన ముద్దు
అమ్మలయ్యల కణగిన ముద్దు
పాడి ముద్దు పంట ముద్దు
అల్లన ముట్టిన యెల్లన ముద్దు
ఇల్లు ముద్దు ఇల్లాలు ముద్దు
ముట్టినులము క్కారుల ముద్దు
ముద్దు పాప ముల్లోకము ముద్దు
ముద్దుల గుమ్మటముల బాట

## మేలు కొలుపు

మేలుకో నా తండ్రి మేలుకోవయ్యా
మేలుకొని చదువుకో మరచిపోకయ్యా

చదివిన వారికి సౌఖ్యాలు కలుగు
చదివిన వారికి సంపదలు కలుగు
అస్తమానము నీవు చదువుకోవయ్యా
ఆడుకో మాయయ్య ఆడుకోవయ్యా
ఆడుకుంటే నీకు ఆరోగ్యముండు
అస్తమానము నీవు ఆడుబోకయ్యా
తోడి బాలులతోడి తంటాలు తేకూ
గురువు గారికి ఎగ్గు తలబెట్ట బోకూ
మేలుకో నా తండ్రి మేలుకోవయ్యా

## పాపాయి

మొలగజ్జెలందెలు గలు గల్లుమని మ్రోయ
తెలినవ్వు మోముపై కలకలలాడ
తూనూడ నేర్చిన దొరబిడ్డవీవు
పారాడనేర్చిన పాపాయి నీవు
వెండిగిన్నెలో బువ్వ పైడి గిన్నెలో పాలు
బొజ్జనిండా తిని పొమ్ము పాపాయి!

## మేన మామ

గోరుచిక్కుడు కాయ గెలవేసినట్లు
గోత్రాన అబ్బాయి నేరికిస్తాము?
ఎవరికిస్తామమ్మ ఎవరికిస్తాము
కులములో మేనత్త కూతురిస్తాము
అత్త మంచిదయితే అనుకూలమయితే
బాలుడు లేతయితే పట్టినిచ్చాము
పాప మా అబ్బాయి పాలకేడిస్తే
పాడియావుల పంపిరి మేనమామల్లు
రాజుల్లబోలి మామల్లు ఉంటే
రచ్చల్లు ఏలంగ సందేహమేమి!

## చెయి వూచు

చెయి వూచమ్మా చెయివూచు
సంతకు పోతా చెయివూచు
శనగలు తెస్తా చెయివూచు
చల్లగ తింటాం చెయివూచు
మిఠాయి తెస్తాం చెయివూచు
మెల్లగతింటాం చెయివూచు
అప్పు తెస్తాం చెయివూచు
అంతా తింటాం చెయివూచు
చొక్కాయి తెస్తాం చెయివూచు
సొగసుగ వేస్తాం చెయివూచు
తిరిగి వస్తాం చెయివూచు
వోడించి వస్తాం చెయివూచు
కమ్మలు తీస్తాం చెయివూచు
చెవులో వేస్తాం చెయివూచు

## 2

చేయూచు బాలా! చేయూచూ
చిన్నారి బాలా! చేయూచూ
అద్దాల దిడ్డీ చేయూచూ
అరవ మాణిక్యాలు చేయూచూ
చేనికి పోదాము చేయూచూ
పండ్లూ తెత్తాము చేయూచూ
పాపకు యిత్తాము చేయూచూ

## ఇంతెత్తు పిల్లి

ఇంతెత్తు పిల్లి
ఎలుకనుబట్టే పిల్లి
ఎందుకొచ్చావు చెల్లి
కానియిస్తా బుల్లి

దమ్మిడిస్తా మల్లి
యేలు చేస్తావు చెల్లి
ఆడుకుంటూ నవ్వా
అటుకులు తింటా నవ్వా
నాకు దేవప్పా
లేకపోతే నొప్పా
తేనెటీగ గూడు బెడితే
తేనె తాగుతాను
ఆవుపాలు నీవు తెస్తే
అటక ఎక్కుతాను
పక్క నీవు చక్క బెడితే
ఎక్కి నేనే గుఱ్ఱు బెడతా

## నిమ్మపండు

ఇసుకలో యుండేటి కుసుమ శిరిబాలా
మా బాలరాజుగా మిము గూడియాడ
మా బాలరాజుగా మము గూడియాడా
అక్కనీ బాలకూ అనవాలేమి
అరచేతి పద్మంబు అల్లుతామరా
అరచేతి పద్మంబు అల్లుతామరా
జడ జడ ముత్యాలు జడరాయి రేఖ
జడ జడ ముత్యాలు జడరాయి రేఖా
లక్క పుత్తడిబొమ్మ రత్నాల మొరటె
లక్క పుత్తడిబొమ్మ రత్నాలమేరటె
రాజుల్ల చేతిదీ శిరి నిమ్మపండు

## ఎరుపు

చిట్టీత పండెరుపు
చిలక ముక్కెరుపు
చింతల్ల చిగురెరుపు
జీడి పండెరుపు
దానిమ్మ పండెరుపు
తాంబూల మెరుపు
తానెరుపు అబ్బాయి
తనవారిలోన

## గోరంత దీపమ్మ

గోరంత దీపమ్మ
కొండలకు వెలుగు
గోపాలకృష్ణమ్మ
గోవులకు వెలుగు
మాడంత దీపమ్మ
మేడలకు వెలుగు
మారాజు లబ్బాయి
మా కళ్ళ వెలుగు

## మాతృ భాగ్యం

ఎన్నెన్ని పుణ్యాలు చేశావో
ఎన్నెన్ని నోముల్లు నోచావో
బిందె భుజమున బెట్టి కాలువకి పోతుంటే
చీరపట్టుకు కాళ్ళ కడ్డంబడు పాపణ్ణి
ఎత్తుకొని పాలిచ్చిముద్దెట్టు కోవడానికి ॥ఎన్నెన్ని॥
"పాపాయి కన్నేది" చూపించు మంటేను
నడిమి వ్రేలితో కన్ను చూపించు పాపణ్ణి
ఎత్తుకొని ముద్దిచ్చి ఎగుర వేసేనీవు ॥ఎన్నెన్ని॥
నాన్న వచ్చీ పాప నెత్తుకుంటానంటే
రాను రానని నీదు మెడ కౌగలించేటి
ఈ చిన్ని పాపణ్ణి ఎత్తుకోడానికీ ॥ఎన్నెన్ని॥
కష్టపడి తెచ్చిన కాలువలో నీళ్ళన్ని
పారబోసి పాప బంద చేస్తుంటేను

ఏమిరా! బందంటే వెర్రి నవ్వులు నవ్వు
"దొంగ దొరికాడంటె" చిట్టి నవ్వులు నవ్వు
ఈ చిన్ని పాపణ్ణీ ఎత్తుకోడానికి
ఈ చిన్ని పాపణ్ణి ఎగరేయడానికి ॥ఎన్నెన్ని॥

**ఓదార్పు**

ఏడవకు ఏడవకు వెర్రి అమ్మాయి
ఏడిస్తే నీకళ్ళు నీలాలు కారు
నీలాలు కారితే నే చూడలేను
పాలైన కారవే బంగారు కనుల
పిల్లి రావే పిల్లి పిల్లల తల్లి
పల్లేరు ముళ్ళల్లో పడవేసి పోవె

**రత్న మాణిక్యం**

చిన్న అమ్మాయి చిన్నగిరి మొగ్గ
వీధుల్ల నాడేటి విరజాజి మొగ్గ
ఆట మాణిక్యమే పాట మాణిక్యం
అందరికి అమ్మాయి రత్న మాణిక్యం
రత్న మాణిక్యం ఎవ్వరి పట్టి
రాజులచేతిదే గజనిమ్మపండు

**పకపకల నవ్వు**

పక పక మని నవ్వు
పసిపాప ముఖం
పసిపాప ముఖంలో
నెలవంక వెలుగు
నెలవంక వెలుగులో
అమృతపు ధార
అమృతపు ధారలో
హంసా కుమారి
హంసా కుమారికి
తొలిరెక్క కానలు
తొలిరెక్క కానలలో
బంగారు పూత
బంగారు పూతలో
మెరుపు మిల మిలలు
మా పాప నవ్వులో
చిలిపి కిల కిలలు.

**చిన్నారి**

చిన్నారి నామ పెట్టవే
అమ్మయ్య నాకు–
పొన్నారి తొడుగు తొడగవే
వేళ్ళ ఉంగ్రాలు పెట్టవే
అమ్మయ్య నాకు–
భమిడి మొలత్రాడు గట్టవే
వీధుల్ల నాడు మనవే
అమ్మయ్య నన్ను–
వీరాధి వీరుడనవే
సందుల్ల నాడు మనమే
అమ్మయ్య నన్ను
సరసీజమానుడనవే అమ్మయ్య
నేను – భద్రగిరి
రాముబాణము లాడవచ్చెద.

**ఊడిద చెట్లాకు ఉయ్యాల**

ఊడిద చెట్లాకు ఉయ్యాల గట్టి
ఊపమని మీ అమ్మ ఊరు తిరిగొచ్చా ఒళోళో
పాలకు ఏడ్చేవు పట్టెద గిన్నె
పారిపో ఎల్లమ్మ పారిపోవమ్మ ఒళోళో
బుజ్జెమ్మ మామల్లు పాలమెల్లి తోలింద్రు
జోలల్లు పాడంగ జొన్నల్లు పండు ఒళోళో
దత్త పుత్తడి బొమ్మ తలనిండ జడలు

మామల్ల సంకాన ఆడు లచ్చమ్మ ఒళోళో
పల్లేరు గాయల్లు పరుపుల్లో పరచి
పండమని మీయమ్మ పల్లె తిరిగొచ్చు ఒళోళో

**మరికొన్ని**

సీతమ్మ యుండేటి దీవి లంకల్ని
పాపపూ వెన్నెల పగలైకాయు
సీతమ్మ చిత్రకథ చెప్పేటి వేళ
అడవిలో పచ్చాకు లగ్నులైమందు

**2**

సీత బుట్టానేలా లంక చెడనేలా
లంకకూ రావణుడు రాజుగానేలా
హనుమయ్య బుట్టనేలా వనము జెడనేలా
వనము పక్షూలన్ని వలసపోవనేలా

**3**

రావణేశుని శిరసులంకలో గొట్టి
రామన్న తన బంటు గెలిచి రమ్మానె
లంక దగలాబెట్టి లంకిణిని జంపి
శంకలేకా లంక యేలే హనుమంతు

**4**

నల్లనన్నా నీకు చెల్లెల్ని నేనూ
నగరి పట్టపురాజు కోడల్ని నేను

**5**

రావాకు చిలకమ్మ ఆడవే పాపా
రాజులూ నీ చెయ్యి చూడ వచ్చారు

**6**

కట్టమీదా రెండు కరివేప చెట్లూ
గాలివాన వస్తే కొమ్మలల్లాడూ
గాలివాన వస్తే కొమ్మలల్లాడు
అన్నయ్య తలగుడ్డ కుచ్చులల్లాడూ

**7**

కాకారి పూసింది కళలేని పూతా
కన్నతల్లి బెట్టె వెలలేని సొమ్ము
మేనమామను జంపి మేలు రథమెక్కి
కృష్ణయ్య తానే కీర్తి బొందాడు

**8**

నా చిన్న బాలయ్య నీ చిన్న మొగము
నీ చిన్ని మొగమందు నిమ్మపండందు

**9**

కౌసల్య మీ అమ్మవచ్చె యేడువకు
చీదరలు చెయ్యకు చిన్న బాలయ్య
చీదరలు నినుబాసె సిరులు నినుబొందె
శ్రీలక్ష్మి వూయంగ వూగు వుయ్యాల
ఉయ్యాల నీకమిరె ఉగ్గు నీకమిరె

**10**

ముద్దు మొగమున ముచ్చటలు ఆడె
మువ్వంపు దేవుడవు నీవు నా బాల
తాముత్తవ్వల బోలు తల్లిదండ్రుల బోలు
అయ్యముత్తవ్వల బోలు అయ్యలు బోలు
మద్దికాయలు ముద్దు మాటల్లు ముద్దు
మామగారి చంకలో బాలయ్య ముద్దు

**11**

ఓ చిన్నకుమార! నే కొందునీకు
పుట్టు గజ్జెలు కొందు పులిగోరు కొందు
వున్నయ్య మీ నాన్న వచ్చె వూరుకుండు
కాళ్ళ గజ్జెలు కొందుకంటె కమలాలు కొందు

**12**

చిరితిండి కాదమ్మ చిన్న బాలయ్య
పట్నాన తీరమ్మ పుట్నాలగోనే

**13**

కాకర చెట్టు కాయలందమ్మ
బాబయ్య చెవులకు పోగులందమ్మ

**14**

పాలు త్రాగు అబ్బాయి నీ
పమిడి మురుగులు కదిలేను
చెపుకో చెప్పుకో
మామిడా కిస్తాను మందెట్టుకో

**15**

వేడి అన్నం అప్పడం ముక్కా
తినో తినో! తినో తినో
చల్ది అన్నం ఉల్లిపాయ
జుర్రో! జుర్రో! జుర్రో! జుర్రో!

**16**

చిట్టడుగు పొట్టడుగు పెట్టవలెనన్న
శివుడు మాకిచ్చాడు చిన్న బావల్ని
బాలలకి పాల్నెయ్య కలగవలెనన్న
పరమాత్ముడిచ్చాడు పాలావు మంద

**17**

ఏరొచ్చె ఏరొచ్చె ఏటి గట్టెక్కి
ఏటవతలన్నట్లు కట్టించె కలవ
పారవ పిట్టల్లు పంచటరగుల్లు
నాయన్న దివాణం నేపుట్టినిల్లు
కరక్కాయ పొత్తులు కంచు దివిటీలు
కాంతనా శ్రీప్రియ కన్న వారిల్లు

**18**

తోటక్కు కాచారు దొంగలిద్దరు
తొలకరిస్తే పువ్వు కోసేదమని
కృష్ణయ్య కాచాడు మామయ్య యిల్లు
కానకుండా పుస్తెకట్టెదమని
ఎరక్కుండ తలంబ్రాలు పోసేదమని

**19**

తుమ్మెదా! నీ కళ్ళు దూలాలమీద
బాలయ్య నీకళ్ళు మగువాలమీద

**20**

ఇసుకలో ఆడేటి కుసుమసిరి బాల
ఆ బాలపేరేమి? ఆనవాలేమి?
అనవాలు అంబరసా పేరు బాలయ్య

**ఉయ్యాలకోపు (కోలాట కీర్తన)**

రామలాలి నీలమేఘశ్యామలాలీ
తామరసనయనా దశరథతనయాలాలి
యెంతోయెత్తు మఱిగినావూ యేమిసేతురా
యింతులచే కాక మేనెంతగుందేరా రా॥
పల్లవాధరులానుజూచి బారలు
జాచేవూ అల్లరి పనులెల్లాజేసి
ఆటలాడేవు ॥రా॥
అద్దాల తొట్టిలోను అనుమానించేవు
ముద్దుగాపాడుచున్నారని మురిసిజూచేవు రా॥
అంతటి మూలమైనా ఆదివిష్ణుడవు
వింతగా వినుకొండా పట్టణరాఘవా రా॥

## పటాలవుకోపు

పువుల వసంతములాడిరీ గోపాలుని
భామలుగూడిరీ పు॥
చంగ గోలుగోలుచేసిరీ గోపాలుని
భామలుగూడిరీ పు॥
లాల్‌గులాబ్ చేసిరీ గోపాలుని
భామలు గూడిరీ పు॥
అటునిటురాకడ జూచిరీగోపాలుని
భామలు గూడిరీ పు॥
నిండుగ భక్తులుగూడిరి గోపాలుని
భామలు గూడిరీ పు॥

## గీతకోపు

మేర్వాసువాల్మీక చందమామారాజు
మేటియొక్క వాల్మీక చందమామా
సామిభజన నేమి జేసిరయ్యా చందమామా
వూరెల్లపల్లకిలు చందమామా
రాజు వేలాగుతిరిగేను చందమామా॥

## కుర్చీకోపు

నామాట వినవమ్మకోమలీ
జోగినాధుని దేవమ్మకోమలీ
చంద్రుని దేవమ్మకోమలీ
నీకు చంద్రహారము లిత్తుకోమలీ
సూర్యునీ దేవమ్మకోమలీ
నీకు సూర్యహారములిత్తుకోమలీ॥

## కుశలవులకోపు

ఆటలాడిరీ చెండ్లాటలాడిరీ
వాటముగా కొనకోటున మీటుచు
సూటితప్పకను
నేటుగకుశలవులా సలలితముగ
దచ్చరణములను గజ్జలరవములు
ఝంఝుంఝణ యనగను
ఆ క్షితిసుతతన వరసుతులను గనుగొని
హితమతితో
సమ్మతినొందగ జెండ్లాటా ఆ గగనమునకు
జెండ్లెగరవేయుచు పరగభద్రాద్రీశుని
నెమ్మదిదలచుచు ॥ఆ॥

## 21

కూతుళ్ళు గలవారి ఇళ్ళముందార
కూర్చి నా ముత్యాలదండ లమ్మేయి
కూతుళ్ళు గలవాడు తాను రామన్న
కూర్చిన ముత్యాల దండ మహేశం
కొడుకుల్లు కలవారి ఇళ్ళముందార
కొమ్మ అరటిపళ్ళ గెలలు వచ్చాయి
కొడుకుల్లు కలవాడు తాను అన్నయ్య
కొమ్మ అరటి పళ్ళ గెలలు అబ్బాయి
కోడళ్ళు కలవారి ఇళ్ళముందార
కొట్టిన చాయపసుపు గుండాలమ్మేయి
కోడల్లు గలవాడు తాను అన్నయ్య
కొట్టిన చాయపసుపు గుండసీతమ్మ
అల్లుళ్ళు గలవారి ఇళ్ళముందార
అంగైన జల్తారు పాగాలమ్మేయి
అల్లుళ్ళు గలవాడు తాను బాబయ్యా
అంగైన జల్తారు పాగసూరన్న

## 22

చేరతో చేరాడు ముత్యాలుపోసి
చెలుపుడు అవయ్యా చెరువు త్రవ్వించె
చెరువు త్రవ్విన ఉప్పారి
మన చెరువు మహిమ చెప్పగా తరమ
ఎక్కలేని గట్టు దిగలేని లోతు






తెలుగు దేశంలో ప్రచారంలో ఉండే ఊయల పాటలు రెండు విధాలు. పిల్లలను ఉద్దేశించి ఊయల ఊపుతూ తల్లులు పాడేవి. పండగలు పబ్బాల సందర్భంలో పిల్లలు ఊయల ఊగుతూ పాడుకొనేవి. ఒక్కొక్కప్పుడు తల్లి బిడ్డను రెండు కాళ్ళమీద కూర్చోబెట్టి ఊయలలాగ కాళ్ళు ఊపుతూ పాటలు పాడి శిశువుకు ఉత్సాహం కలిగిస్తుంది.

| | |
|---|---|
| ఉయ్యాలోయ్ | జంపాలోయ్ |
| కొత్తకుండోయ్ | కోమరెల్లోయ్ |
| ఐనోలోయ్-మల్లన్నోయ్ | అల్లల్లల్లా. |

ఈ గేయంలో 4, 5 పాదాలలో తెలంగాణా ప్రాంతాలలోని సుప్రసిద్ధ శైవక్షేత్రాల పేర్లున్నాయి. ఈ శివశక్తి పిల్లలలో కలగాలని ఈ గేయకర్త ఉద్దేశమై ఉంటుంది. ఈ విధంగా తల్లి ఇష్టదైవాన్ని పాటల్లో ఊహించుకుంటూ పాడుకుంటూ ఉంటుంది. ఉయ్యాలా-ఉయ్యాలా- అను పల్లవి ప్రతి పాటలో ఉంటుంది. వాస్తవానికి ఇవి జోల పాటలలో ఒక భాగమే - అయినా వీటి ప్రత్యేకత వీటికుంది. కనుక వేరుగా ఇవ్వడం జరిగింది.

ఇవిగాక కృష్ణాష్టమి మొదలైన పండుగల సందర్భంలో పిల్లలు ఉయ్యాల ఊగుతూ – ఆనందోత్సాహాలతో పాడుకొనే –

"ఉయ్యాల కంబాల వూరిపేరేమి?"

మొదలైన పాటలు అపారంగా ఉన్నాయి. ప్రధానంగా ఇవి తల్లులు పాడేవి. పిల్లలు ఆనందించేవి.

## ఉయ్యాలోయ్

ఒక్కొక్క వేపగింజ ఉయ్యాలో
ఒక్కవేయి మంద ఉయ్యాలో
మందగిరి వచ్చింది ఉయ్యాలో
అన్నల్లు వేరైరి ఉయ్యాలో
ఉంగరాల అన్నల్లు ఉయ్యాలో
చిన్ని నా చెల్లెండ్లు ఉయ్యాలో
చెండ్లాట లాడ బోయిరి ఉయ్యాలో
కంకణాలవుయ్యాల్లు ఉయ్యాలో
గౌరమ్మలాడబోయిరి ఉయ్యాలో

**2**

చుక్కలలోను చిన్న బాలుడున్నాడు
ఆబాల గోపాల బాలుడున్నాడు
పంచదారకుప్ప పాలపై తెప్ప
మాచిన్ని అబ్బాయి బంగారుకుప్ప
పొద్దుపొద్దొక చాయ పొద్దొక్క చాయ
పొద్దున్న అమ్మాయి పొగడపుచాయ
మాపు మాపొక చాయ మాపొక్కచాయ
మాపున్న అబ్బాయి మల్లెపూచాయ
జాము జామొక చాయ జామొక్క చాయ
జామున్న అబ్బాయి జాజిపూచాయ

**3**

ఒక్కొక్క ముత్యము వనకూడినట్లు
ఒప్పేటి కొమాళ్ళ ఏ తల్లి కనునో?
రమణులకన్నదే తాను కౌసల్య
ఊరికి ఉయ్యాల లమ్మచ్చినాయి
కొమ్మాళ్ళుకన్నతల్లి కొనవె ఉయ్యాల
కొమ్మాళ్ళు కన్నతల్లి తాను కౌసల్య
కోటివేలు పోసి కొనెను ఉయ్యాల

**4**

కోటకుర్చీ మీద రాజు కూర్చోని
కొమ్మలమ్మ పండు తాను తెమ్మనెను
రత్నకంబళి మీద రాజు కూర్చోని
పారాడె పంజరపు చిలుక తెమ్మనెను
కోటకుర్చీ మీద రాజు మీ తాత
కొమ్మనిమ్మపండు తాను అబ్బాయి
రత్నకంబళి మీద రాజు మీ మామ
పారాడె పంజరపు చిలుక అమ్మాయి

**5**

ఎందాడి పోయినది చిన్న అమ్మాయి
ఏస్వామి యిచ్చెనే ఎత్తి ముద్దాడ?
పరమేశ్వరరాణి పార్వతీదేవి
పార్వతి యిచ్చింది పాప అమ్మాయిని
చీమంత పులిగోరు చుట్రా విరేకు
చిన్న వాండ్లాడేడు రేపల్లెలోను
మాడంత బంగారు మద్దికాయల్లు
మహరాజు మాతండ్రి మనమరాలాయె

**6**

పాపమా అబ్బాయి పాలకేడిస్తే
పాడియావులనంపిరి మేనమామల్లు
రాజుల్లుబోలి మామల్లు ఉంటే
రచ్చలు ఏలంగ సందేహమేమి?

**7**

ఏరంత వెళుపమ్మ యిసుక సన్నమ్మా
ఏరుదాటివెళ్ళింది ఎవరాడబడుచు?
మూటనున్నది పసుపు పొట్లానకుంకం
వడినిండ పోకల్లు పండుటాకుల్లు
భమిడిశ్రీ పిల్లమ్మ సారె వెళ్ళింది

8

ఊరిక్కి ఉయ్యాల లమ్మ వచ్చాయి
కొమాళ్ళుగలవారు కొనరె ఉయ్యాల
కొమాళ్ళు గలవాడు తాను లచ్చన్న
కొంగుమాడలు పోసి కొనెను ఉయ్యాల

9

సింహాద్రి అప్పన్న చిరుతిళ్ళవాడు
లంచమిస్తేగాని సంతానమియ్యడు
లంచాలు యియ్యవే నువ్వు అప్పన్న
సంతానమిస్తాడు సర్వేశ్వరుడు

10

ఇక్కడికీ సింహాద్రి ఎంతదూరమ్మొ?
అల్లవిగో నెరుళ్ళు తెల్లనిగుళ్ళు
తెల్లని గుళ్ళలో దేవుడప్పన్న
నల్లని గుళ్ళలో ఆదిలక్ష్మమ్మ

11

పుట్టిళ్ళు పుట్టిళ్ళు అందురేకాని
పుట్టిళ్ళకంటేను పురుషుడే మేలు
కాశికెళదామంటే కదలవేకాళ్ళు
ఢిల్లివెళదామంటే తిరగదే మనసు
మారాన పుట్టింటికెళదాము అంటే
నాకాళ్ళు పన్నెండు రథములై నడచు
నాచేతులుయ్యాల చేరువై యూగు

12

అన్నలు వచ్చారు కూరేమిలేదు
అరటి కాకరకాయ అలచందపప్పు
మరదల్లు వచ్చారు కూరేమిలేదు
మంచాన నల్లుల్లు గోడబల్లుల్లు

13

తమ్ముల్లు వచ్చారు కూరేమిలేదు
గుత్తి చిక్కుడుకాయ గుమ్మడికాయ
బావల్లు వచ్చారు కూరేమిలేదు
కలుగుల్లో తొండల్ని వేటాడి తెండి

14

ఆయమ్మ ఆయి ఓయమ్మ మంది
ఓయమ్మ దొడ్డ రాజుదండు తిరిగేనమ్మ
దండు దండనగానే తల్లడించారు
దండుకాదు ద్రాక్షారామ భీమన్నమూక

15

ఊరికే కుంకమ్మొ అమ్మ వచ్చింది
కొంగుమాడలు పోసి కొనరె కుంకమ్మొ
చేతిమాడలు పోసి చేయింతు భరిణె
గోల్కొండ తీసికెళ్ళి బందు వేయించి
ఆ భరిణె తీసికెళ్ళి అప్పుకీయండి

16

ఉయ్యాల కంబాల వూరిపేరేమి
అచ్చుబల్లమీద రాజుపేరేమి
చింత చెట్టుక్రింద చిరు బొమ్మరిల్లు
వాటెక్కి వాకిళ్ళు బోల తలుపూలు
పలక్రింద ఉన్నాది పొన్నాయిమేడ
మేడలో ఉన్నాయి జోడు హంసలు
హంసంస పేరేమి అడిగి రావయ్య
రాచిలుక రామప్ప రంభ పెద్దప్ప
మికురేమి వదిన మరదళ్ళు
టెంకాయచిప్పలు తేనే మామిళ్ళు
దేవేరిద్ర పూలతోటనే పుట్టినిల్లు

అడుగడుగు దబ్బలు ఆకునిమ్మలు
అడుగడుగొ పురం అత్తవారిల్లు

**17**

ఊరికి ఉయ్యాల లమ్మ వచ్చినవి
కొమాళ్ళ కన్నతల్లి కొనవె ఉయ్యాల
పదివేలుపోసి కొనే పైడి ఉయ్యాల
వేలు వేలు పోసి కొనె వెండి ఉయ్యాల
కొమాళ్ళ కన్నతల్లి తాను కౌసల్య
కోటివేలుపోసి కొనెనే ఉయ్యాల
చిన్నది ముత్యము చిలకల్ల పరుపు
శ్రీలక్ష్మి ఊచునే చిన్ని ఉయ్యాల
మంచిది ముత్యాలు మల్లెల పరుపు
మహలక్ష్మి ఊచునే మంచి ఉయ్యాల

**18**

ఊరికి ఉయ్యాల అమ్మవచ్చినది
కొమాళ్ళ గలతల్లి కొనరె ఉయ్యాల
కొడుకులగన్న చేడె కొనరే ఉయ్యాల
ఏమిపెట్టికొందు వెండి ఉయ్యాల
చేటకొంగున చేరెడు ముత్యాలుపోసి
ఉయ్యాలనే కొందు వుయ్యగ కొందు
ఉయ్యాల చేరులు వుత్తగదములు

**19**

కొడుకుల్లు పుట్టన్ని కదుపేమి కడుపు?
కులముద్ధరించన్ని కొడుకేమి కొడుకు?
కన్న కానుపులెల్ల కడుచక్కవయితె
కన్నులపండుగే కన్నతల్లికిని.
లాభమ్ము లాభమ్ము ఏమి లాభమ్ము
కొడుకులనుగంటేను కోటి లాభమ్ము

గోరంత దీపమ్ము కొండలకు వెలుగు
గోపాలకృష్ణమ్మ గోవులకు వెలుగు
మాడంతదీపమ్ము మేడలకు వెలుగు
మారాజు అబ్బాయి మాకళ్ళ వెలుగు
వీధిలో ఉయ్యాల అమ్మ వచ్చినది
కొడుకులనుగన్న తల్లి కొనవె ఉయ్యాల

**20**

గోరంత దీపమ్ము కొండలకు వెలుగు
మాడంత దీపమ్ము మేడలకు వెలుగు
ఇంతింత దీపమ్ము ఇల్లెల్ల వెలుగు
మాచిన్ని అబ్బాయి మాకళ్ళ వెలుగు

**21**

ఊగూ ఊగూ బసవన్న
ఉలవలు తినరా బసవన్న
ఆడూ పాడూ బసవన్న
అంకాలమ్మ గుడివద్ద
గంతులువేయర బసవన్న

**22**

ఊగూ ఊగూ గంగెద్దా
ఉగ్గూపాలే గంగెద్దా
సోలీ ఊగే గంగెద్దా
సోలెడు పాలే గంగెద్దా
తాతా ఊగే గంగెద్దా
తవ్వెడు పాలే గంగెద్దా
మారీ ఊగే గంగెద్దా
మానెడు పాలే గంగెద్దా
ఆగీ ఊగే గంగెద్దా
అడ్డెడు పాలే గంగెద్దా.

## ఉయ్యాల బాలలు

ఉయ్యాలలో బాల ఉగ్గు కేడుస్తే
ఉత్తమ్మ యశోద వూచి వుగ్గొయ్యి
పల్లకీలో బాల పాలకేడుస్తే
బలభద్ర మాలక్ష్మి పాడిపాలొయ్యి

## చిన్నమాట

మా ఇంట ఉయ్యాల
మా చెల్లిని మొయ్యాల
మావి చెట్టుపై కోయిల
మంచి పాట పాడాల
చింత చెట్టుపై చిలుక
చిన్న మాటలాడాల

## గోరు ముద్దలు



వేడి అన్నం అప్పడం ముక్క తినోతినో
చల్ది అన్నం ఉల్లిపాయ జుర్రోజుర్రు
విశాఖపట్నం వీశెడు బెల్లం
నీకో పదలం నాకోపదలం
కళింగపట్నం కాసులపేరు
నీకోపేరు నాకోపేరు
భీముని పట్నం బిందెల జోడా
నీకో జోడా నాకో జోడా
చెన్నపట్నం చెరుకు ముక్క
నీకోముక్క నాకో ముక్క

## చిట్టిపాప

చిన్ని మా అమ్మాయి శ్రీ ముఖము చూసి
సిగ్గుపడి జాబిల్లి పొడువగా వెలుచు
పందిట్లో అమ్మాయి పాకుతూ ఉంటె
పనస పండని జనులు పరుగులెత్తేరు
దొడ్లోను అమ్మాయి దొర్లాడు తుంటె
దోసపండని జనులు దోసిలొగ్గేరు
నీలాలు కెంపులూ నిలువు వజ్రాలు
నిత్యమూ అమ్మాయి నీళ్ళాడు చోట
పగడాలు రత్నాలు పారిజాతాలు
పడతి మా అమ్మాయి పనిచేయుచోట
చూడగా ముద్దమ్మ పాడగా ముద్దు
అందరికి మా అమ్మి అల్లారుముద్దు

## చిన్నారి మా అబ్బాయి

చిన్నారి మా అబ్బాయి చిన్నగిరి మొగ్గ
వాచార కర్పూర వాడనీ మల్లె
వాడనీ మల్లెకూ ఊడనీ తొడిమ
రాజంటి అబ్బాయికి రంభంటి చేదె!

## ఉయ్యాలపాట

తాతల్లు గట్టిన్న ధర్మశాలల్లు
అవ్వల్లు అలికిన అరుగుల్ల మీద
ముత్తవ్వలు పెట్టిన ముగ్గులమీద
కూచోర అబ్బాయి కుదిమట్టుగాను
ఊచవే అమ్మాయి ఉయ్యాల చేరు
పాడవే అమ్మాయి బలగ మందర్ని
ధరణి చేరట్టుకొనిరి తన వార్నిపాడె
భూమిచేరట్టుకొని పుత్రుణ్ణిపాడె

## మా బాబు

ఎవ్వరే మా తండ్రి నేమి అన్నారు?
ఎల్లలేని వీధుల్లో యేనుగన్నారు.

మత్తేభమన్నారు మావాడలోను
కూచున్న వారిలో గుమ్మడి పండనిరి
ఆడేటి వారిలో అరటి పండనిరి
పాడేటి వారిలో పనస పండనిరి

**గాజులు**

చిన్నారి పొన్నారి గాజుల్ల శెట్టి
తేవె మా అమ్మాయికి తేనె గాజుల్లు
నవ్వుతూ తొడిగిస్తు నల్ల గాజుల్లు
పాడుతూ తొడిగిస్తు పచ్చ గాజుల్లు
ఏరియేరి తొడిగిస్తు యెర్రగాజుల్లు
నిలుచుని తొడిగిస్తు నీలిగాజుల్లు

**ఊయల**

ఊయేల జంపాల
మల్లన్న మసిబొగ్గు
కొండమీద కోతి
కోతి...లో మా అబ్బాయి మూతి

**మా అబ్బాయి**

గుమ్మడాకు మీద గువ్వవాలింది
గువ్వెక్కి ఓరాజు గూడొగ్గినాడు
చిక్కుడాకు మీద చిలక అబ్బాయి
చిలకెక్కి అమ్మాయి చిక్కి వున్నాది
అరిటాకు మీద హంస అబ్బాయి
హంసెక్కి అమ్మాయి అమిరి వున్నాది
కొబ్బరాకు మీద గోర అబ్బాయి
గోరెక్కి అమ్మాయి కోరి ఉన్నాది
మామిడాకు మీద మంచు అబ్బాయి
మంచెక్కి అమ్మాయి పొంచి వున్నాది
గుమ్మిడాకు మీద గువ్వ అబ్బాయి
గువ్వెక్కి అమ్మాయి గూడొగ్గినాది.

**చిన్నబాబు**

వీధి నెందరు వున్న విసరదేగాలి
రచ్చనెందరు వున్న రాదమ్మవాన
నా చిన్న అబ్బాయి వీధి నిలుచుంటే
మొగలిపువ్వులగాలి ముత్యాలవాన

**బాలింత**

గోరింట పువ్వవంటి కొడుకు నెత్తుకొని
బాలింత వచ్చింది బావి నీళ్ళకు
ఏదేది బాలింత ఎంత చక్కందొ
మా చిన్ని పట్టుచీర మగువలకు పసుపు
కళ్లదీ కాటుక పళ్లదీ యెరుపు
మావాడ బాలింత అబ్బాయి తల్లి

**ముద్దు**

పిల్లలకు పాలోసి పల్లెలకు పంపి
చిన్నతండ్రికి పాలోసి చెండ్లాటకంపి
ఆడబోయిన చోట మాడ దొరికింది
మాడెట్టి కొనరమ్మ మద్దికాయల్లు
మద్ది కాయల్లు పెట్టి మాకు ముద్దమ్మ
తండ్రులకు ముద్దమ్మ తాతలకు ముద్దు
అవ్వలకు ముద్దమ్మ అత్తలకు ముద్దు

**జేజేలు**

'లాలాను పోసీ పాలను తాపీ
జోలను పాడి అమ్మకు జేజేలు'
'నడువగ చూచీ అడిగినవన్నీ
తడియక ఇచ్చే నాన్నకు జేజేలు'
'మాటలు నేర్పే
ఆటలు నేర్పే పాటలు నేర్పే
గురువుకు జేజేలు'
చదువుకో నాయన్న చదువుకో తండ్రీ
చదువుకొంటే నీకు సౌఖ్యమిచ్చేను'

# పండుగ పాటలు



## పండుగ పాటలు

పిల్లలంటేనే పండుగ. పిల్లలుంటేనే పండుగ. పండుగలలో వారు ఎంతో ఆనందంతో, ఉత్సాహంగా ఉంటారు. వాస్తవానికి పండుగలు, పబ్బాలు, వేడుకలు మన సంప్రదాయానికి చెరగని గురుతులు. సంస్కృతీ సంపదకు నికషోపలాలు, ఆలంబనాలు. ఈతి బాధలు, నిస్సారమైన జీవితం నుంచి పండుగలు కొత్త జీవితాన్ని ప్రసాదిస్తాయి. కొత్త ఆనందాన్ని చవిచూపిస్తాయి. వైవిధ్య విలసితమైన హరివిల్లు లాంటి తెలుగువారి సాంఘిక జీవితంలో ఎన్నో పండుగలున్నాయి. ఎన్నో ఆచార వ్యవహారాలున్నాయి. పండుగలను బట్టి పాటలు, ప్రాంతాలను బట్టి ఆచార వ్యవహారాలు లెక్కకు మిక్కిలిగా ఉండడం సహజం. తరతరాలుగా ఈ పాటలన్నీ మౌఖికంగా ప్రచారంలో ఉన్నవే. నందిరాజు చలపతిరావు, కృష్ణశ్రీ, నేదునూరి గంగాధరంగారలు పనికట్టుకొని వందల సంఖ్యలో గల ఈ పాటలను సేకరించి పుణ్యం కట్టుకున్నారు.

## ఉగాది

పిల్లలకు – పెద్దలకు అత్యంత ప్రీతిపాత్రమైన పెద్ద పండుగ ఉగాది. దీనిని తెలుగు వారు ప్రపంచంలో ఏ ప్రాంతంలో ఉన్నా ఓపినంతలో కనుల పండువుగా చేస్తారు. చేదు పచ్చడి రుచి చూస్తు సుఖప్రదమైన జీవితం ఏడాది పొడుగునా ఉండాలని కోరుకుంటారు.

“ఉగాది పండుగ వచ్చింది
వేపా బజ్జీ తిన్నాము
అమ్మా నాన్నా బావా అక్క
కొత్త బట్టలు కట్టాము
పిండి వంటలు తిన్నాము”

ఇది దక్షిణ సర్కారు జిల్లాలో ఉగాది రోజున పిల్లలు ఆనందంగా పాడుకొనే ఒక పాట. మిగతా ప్రాంతాలలో కూడా బిడ్డలు ఇలాగే పాడుకొంటారు పాటలలో కొద్దిపాటి భేదాలుండడం సహజం.

## వినాయక చవితి

పిల్లలు పూర్తిగా పాల్గొని ఆనందించే పండుగ వినాయక చవితి. పిల్లలకు నిత్య జీవితంలో విఘ్నాలు కలగకుండా చదువు సాములు కొనసాగాలని వినాయకుని మొక్కుకుంటారు. ఉదయమే లేచి స్నానాదికాలు ముగించుకొని వినాయకుడికి ఉండ్రాళ్ళు పోసి తాము విందారగిస్తారు. పూజా వ్రతకల్పం పూర్తయ్యే సందర్భంలో పిల్లలందరూ లేచి చివరిసారి ప్రార్థన చేస్తారు

"విఘ్నము లేకుండ
విద్య నియ్యవయ్య
విఘ్నేశ్వరుడ నీకు
వేయి దండాలు"

అని ప్రార్థన చేస్తారు. విద్యా వ్యాసంగంలో ఎట్టి ఇబ్బందులు లేకుండా చేయడానికి విఘ్నేశ్వరుని ఆశీస్సు అవసరమని మన వారి అభిప్రాయం. అది భారతీయ సంప్రదాయం.

## దసరా

వాస్తవానికి ఈ పండుగను దశరా అనాలి. దశ అంటే పది – 10 రాత్రులు అని అర్థం. ఇది పది రాత్రుల పండుగ. కాని వాడుకలో దసరా ఐపోయింది. పిల్లలు బాగా పాల్గొనే పండుగలలో దసరాను మించింది లేదు దాదాపు రెండు దశాబ్దాలకు పూర్వం దీనికి యెంతో ఆదరం ఉండేది. నాగరికతా ప్రభావం ఈ పండుగను బాగా నొక్కివేసింది. చిట్టి తమ్ముళ్ళు, చిట్టి చెల్లాయిలూ మహర్నవమి పండుగ వచ్చేసరికి "జయ విజయీ భవ దిగ్విజయీ భవ" అని గొంతెత్తి పాడుతూ ఉండే దినాలు గతించాయి. అందువలన బిడ్డలలో కలుపుగోలు తనం, ఉత్సాహం ఉపాధ్యాయులకు, బిడ్డల తల్లిదండ్రులతో సంబంధాలు తరిగిపోయినవని చెప్పవచ్చు. ఆర్థికావసరం కోసం కాకపోయినా పై అవసరం కోసం ఈ పండుగ సందర్భంగా ఉపాధ్యాయులు తల్లిదండ్రులను కలుసుకొనే అవకాశాన్ని పునరుద్ధరించవలసి ఉంది. దసరా సందర్భంగా పిల్లలు పాడే పద్యాలలో ఎన్నో ఫణితులున్నాయి. ప్రార్థనా పద్యంతో ప్రారంభించి, వినాయకుని మీద పద్యాలు, సరస్వతి మీద, శివుని మీద, ఆంజనేయుని మీద పద్యాలు చెబుతారు. అయ్యవారికి ఐదు వరహా లీయకపోతే లోభివాని మీద –

"బాలురము వస్తిమిటు పరగ నతిప్రేమ .....
రేపురా మాపురా మళ్ళీ రమ్మనక .....

ఇలా చెప్పుకుంటూపోయి ఎలాగో లోభివానిని తృప్తిపరచి అందరూ కలసి –

శ్రీరస్తు విజయోస్తు దీర్ఘాయురస్తు .....
బాలకుల దీవెనలు బ్రహ్మ దీవనలు...

అని దీవిస్తారు. నిజానికి బాలకుల దీవనలు బ్రహ్మ దీవనలేగదా!

ఆ తర్వాత సంక్రాంతి పిల్లలకు ఆనందాన్నిచ్చే పండుగ. ఆడపిల్లలు గొబ్బిళ్ళు పెట్టి ఎన్నో పాటలు పాడతారు ఇలా సంవత్సరం పొడవునా వచ్చే పండుగలు తెలుగువారికి కొత్త జీవితాన్ని ప్రసాదిస్తుంటాయి.

**పండుగలు**

చైత్రమాసమున - చెట్లుచిగిర్చెను
ఉగాది పండుగ - ఓహో! వచ్చెను
సీతారాముల - శ్రీ కల్యాణము

ఆషాఢమున - అగపడే మబ్బులు
తొలిఏకాదశి - తొలిగావచ్చును
పేలపుపిండిని - మేలుగతింటిమి

శ్రావణమాసము - రాలెను చినుకులు
కృష్ణాష్టమికి - కృష్ణుడు పుట్టెను
ఉట్లుకొట్టుచు - ఊరేగితిమి

భాద్రపదంబున - వాగులు పాటెను
గణపతి చవితికి గణపతి పూజలు
ఉత్సాహముతో - ఉండ్రాల్ తిందుము

ఆశ్వయుజంబున ఆగెను వానలు

దీటుగ దసరా - దీపావళులు

బావకు మాకు - బాగా విందులు

పుష్యమాసమున - పొగమంచులతో
హరిదాసులతో - ఆడుచు పాడుచు
సంక్రాంతి పండుగ - చక్కగ వచ్చెను

చిన్ని పండుగలు - చిట్టిపండుగలు
ఎన్నో ఎన్నో - ఇంకను ఉన్నవి
పండుగలోయ్ మా - పండుగలోయ్

**పండుగ వచ్చింది**

దసరా పండుగ వచ్చింది
సరదాలెన్నో తెచ్చింది
దీపావళి పండుగ వచ్చింది
టపాకాయలు తెచ్చింది
సంక్రాంతి పండుగ వచ్చింది
కొత్త బట్టలు తెచ్చింది

**ఉగాది**



కోయిల కో! అని పిలిచింది!
కొమ్మలు చిగురులు మొలిచినవి
కలకల పూవులు విరిసినవి!
కమ్మని గాలులు విసరినవి!
కిలకిల చిలుకలు పలికినవి!
ఫలములు రసములు చిలికినవి!

**2**

ఉగాది పండుగ వచ్చింది!
ఊరికి అందం తెచ్చింది!
ఉత్సవాలతో దేవుళ్ళకు!
ఊరేగింపులు సాగాయి!
గుడిలో దేవుని పూజించి!
గురువుల పెద్దల రావించె!
పంచాంగాలను చదివించి!
మంచీ చెడ్డలు విన్నాము!
అక్కలు బావలు ఆసలతో
చక్కావచ్చారు పండుక్కి!

అమ్మ వేకువ లేచింది!
అందరికి తలలు కడిగింది!
సరిపడే నగలు ఇచ్చింది!
సరిక్రొత్త బట్టలు పెట్టింది!
కులదేవతలను కొలిచింది!
గొప్పగా పూజలు చేసింది!
ఊటలు నోట్లో ఊరంగా!
ఉగాది పచ్చడి పెట్టింది!
ఉగాది పండుగ వచ్చింది!
ఊరికి అందం తెచ్చింది!

**3**

ఉగాది పండుగ వచ్చింది
వేపా బజ్జీ తిన్నాము
అమ్మా నాన్నా బావా అక్కా
కొత్త బట్టలు కట్టాము
పిండి వంట తిన్నాము

## సంక్రాంతి



బొమ్మల కొలువర్రో పిల్లలు -
భోగి పండుగర్రో
అమ్మమ్మలు నానమ్మలు తాతలు
నమ్మి కొలిచి యున్నటి వేలుపుల బొ॥

సీతా లక్ష్మణపవన సుతాదులు
సేవింపగ రతనాలగద్దెపయి !
జేతోమోదముతో గొలువుండిన
శ్రీరఘురాముని జూడుండిదిగో బొ॥

పంచపాండవుల బాంచాలిని బరి -
పాలించి యశము బెంచి జగతిలో!
వంచకులను దునుమాడగా నవత
రించిన విష్ణుడు శ్రీకృష్ణుడిదో బొ॥

పండుగ దుస్తులు - పప్పుదప్పుళాల్
మెండుగ తీయని మిఠాయి పొట్లాల్
ఆటల పాటల యందచందములు
మాటలతేటలు - మందహాసములు
యేటికొక్కపరియే యిట వత్తుము
మాటిమాటికిని మరిరాముసుండీ బొ॥

**2**

రైతన్నకు గాదెల్లో చేరు పంటలు
పశువులకు మెడలోన మోగు గంటలు
కలసి వేసుకుంటారు భోగిమంటలు
సంక్రాంతికి ఇంటింటా పిండి వంటలు
ప్రొద్దూ ప్రొద్దున్నెలేచి - దిద్దీ ముంగిరదీర్చి
పసుపూ చుక్కాలు పెట్టి-నిసవూతల్లికపెట్టి
గుమ్మాలనింతికట్టి-తోరణాల దుస్తదిలాని
రంగువల్లీలందున - రంగూరథముదీర్చి
అంశాశుద్ధిగా గొబ్బి - అమ్మవారి గొల్చి
సంగట జట్టు కట్టె - వెంగిలి కట్టె దండి

రచ్చ వీధులరాసి - మన్ను మంటలుతేసి
భోగిమంటలు కాగి - నూసస్నానమాడి
గొబ్బిపాటలు పాడి - సొబ్బీ దుస్తు బోడి
తాజా పంటల గూర్చి - నాజూకుగా పిప్పూన్చి
భోగి పులగాములు - బాగుపరమాన్నంబు
భోగి బోణము దీర్చి - వీగిపొట్టల తేన్చి
జాము ప్రొద్దెక్కిందితోడి -
సాదూజుట్టూ యెత్తండి
వీటసరదండి.....

## గంగిరెద్దు



దూ దూ దూ దూ బసవన్న
దొడ్డదొరండీ బసవన్న
అయ్యగారికీ దణ్ణంపెట్టు
అమ్మగారికీ దణ్ణంపెట్టు
కోటిలాభములు కలగాలండి
కోటివేల్పుల దయ గలగాలి
దూ దూ దూ దూ వెంకన్న
తిరుపతికొండకు ప్రయాణమండి
దేవుని మ్రొక్కులు తీర్చాలండి
బంగరుగిట్టల బసవన్నండి
పయిడికొమ్ముల బసవన్నండి
బాలమెఱుంగుల బసవన్నండి
భాగ్యములిచ్చే బసవన్నండి
వెండికొండపై విహారమండి
విశ్వానాథుని వాహనమండి
పప్పూ బియ్యం పట్టుకురండి
పట్టువస్త్రములు పట్టుకురండి
బసవన్న దయ సంపాదించండి
దూ దూ దూ దూ బసవన్న

## పండుగనాడు

పండుగనాడు మా వొదిన
బండీమీద వస్తుందీ
పండుగనాడు మా బావ
బస్సుమీద వస్తాడూ
పండుగనాడూ మా అక్క
రైలుమీద వస్తుందీ
పండుగనాడు మా మామ
పడవమీద వస్తాడూ
పండుగనాడు మా వారు
విమానమెక్కి వస్తారు
సంక్రాంతి పండుగ వచ్చిందీ
సరదామనకూ హెచ్చిందీ

## అట్లతద్ది

అట్లతదియ ఆరట్లు
ముద్దపప్పు మూడట్లు
పీటకిందా పిడికెడు బియ్యం
పిల్లల్లారా రారండోయ్!

## 2

అట్లతద్దోయ్
అట్లు పోయండోయ్
ముద్దపప్పోయ్
మూడట్లోయ్...

చిప్ప చిప్ప గోళ్ళు
గుంగరాతి గోళ్ళు
మా తాత గోళ్ళు
మందాప గోళ్ళు

**డుబుడక్కవాడు**

అంబ పలుకు జగదంబా పలుకు
కంబుకంఠి! ఓ కాళీ పలుకు
కంచిలోని కామాక్షీ పలుకు
కాశిలోని అన్నపూర్ణా పలుకు
డుబుడక్, డుబుడక్, డుబుడక్
అయ్యమనసులో ఆలోచనలు
అమ్మతలపులో అనుమానాలు
అది గది గదిగో ఒక్కసారిగా
అంబకరుణ సాంబయ్య ప్రేమతో
అన్నీ చెపుతా, ఆలించండి
డుబుడక్, డుబుడక్, బుడుడక్
రేపుమాపులో ప్రయాణముందీ
రేవులు దాటే ఓడ ప్రయాణం
గొప్పచదువులూ గొప్పనౌకరీ
తప్పదు తల్లీ దయదల్చాలి
చెమటకు మాసిన చినిగిన చొక్కా
కప్పుకున్న పైకండువ దొరదీ
తప్పదు నాకూ దయదల్చాలి
అంబపలుకు జగదంబా పలుకు
కంబుకంఠి! ఓ కాళీ పలుకు
కంచిలోని కామాక్షీ పలుకు
కాశిలోని అన్నపూర్ణా పలుకు
డుబుడక్, డుబుడక్, డుబుడక్

**భోగిమంట**

భోగిమంట - పొయిలో కట్టె
ఇచ్చినమ్మ పుణ్యం - ఇవ్వనమ్మ పాపం
ఒళ్ళుమంట - పిల్లలు తంటా
తీర్చినమ్మ పుణ్యం - తీర్చనమ్మ పాపం
పండిన పంట - పిండివంట
వండినమ్మ పుణ్యం - వండనమ్మ పాపం
ఆకలి మంట - అన్నం వంట
పెట్టినమ్మ పుణ్యం - పెట్టనమ్మ పాపం

**గొబ్బిళ్ళు**



గంగమ్మ గౌరమ్మ
అప్పసెల్లెండ్రూ గొబ్బియళ్ళో
ఒక తల్లి బిడ్డలకు
వైరమూలేదు గొబ్బియళ్ళో
మంచి మంచి పూలేరి
ఒక రాసి పోసిరి గొబ్బియళ్ళో
కానరాని కలువలేరి
ఒక రాసి పోసిరి గొబ్బియళ్ళో
ఏడుమూలలింటిలో
ఏడొక్కతూము గొబ్బియళ్ళో
ఏడొక్కతూమేసి
ఎల్లా కొలిపించె గొబ్బియళ్ళో

పొడిగి ఒక తూమేసి
పారా పొలిపించే గొబ్బియళ్ళో
గంపెడు తీసేసి
గంగాకెత్తండీ గొబ్బియళ్ళో
మంచి మంచి పూలేరి
మామయ్యకంపే గొబ్బియళ్ళో
కానరాని పూలేరి
గౌరమ్మకంపే గొబ్బియళ్ళో
అక్కనూ చెల్లెనీ
ఒక్కరీకిచ్చి గొబ్బియళ్ళో

**2**

సుబ్బీగొబ్బెమ్మా శుభము నీయవే
సుబ్బీగొబ్బెమ్మా
మొగలి పువ్వంటి మొగుడినియ్యావే
సుబ్బీగొబ్బెమ్మా
చామంతి పువ్వంటి చెల్లెలినియ్యావే
సుబ్బీగొబ్బెమ్మా
తామర పువ్వంటి తమ్ముడినియ్యావే
సుబ్బీగొబ్బెమ్మా
గుమ్మడి పండంటి కూతురు నియ్యావే
సుబ్బీగొబ్బెమ్మా
పనసపండంటి పణతినియ్యావే
సుబ్బీగొబ్బెమ్మా
మామిడి పువ్వంటి మగువనియ్యావే
సుబ్బీగొబ్బెమ్మా
మల్లెపువ్వంటి మగువనియ్యావే
సుబ్బీగొబ్బెమ్మా
తాటీపండంటి తరుణీనియ్యావే

ఇందరూ గూడియో ఇంటికెళ్ళేం
అందరూ గూడియో ఆ వ్రతం చేసిరి

**వినాయక చవితి**

ఓ బొజ్జ గణపయ్య నీ బంటు నేనయ్య
కమ్మని నెయ్యయ్య కంది పప్పయ్య
పేరిన నెయ్యయ్య పెసర పప్పయ్య
ఎలుక వాహనమదే ఎక్కిరావయ్య
ఉండ్రాళ్ళ మీదికి దండుబోవయ్య

**2**

వెనకా వెనకా వేములతోట
కనకాపండ్లూ కాముని రూపులు
వాగూనీళ్ళూ వనముల పత్రి
మెత్తని కాళ్ళు మాచక శంకులు
దూదీ మడుగులు - దుప్పటిరేకులు
తెల్లనిగుళ్ళో నల్లని వినాయకా
నాలుగు చేతులా నమస్కారమయ్యా!

**3**

విఘ్నమ్ము లేకుండా విద్యనియ్యవయ్య
    విఘ్నేశ్వరుడ నీకు వేయిదండాలు
ఉంగరమ్ములు పెట్టి, ముంగురులు దువ్వి
    ఒద్దపెట్టు తల్లి ముద్దులాడింది
పలక బలపములిచ్చి పద్యములుపాడి
    సరస పెట్టుచు తండ్రి చదువునేర్పేదు
చదువుకో నాయన్న చదువుకోతండ్రి!
    చదువుకొంటే నీకు సౌఖ్యమబ్బేను!
ఆడుకో నాయన్న! ఆడుకోతండ్రి!
    ఆడుకొంటే నీకు హాయి కలిగేను

పిల్లలందరు రండి బళ్ళోకిపోయి
చల్లన్ని గాలిలో చదువుకుందాము
విసరు విసరూగాలి విసరవేగాలి
మామీద విసురు మామంచిగాలి

### నాగుల చవితి

నాగుల చవితికి నాగన్న
స్నానం సంధ్యల నాగన్న
పూలు పడగలు నాగన్న
మడిమట్టులతో నాగన్న
చిమ్మిలి చలిమిడి నాగన్న
పాలూపండ్లూ నాగన్న
దివిటీ తేజున నాగన్న
ఉపవశించుచూ నాగన్న
ఉద్యాపించుచు నాగన్న
ఊరేగొస్తాం నాగన్న
పుట్టకు వస్తాం నాగన్న
పూజలు గొనరా నాగన్న

### దసరా పద్యాలు



ధర సింహాసనమై నభంబు గొడుగై
తద్దేవతల్ భృత్యులై
పరమామ్నాయములెల్ల వందిగణమై
బ్రహ్మాండమాకారమై
సిరిభార్యామణియై విరించి కొడుకై
శ్రీగంగ సత్పుత్రియై
వరుసన్నీ ఘనరాజసంబు నిజమై
వర్ధిల్లు నారాయణా!!

### 2

శ్రీహరి కరుణా కటాక్ష వీక్షణాలంకార
అర్ధజనకుముద చంద్రోదయ
ఆశ్రిత విద్యజనాధార
సత్యభాషా హరిశ్చంద్ర
సంగీత విద్యానారద
సాహిత్య విద్యా చతుర్ముఖ దానవరాధేయ
సంగ్రామ ధనుంజయ సాహస విక్రమార్క
శత్రుగజ కంఠీరవ దుష్టజన కోలాహల
కదన విజయ మార్తాండ
కలియుగరామ కలియుగ భీమ
కామినీ పంచ బాణావతార
మనుజ మందార సమరబాహాటోప
నిర్భయనిశ్శంక మంత్రీశ్వర
మహారాజ ప్రధాన జయవిజయీభవ
దిగ్విజయీభవ

### 3

శ్రీవినాయక రాజశేఖర తనూజ
భావ భవకోటి సన్నిభ భానుతేజ
నాగకుండలభూష - నవ్యసుమ నేష
ఆగమార్ధ విశేష - యార్యజనపోష
వేడ్కసేవించెదముమిమ్ము-విఘ్నరాయ
విజయీభవ దిగ్విజయీభవ

## 13

రాజాధిరాజయో రాజమార్తాండ
వినవయ్య మా మనవి వివరంబుగాను
ఘనులను వినిమమ్ము ఘన తరంబుగను
పని బాలకులము మేము బడలంగలేము
ఊరూర దిరుగంగ వోపికలు లేవు
మీ ధర్మమును గోరి మేము వచ్చితిమి
మీతోటి సాటెవరు భూతలంబునను
కోటి సూర్యులతోటిసాటి మీ మోము
సజ్జనులు మెచ్చిరి సభ అందుమిమ్ము
విప్రజన పోషకా వినరయ్య మీరు
రాజ మహారాజ వో రమ్య చరిత!
చేపట్టి మా మనవి చిత్తమందుంచి
చిన్న వారలమంచు చేరంగదీసి
కాదనక లేదనక ఘనముగా చూచి
పన్నీరు గంధంబు బాగుగా పూసి
పండుటాకులు మంచి మెండు పోకలను
అయ్యవారికి చాలు అయిదు వరహాలు
తెప్పించి కట్నంబు లిప్పించవలెను
మా పప్పు బెల్లాలు మాకు దయచేసి
శీఘ్రముగ నంపుడీ శ్రీమంతులారా

## 14

బంగారు జలతారు రంగయిన పాగ
ముత్యాల పోగులు ముద్దుటుంగరము
చేతి కంకణ చిరుదు చంద్రహారములు
నిలువు టంగీలును నీలాపమణులు
గోమేధికా రత్న గొలుసు లుంగ్రాలు
మాణిక్య కిరీట మహితా ప్రతాప
అయ్యవారికి చాలు అయిదు వరహాలు
చిన్నవాళ్ళకు చాలు శిరసెనగపప్పు
బాలురకును చాలు పప్పుబెల్లాలు

## 15

ఏదయా మీదయా మామీద లేదు
యింత సేపుంచుట యిది మీకు తగునా
దసరాకు వస్తిమని విసవిసలు పడక
చేతిలో లేదనక అప్పివ్వరనక
రేపురా మాపురా మళ్ళి రమ్మనక
యిప్పుడు లేదనక యివ్వ లేమనక
యిరుగు పొరుగుల వారు యిస్తారు సుమ్మి
గొప్పగా చూడండి తప్పకను మీరు
పావలా బేడైతే పట్టేది లేదు
అర్ధరూపాయిస్తే అంటేది లేదు
ముప్పావలా యిస్తే ముట్టేది లేదు
హెచ్చు రూపాయిస్తే పుచ్చుకుంటాము
పై పావలా మాకు పప్పు బెల్లాలు
శీఘ్రమే పంపుడి శ్రీమంతులారా
జయ విజయీభవ దిగ్విజయీ భవ

## 16

శ్రీమంతులై మహాశ్రేయమ్ము కలిగి
భూమిలో వెలలేని భోగములు కలిగి
ధన ధాన్యములు గలిగి ధర్మంబు కలిగి
ఘనవస్తు గజహయ వ్రాతంబు గలిగి
అందలంబులు కలిగి అతి వేడ్కతోను
పొందైన నవరత్న భూషలను గలిగి
బంగారు మేడలను పోలికలు గలిగి
శృంగార వతులైన చెలియలను గలిగి
మన్నించు రాజువలె మర్యాద గలిగి
తనయులకు తనయులకు తనయులను కలిగి

మనుమలకు మనుమలను మనుమలను గలిగి
వన్నె వాసియు గలగి వర్ధిల్లరయ్యా

**17**

శ్రీరస్తు విజయోస్తు దీర్ఘాయురస్తు
ధన కనకవస్తు వాహన సిద్ధిరస్తు
కారుణ్యముగా మీకు కళ్యాణమస్తు
ఆశ్వీయుజ శ్రీశుద్ధ మహర్ణవమినాడు
శాశ్వతాశీర్వాద సత్య వాక్యములు
బాలకుల దీవెనలు బ్రహ్మ దీవెనలూ
చాల సంతోషులై చెలగుచును మీరు
భువిలోన వెలలేని భోగములు కలిగి
గజములు తురగములు కడువేడ్క కలిగి
సుజన సంభావనలే చోద్యములు కలిగి
పల్లకీలందలాల్ పట్టె మంచములు
చేలాలు శారీలు చెలువంబు కలిగి
ధన ధాన్య రాసులు దండిగా కలిగి
తేజంబు ప్రాభవస్తామంబు కలిగి
అందలంబులు కలిగి యతికీర్తి కలిగి
పొందుగా నవరత్న భూషణాలు కలిగి
సతులతో హితులతో సౌఖ్యములు కలిగి
గంధ మాల్యాంబర గ్రామములు కలిగి
బంధు జాలంబుల ప్రఖ్యాతి కలిగి
అన్నదమ్ములు కలగి అతికీర్తి కలిగి
మనుమలకు మనుమలు మనుమలుం గలిగి
కొడుకులు కోడండ్రు కొమరప్ప కలిగి
వడుగులను పెండ్లిండ్లు వరుసతో కలిగి
బావ మరదలు కలిగి బంధువులు కలిగి

**18**



యెడ తెగని సంపదలు యే ప్రొద్దు కలిగి
పుడమి వర్ధిల్లుడీ పుణ్యములు కలిగి
ఏడాది కొకదినము ఇందరము మేము
కూడియు మిమ్మెల్ల కొనియాడినాము
చొక్కముగ మామనవి చెవుల వినరయ్యా
వెయ్యారు లేమైన వేడేదిలేదు
అయ్యవారికి చాలు అయిదు వరహాలు
అటుమీద మాబోటి చిట్టిగాండ్రకెల్ల
పెద్ద దూముడు పటికి బెల్లం
బొకమణుగు
పట్టు పచ్చడ మొకటి
పాడియావు వొకటి
తెప్పించి యివ్వవలె తేజమలరంగ
మీ కీర్తి ధరలోన మేటియై దనర
మేము దీవించెదము




వీటినే పండిత గొర్రెపాటి వెంకట సుబ్బయ్యగారు నవ్వులాటలు అన్నారు. చక్కిలిగింతల పాటలు వీటిలో ఒక భాగంగా భావించవచ్చు. ప్రధానంగా ఇవి హాస్య స్ఫోరకాలు. సంప్రదాయపు గుళికలు. అక్క బావలు, మామ అల్లుళ్ళు, బావలు ఇందు ప్రధాన పాత్రలు. పాడుతూ ఎదుటివారిని ఉలికించడం ఈ పాటల ఉద్దేశం. మేనమామల గురించి ఒక బాలిక ఊహించి పాడే పాట –

కొండమీద మా మామ ఇల్లు కట్టేడు
కోరి కొడుకుల కంది మా అత్త
కొడుకులు కొండమీద కోతుల్ని పోలు
కూతుళ్ళు గుడివాడ కుక్కల్ని పోలు
అల్లుళ్ళు నెల్లూరి రాజులను పోలు
కోడళ్ళు గోల్కొండ చిలకల్ను పోలు

ఎవరినో ఉద్దేశించి కాకువుగా పాడే పాటలో ధ్వని స్పష్టంగా కనిపిస్తుంది.

పొద్దున్నె లేచింది చిట్టెలుక
ముగము కాలు కడిగింది చిట్టెలుక
గాదెలో దిగింది చిట్టెలుక
వడ్లగింజ కొరికింది చిట్టెలుక
పాలు అన్నం చేసింది చిట్టెలుక
మొగినికే పెట్టింది చిట్టెలుక

ఈ పాటను కోలారు జిల్లా చింతామణికి చెందిన గంగప్ప సేకరించారు. అలాగే అత్తపెట్టే ఆరళ్ళలో

కోడలా కోడలా కొడుకు పెళ్ళామా
పచ్చి పాలమీద మీగడయేది?

ఇలాగే తాతగారిని ఎగతాళి పట్టించే-

*తాత! పీత ముంజకాయ మూత*
*తాత! తంగేడు పుల్లా*

మొదలైన పాటలు ఎన్నో ఉన్నాయి. నిజానికి ఎగతాళి పాటలు వావి వరుసలను పెంచుతాయి. జీవితాన్ని ఆనందమయం చేస్తాయి.

## కొత్త అల్లుడు



అత్తవారింటికి కొత్తల్లు డొస్తేను
కొత్త సున్నము దెచ్చి మొత్తరమ్మ
కొత్త సున్నముతోను కోపంబు వస్తేను
నల్లేరు తెప్పించి నలవరమ్మ
నల్లేరు చేతను నసనసలోడితే
దూలగుండాకుతో దుఃఖమ్ము వస్తేను
బర్రెపలుపుతోను బాదరమ్మ
బర్రెపలుపుతోను బాధలు వస్తేను
కొరడాలు తెప్పించి కొట్టరమ్మ
అత్తారింటికి వస్తే సుఖమేమంటూ
వచ్చిన దారినే పట్టరమ్మ

## కొత్త కోడలు

కొండమీద బీరకాయ కొయ్యనన్నది
అత్త తెచ్చిన పట్టుచీర కట్టనన్నది
మామ తెచ్చిన మల్లెపూలు గుచ్చనన్నది
వదినె తెచ్చిన వంకాయ వండనన్నది
మరిది తెచ్చిన మంచమ్మీద కూర్చోనన్నది
పొయిమీద పాలచుక్క త్రిప్పనన్నది

**2**

బుర్రుపిట్ట బుర్రుపిట్ట తుర్రుమన్నది
పడమటింటి కాపురం చేయనన్నది
అత్తతెచ్చిన కొత్తకోక కట్టనన్నది
మామతెచ్చిన మల్లెపూలు ముడువనన్నది
మొగునిచేత మొట్టిక్కాయ తింటానన్నది.

**3**

చెట్టుమీది రామచిలుక తుర్రుమంది
అత్తతెచ్చిన కొత్తకోక కట్టనంది
మామతెచ్చిన మల్లెపువ్వు ముడవనంది
పీటకింది రొట్టెముక్క తియ్యనంది
మొగుడుచేత మూడు గుద్దులు తింటానంది

## అత్తింటి కోడలు

అత్తింటికోడలూ అలిగి పడుకుంది
అలుకల్లుతీర్చవే ములుకుల్లకర్ర
అట్లుతిని అన్నయ్య అలిగిపడుకుంటే
తిట్లుతిని వదినమ్మ తీపులందింది
పొద్దోయి పొద్దోయి అన్నయ్యవస్తె
జల్తారు చీరల్లుకట్టు వదినమ్మ

అక్కగారి బట్టలు సిల్కు బట్టలు
బావగారి బట్టలు గోనెసంచులు

**మాపటి భోజనం**

మాటలు తేటలు మాయింట
మాపిటి భోజనం మీ యింట
ఆటల్లు పాటల్లు అత్తవారింట
అతిరాజు చిట్టిపనులు కన్నవారింట
వాన లేక వరిమొక్క వాడుదేలింది
నీళ్ళు లేక వరిమొక్క వాడుదేలింది
నీళ్ళు లేక నిలువు కెండింది
వానొచ్చి కురిచేది వరిచేలమీదా
లక్ష్మొచ్చి వరిగింది రాసులమీద

**తాత**

చింత చెట్టు తొర్రలోన చిలుక ఉన్నదీ
తాత బోడి బుర్ర మీద పిలక ఉన్నదీ
చిలుక ముక్కు తాత ముక్కు ఒకటిగున్నదీ
చిలుక బుర్ర తాత బొర్ర తీరునున్నదీ
తాత కాళ్లకున్న జోడు కిర్రుమన్నదీ
చింత తొర్రలోన పిట్ట తుర్రుమన్నదీ.

**మా తాత పిలక**

మా తాత అందం మా తాత మీసం
చందమామ చందం రొయ్యల మీసం
మా తాత గుండు మా తాత పిలక
గుమ్మడి పండు పంచదార చిలక

**మనవడు**

చింత చెట్టు తొర్రలోన చిలుక యున్నది
చిలక ముక్కు జూచి తాత చిర్రుమన్నాడు
చిలుక ముక్కు తాత ముక్కు పోలికున్నది
తాతకి దాన్ని చూస్తె కోపం తాళకున్నది
చిలక ఏమి చేసింది తాత ఊరుకో!
తాత :
ఛీఛీ! వెధవ నోరుముయ్యి, చితక గొట్టేను
మనవడు :
తాత! నువ్వులేచి నన్ను గొట్టవస్తేను
తాత! నీదు గూనునడ్డి దడ దడ మంటుంది
ఆ తాత! ఓ తాత! తాతోయి తాత

**పిలక - గిలక**

నూతి గిలకతో నీళ్ళు తోడుతూ
నల్ల పలకపై గీతలు గీస్తా
రామచిలుకకు మాట నేర్పుతా
తాత పిలుకతో ఆటలాడుతా!

**3**

తాత! పీత! ముంజుకాయమూత
కొడవలెట్టి కోత రాయాకురాత
శ్రీరామ దూత లంకదలిమేత
గోదావరీత గరిటెకాల్చివాత
తాడిచెట్టు కీత సీసంకాల్చి పోత
లంకలో సీతని భరతమాత కోడికూత

**4**

తాతా పీతా
ముంజుకాయ మూత
కొడవలిపెట్టి కోత
నంజునా చేత వీపునీరోత

**5**

తాతా తడిపాతా
నీ గోచిగుడ్డ చిల్లు గోడమీద బల్లి
నువు రాసుకొన్న రాత నేనేమి సేతును తాత

## అవ్వ

అవ్వ తవ్వ తెచ్చి యివ్వకున్నవు
మునసబుగారితో జెప్పి ముక్కు గవ్వకట్టేస్తాను
అవ్వా తవ్వ తెచ్చియ్యే కూకోము పని అవ
కానిపోని తవ్వగాదు కంచుగట్ల తగుమాది
కరణంగారితో జెప్పి ఖైదులోనే పెట్టిస్తాను
పనికిరాని తవ్వకాదు పమిడికట్ల తవ్వమాది
బద్రేని రామస్వామితో చెప్పి
పండ్లు ఊడగొట్టిస్తాను
ఎదురుపేళ్ళ తవ్వకాదు ఎండికట్ల తవ్వమాది
కలమిడి సుబ్బారావుతో చెప్పి
వెన్నుబద్దలు కొట్టిస్తాను.

## పెండ్లి కొడుకు

గచ్చకాయ గంటీలు కుక్కతోలే కుళ్ళాయి
నక్కతోలే నడికట్లు పులితోలే పూలహారం
అగిశాకే తోరణాలు అలచందలే పూరణము
ఔరౌర పెండ్లికొడుక నీమనసే ఒక కారణం

## పోలీసు

పోలీసమ్మ పోలీసు కాకిబట్టల పోలీసు
ఎర్ర టోపి పోలీసు పొట్టి లాటీ పోలీసు
పెద్ద తుపాకి పోలీసు ధాం ధాం పోలీసు

## చిలక

చిట్టి చిట్టి చిలక చిన్నారి చిలక
మాటలాడే చిలక మా బావ చిలక
పండు తెచ్చె చిలుక మా పచ్చ చిలుక
చుట్టాలొస్తే చిలుక పలుకరించే చిలుక
తోటలో ఉండే చిలుక తోటకూర చిలుక

## 2

చిలుక చిలుక రామచిలుక పలుక నంటుంది
అత్త తెచ్చిన కొత్తకోక కట్టనంటుంది
మామ తెచ్చిన సన్నబియ్యం దంచనంటుంది
అవ్వ తెచ్చిన ఆది రసం తినననంటుంది
మొగుడు తెచ్చిన మల్లెపూలు ముడవనంటుంది
కటారి కోకమీద కన్ను ఉన్నదే
మామ కొడుకు మీద మనసు ఉన్నదే

## కొత్త కోక

నారాయణ నారాయణ నక్కతోక
నామొగుడు తెచ్చాడు కొత్తకోక
నే నెందుకుంటాను కట్టు కోక
ఎన్నాళ్ళు ఉంటుంది చినిగి పోక
ఊరుకోదు మా అత్త మొత్తుకోక

## చెన్నంపల్లి సెనగల్

తంద నానె తాన తందనానె
చెన్నంపల్లి సెనగల్
అవి యేగుతున్నయి పప్పుల్
మా అక్క కొచ్చినయి నొప్పుల్
మా బావ కొచ్చినయి తిప్పుల్
మా అయ్య కొచ్చినయి అప్పుల్
తందనానె తాన తందనాన

## 2

చన్నంపల్లి సెనగలు
అవి యేగుతున్నయి పొప్పులు
మా అక్కకొచ్చెను నొప్పులు
మా బావకొచ్చెను తిప్పులు
మా నాయనకయినవి అప్పులు॥తంద॥

3
చన్నంపల్లి సాయిబు
ఆ సాయిబుకున్నది గడ్డము
గడ్డానికున్నది గరక
గుర్రమొచ్చి పెరక
వాడు లబలబ మొత్తుకొని వురక
తందనానె, తందానె తానందన॥తంద॥

## చుట్టాలొచ్చారు

చుట్టాలొచ్చారు చూడే మంగమ్మ
చుట్టాలొచ్చారు చూడే మంగమ్మ
వాకిటా పీటేసి తిట్టే మంగమ్మ
నల్లేరుకాడ దెచ్చి నలుపే మంగమ్మ
ఉబ్బంత కాడ దెచ్చి వుయ్యే మంగమ్మ
దూలగొండీదెచ్చి దులుపే మంగమ్మ

## అమ్మాయి

చింత చెట్టు క్రింద చిట్టి బొమ్మరిళ్ళు
వాటిక్కి వాకిళ్లు బోరు తలుపుల్లు
బోరు తలుపుల కింద పొందైన మేడ
ఆ మేడనున్నాయి యిద్దరు హంసల్లు
ఆ మేడ ఆ యిద్దరు హంసల్ల పేరేమిపేరు
రాచిలుక చిలుకలకు చెలికాడు తాను
అబ్బాయి-చిలుకలకు
హంసలకు చెలికత్తెతాను
అమ్మాయి-హంసలకు

## అబ్బాయి మామల్లు

అబ్బాయి మామల్లు ఎటువంటివారు
చెవి చెవికి బారెడేసి - పోగుల్లవారు
అంచు పంచెలవారు - అంగీలవారు
పట్టు పంచెలవారు - పగడాలవారు
నంది కొండయవంటి - నామాల వారు
పెసర కాయవంటి - పెదిమల్లవారు
కందికాయవంటి - కనుబొమ్మలవారు
మిరపకాయవంటి - మీసాలవారు
వారు మా అబ్బాయి - మేనమామల్లు

## చింతకాయ

చింతకాయ బొంతకాయ
చిగురు మామిడి కాయ
కోనేటి వంకాయ - కొమ్మ నిమ్మపండు
యాలగుల తోటలో - జీలుగులు వెయ్యగా
ఒకటే పుయ్యగా - ఒరి పువ్వులాలగా
తాటాకు దబ్బలం - కోట కట్టించగా
కోటలో వున్నది - గున్నటేనుగు పిల్ల
తగిలి తగిలి వచ్చింది - తాంబేలు పిల్ల
వినాయకుడి చేతిలో ఉండ్రం ఉండ్రం
పున్నమి చంద్రుడు గుండ్రం గుండ్రం
వీధిలో కుక్క భద్రం భద్రం

## దొంగ

కొండమీద గుండు
గుండుపైన కొంగ
కొంగ కొరకు దొంగ
పొంచియున్న పాము
దొంగ కాలు కరచెను

## ఎర్రచీమ

ఎర్రచీమ! ఎర్రచీమ!
ఎచటి కెళ్లావు?

చిట్టిపాప పుట్టినరోజు
విందుకెళ్లాను
ఎర్రచీమ! ఎర్ర చీమ
ఏమిచేశావూ!
చిట్టిపాప బుగ్గ మీద
ముద్దు పెట్టాను.

**అల్లవారి కుక్క**



అల్ల వారింటికి - చల్లకెడితేను
అల్లవారీ కుక్క - భౌయ్ మన్నది
నా కాళ్ల గజ్జెలు - ఘల్లు మన్నాయి
నా చంకలో బిడ్డ - కేరు మన్నాడు

**వియ్యపురాలు**

చిట్టి చిట్టి మిరియాలు
చెట్టుకిందా బోశారు
బొమ్మరిల్లు కట్టారు
బొమ్మల పెళ్లి చేశారు
వియ్యంకున కన్నం లేదు
వియ్యపురాలికి నెయ్యీలేదు

**రాకుమారి**

చింతకాయ బొంతకాయ
చిగురు మామిడి కాయ
కోనేటి వంకాయ కొమ్మనిమ్మని పండు
జీలుగులు తోటలో వాగులు మొయ్యగా
నీవంటి పూరాలగా తాటాకు దబ్బనం
కోట గట్టించగా కోటలో ఉన్నాది
తాంబేలు పిల్ల మహరాజు కూతురు

**చక్కిలిగింతలు**

చిట్టి చిట్టి మిరియాలు
చెట్టు క్రింద బోసి
పుట్టామన్ను దెచ్చి
బొమ్మరిల్లూ గట్టీ
బొమ్మరింట్లో బొమ్మ నీళ్లాడితే
బొమ్మ తలకీ నూనె లేదూ
బొమ్మ బిడ్డకి నెయ్యీలేదూ
అంతట్లోనే పెద్దన్నొస్తే
కాళ్లా చెప్పులు విడిపించి
కంచెడు పాయసం జుట్టించి

**బొమ్మరిల్లు**

చింతపువ్వు చింత పువురాలంగ
చిమ్మిలి బొట్టూ బుల్లిచెంబు
దండె వెళ్లేడు నామతిది
దండలు తెచ్చాడు నా మతిది
గోలకొండ పంపించి
గోటూ రవికెలు తెప్పించి

కుమ్మరాళ్లింటికి పంపించి
కుమ్మరి మట్టీ తెప్పించి
బొమ్మరిళ్లా వేయించి
బొమ్మరింట్లో బిడ్డని కంటే
అత్తా! తలకీ ఆముదం లేదు
మామా తలకి మడ్డి లేదు

**మేనత్తపాట**

అబ్బాయి తండ్రులు ఎటువంటివారు
అంచు పంచెలవారు అంగీలవారు
నిలువుటంగీలవారు నియ్యోగివారు
అబ్బాయి మామల్లు ఎటువంటివారు
ఊర కుక్కలతోడ ఊరేగువారు
గుడ్డి గుర్రాల నెక్కి గోడెక్కువారు

**గోచీ చిల్లి**

తాతా తడి పాతా
నీ గోచీ గుడ్డ చిల్లు
గోడమీద బల్లి
నువురాసుకొన్న రాత
నేనేమి సేతును తాత

**కాయ**

ఉట్టిమీద వూరగాయి కుండ
మెల్లిగా దింపరా మేనత్త కొడకా కొడకా కొడకా
బూడిద గుమ్మడికాయ బుచ్చెమ్మ తలకాయ
నార దబ్బకాయ నారమ్మ తలకాయ

**పందెం**

ఉడుం తుడుం తుతేల్ మతేల్
టయ్యూటుయ్యూ తుసుక్ దెబ్బ
అక్క-చెక్క మూడు-ముక్కి
తుమ్ముండ లేముండ
తుంగలు-దుత్తలు తేముండ
అంటిన-ముట్టిన అప్పుండ
తొలగవు నీవు బోగండ

**ఎక్కిళ్లు**

ఎక్కిళ్లు ఎక్కిళ్లు ఏటు బడ్డాయి
బొడ్డుకోసిన ఎరుకలసాని
నూత బడింది వేయరనిచ్చెన
తేర పగ్గములు నూతులో సానిది

**వెలుగు**

చింతకాయ బొంతకాయ
చిగురు మామిడి కాయ
కొల్లేటి వంకాయ కొమ్మనిమ్మపండు
జాలిగిలగుంటలో జీలిగలు మేయగా
కోడాకు దప్పళం - పాటాకు వెలుగు!

**ఆకతాయి**

ఆకతాయాకతాయి అల్లరి సిపాయి
ఉల్లీపాయుల్లిపాయి నోరెల్ల కంపాయి
మిరపకాయి మిరపకాయి మేళమింతకాయి
అవ్వాయి చువ్వాయి అంగట్లో దండాయి
రవ్వాయి రట్టాయి రంగంలో రంతాయి
చెట్టాయి చెమ్మాయి దొడ్డలకు దొమ్మాయి
తుంగాయి దొడ్డాయి వాకిటికి వగ్గాయి
పాడాయి బగ్గాయి వాడకు దూరాయి
వాగాయి మూగాయి వంశానికి చెట్టాయి
మంకాయి పెంకాయి మాపుట్టు వంకాయి
మాపాయి రేపాయి మదిగొప్ప మా పాపాయి
అబ్బాయి గిబ్బాయి అంద్రెబ్బాకతాయి

**2**

పూరి ముందర దొడ్డి
వాముల వాముల గడ్డి
నేను తీసుకొనిపోతి బుడ్డీ
వచ్చెను రామిరెడ్డీ
నన్నూడదన్నె చెడ్డీ ॥తంద॥

## గోరంత ముద్దలు

అరటి పండరటి పండమ్మన్న ముద్ద
పైపై ముద్ద ప్రధాన ముద్ద
లంకసాని లాల్‌పేను
శొంటి కొమ్ము సోమా లింగం
గచ్చ పప్పుగెల కోడి

## గుర్రం

పేపే గుర్రం పెండ్లికి పోయె
తామర గుంటు నీరొచ్చె
గారా, బూరా, దసుక్కు
సూదా దబ్బనమా

## రాజుల విందు

పెట్టమ్మ దంచింది పిడికిలి బియ్యం
కాకమ్మ దంచింది కడవెడు బియ్యం
అమ్మాయి దంచింది అంబావు బియ్యం
రాజులందరికి విందాయె నేడు

## చెప్పుకో

చెప్పుకో చెప్పుకో
చెవులెక్క తీసుకో
మామిడాకిస్తాను మందెట్టుకో

## పెండ్లి కొడుకు

వేసంగి కాలాన ఓ పెళ్లిడకొడకా
వేపతోరణాలనీడనే రమ్మి
మాయింట అబ్బాయి పెళ్ళయ్యేనాడు
మామిడి తోరణాలు మరి దూరిరమ్మి

## గుత్తికొండ

నాగీ నాగీ నల్లేరు
నాగిని పట్టుకు తన్నేరు
  యీదు లీదులు దిప్పేరు
  యీత గంధం బూసేరు
గాది కింద యేసేరు
గంజి మెతుకుల్ బెట్టేరు
  మూలయింట్లో మూసేరు
  ముంతపొగలు యేసేరు
పరమటింట్లో యేసేరు
పక్క లిరుగ తన్నేరు
  గూబలు పట్టుకు యెత్తేరు
  గుత్తికొండ జూపేరు.
రెండు చెవులు పట్టుకునిపైకి లేపేరు

## పండక్కిపిలువు

ముత్యాల ముగ్గులు పెట్టి
రత్నాల తోరణాల్గట్టి
గారెలు బూరెలు ఘనముగ వండితి
పువ్వులు పండ్లూ పొందుగ గూర్చితి
రావయ్యా పండుగకు రాజా
రావయ్య మా యింటికి వేగ

## మిరప బెల్లం

మిరప గింజ
మిరప గింజ – ఏం జేస్తావే

ఆడుతున్న బాలలను ఏడిపిస్తాను
బెల్లం ముక్క
బెల్లం ముక్క - ఏం జేస్తావే
ఏడ్చుచున్న బాలలను ఊరడిస్తాను

**నక్కతోక**



నారాయణ నారాయణ నక్కతోక
నారాయణ పెండ్లాం కుక్కతోక
నామొగుడు దెచ్చింది కొత్తకోక
నేనాడుండేను కట్టుకోక
అదేదుండేను చినిగిపోక
అత్తాదుండేను కొట్టుకోక
మొగుడాదుండేను మొత్తుకోక
నేనాడుండేను పారిపోక
నారాయణ నారాయణ నక్కతోక

**2**

చిత్తరువు పెట్టినా చిన్నింటిలోనా
శ్రీకృష్ణుడన్నయ్య నేమంటె వదినె
ఎప్పటికి నీ యన్న నేమందునమ్మా
నల్లనీ వాడందు నవ్వు మొగమందు
నల్లనీ వాడందు నవ్వు మొగమందూ
చక్కనీ చెల్లిలికి సైదోడువందు

**3**

చక్కనీవాడమ్మ సారంగధరుడు
చిక్కాడు చిత్రాంగి చిన్నమ్మచేత
మారుతల్లీ చేత మాటబడలేకా
చావూకూ లోనయ్యె సారంగధరుడు

**4**

అత్తా అత్తా అందెపు లొట్టా
దిగేసి కొట్టా దీపం పెట్టా
పోయి గోడెక్కా బొబ్బలు బెట్టా

**5**

తాతా తాతా తంగేడుపుల్లా
దశ్శయక్కా కుందేలు పుల్లా

**6**

బావా బావా బురుక్కు
పోయిలా బూడ్డీ బుక్కు
తెచ్చిన పుట్నాలు పెట్టు
వొచ్చిన బాటా పట్టు, పట్టు

**7**

చీమిడిముక్కు - చింతకాయ తొక్కు
మా అత్తపెట్టిన మామిడికాయ తొక్కు

**8**

మేనత్తకొడుకు కమ్మనా మేనమరిది
నన్ను చూడావచ్చి పాతర్లపడెను
పాతర్లబడ్డవాణ్ణి రోకళ్ళకుమ్మ



**9**

అరటిపండంటి పండమ్మన్న ముద్ద
పేపే రామన్న పెండలం ముద్ద
ఆవూపేరేమి గోవుపేరేమి
చంద్రకాంతా నీ మొగుడు పేరేమి?

**10**

కాళ్ళకందు రోలబండ్ల
మూళ్ళముడ్డి నాళ్ళనరం
ఐదురొంటి ఆరుగిరిగిరి
ఏటికి ఒకడు

**11**

దమ్మిడీ పోయింది దేవుళ్ళాడుకో
కాలు విరిగిపోయింది కంకణం కట్టుకో

**12**

చీలాబండి చిక్కుడుకాయ
పాళాఖండి పళ్ళేరుకాయ

**13**

కుంటి కులాసరి ఇంటికి మోసం
నడ్డి ముక్కు నాంచారి పిల్లలెందరు
పారిపోతున్న పిల్లలతోని పదముగ్గురు

**14**

బోడిగుండు బొచ్చుగుండు
కాల్చుకుతింటే కమ్మగుండు

**15**

తొర్లిపండ్ల తొండ మావూరి బండ
బండకింద రెండు కోతులు
మా తాత తెచ్చిన ధోతులు
(పిల్లి) కర్రెగండు పాయిల పొండు

**16**

వాసాలమీదదే మీసాల ఎలుక
అమ్మన్న చేతిదే ముత్యాల గిలక
ముత్యాల గిలకక్కి మూడువంకల్లు
వజ్రాలు తాపింత్రు వారి మామల్లు

**17**

ఊచకర్రో చేత ఉగ్గమోచేత
ఊగుతూ వచ్చిన్న తాతెవ్వరమ్మ?
మానికానిండాను మాడలోసుకుని
మనుమరాలా నిన్ను మనుమడగవస్తి
వాడిన్న పూవుల్లు వాసనలు గలవా
ఓ తాత! ఈ మనుము వొద్దయ్యానాకు!

**18**

మా తాత ముసలి తాత
మా తాత ముంజకాయ మూత
కొడవలిపెట్టి కోత
అందరం తింటాం
ఆనందంగా ఉంటాం

# ఆటల పాటలు



తెలుగువారి సాంఘిక జీవనంలో ఆటల పాటలు ఒక ప్రముఖమైన పాత్ర వహిస్తాయి. నాగరిక వాతావరణంలో వీటి ప్రభావం తగ్గుముఖం పట్టినా, పల్లెపట్టులలో ఆటల పాటలు ప్రచారంలో ఉన్నాయి. నన్నెచోడుని కుమార సంభవం, కొరవి గోపరాజు సింహాసన ద్వాత్రింశిక, ధూర్జటి శ్రీ కాళహస్తి మహాత్మ్యం, శ్రీనాధుని పల్నాటి వీర చరిత్ర, శివరాత్రి మహాత్మ్యం, తాళ్ళపాక పెద తిరుమలయ్య శృంగార దండకం మొదలైన కావ్యాలలోనూ, ప్రబంధాలలోనూ, మహాభారతం మొదలుకొని నేటి వరకు గల శతాధిక రచనలలో ఆటల పాటల ప్రసక్తి ఉంది. సురవరం ప్రతాపరెడ్డిగారు ఆంధ్రుల సాంఘిక చరిత్రలో తెలుగువారి ఆటలను గురించి పలుచోట్ల ప్రస్తావించారు.

డాక్టర్ తిమ్మావజ్ఝల కోదండరామయ్యగారు చెప్పినట్లు "వాఙ్మయంలాగే ఆటలు కూడా జాతి జీవిత ప్రతిబింబాలు. మొదటిది వాగ్రూపమైతే రెండవది క్రియరూపమైనది." మానవునికి మానవునికి మధ్య పోలికలున్నట్లే – ఆటలలోనూ ఖచ్చితంగా పోలిక లుండవచ్చు. కాని దేశ కాల చరిత్ర ప్రభావంతో జాతి సంస్కృతి సంప్రదాయాలకు అనుగుణంగా అవి రూపుదిద్దుకుంటాయి. అలా రూపొందినవే తెలుగువారి ఆటలు కూడా. తెలుగుదేశంలో వెలసిన బౌద్ధ – హిందూ క్షేత్రాలలోని శిల్పాలు చిత్రాలలో ఆటలకు సంబంధించినవి మనకు చాల కనిపిస్తాయి.

పాల్కురికి సోమనాథ కవి నాడు ప్రచారంలో ఉన్న ఆటలను పేర్కొంటాడు.

"పొందంగ రాగుంజ పోగుంజలాట
కుందెన గుడి గుడి గుంచంబులాట
అప్పల విందులయాట పల్మారు
చప్పట్లు పెట్టెడు సరిగుంజలాట
చెరబొంతలయాట చిట్లపొట్లాట
గోరెంతలాట దాగుడుమూతలాట"

పైన వివరించిన ఆరు పంక్తుల పద్యంలో ఎనిమిది ఆటల ప్రసక్తి ఉంది. ఇలాగే తెలుగునాట నేటికీ అచ్చనగండ్లు, ఆరింకి, అందలాలు, ఈలకూతలు, ఉప్పెన పట్టెలు ఓమన గుంటలు, కనుమూసి గంతలు లేదా దాగుడుమూతలు ఇలాటివి ఎన్నో ప్రచారంలో ఉన్నాయి. ఇహ వీటితో వెలసిన పాటలు సరేసరి. ఆడుకునేప్పుడు పాడుకోడానికి అనువుగా ఉంటాయి. తమిళంలో పాడుకొనే గేయాలను 'అమ్మానై' అంటారు. అంకెలు వరుసగా వచ్చేట్లు గచ్చకాయ లాటలో పాడే తెలుగు పాటను చూడండి.

"ఒకటి ఓ చెలియా
రెండూ రోకళ్ళు
మూడూ ముచ్చిలకా
నాలుగు నందన్నా
ఐదుం బేదళ్ళు
ఆరుం జవ్వాజి
ఏడూ ఎలమంద
ఎనిమిది మనమంద
తొమ్మిది తోకుచ్చు
పది పటనేరు"

పాడుకొనే సమయంలో చిటపట చినుకులు చిందులేస్తున్నా యనుకోండి మరో పాట అందుకుంటారు. సందర్భాన్ని బట్టి -

వానా వానా వల్లప్ప
వాకిలి తిరుగూ చెల్లప్ప
కొండ మీది గుండురాయి
కొక్కిరాయి కాలు విరిగె
దానికేమి మందు?
వేపాకు పసుపూ వెల్లుల్లిపాయ
నూనెలో బొట్టూ
నూటొక్కసారి
పూయవోయి
పూట కొక్కసారి"

మొదలైన వైద్య విషయాలను గూడా ప్రసక్తానుసారం పాటల ద్వారా చెబుతున్నారు. బాల వాఙ్మయాన్ని గురించి తెలుసుకునే సందర్భంలో చింతా దీక్షితులుగారి గేయం 'అమ్మణ్ణి' ప్రత్యేకంగా పేర్కొనదగింది.

## అమ్మణ్ణి

*గంధం మెడకూ పూసుకొని*
*పసుపూ కుంకుం రాసుకొని*
*కంటికి కాటుక పెట్టుకొని*
*ఆడవె ఆడవె అమ్మణ్ణి !*
*పువ్వులు తలలో ముడుచుకొని*
*తిలకం నుదుటా దిద్దుకొని*
*బుగ్గను చుక్కా పెట్టుకొని*
*ఆడవె ఆడవె అమ్మణ్ణి !*

ఇదీ తెలుగు పాప అసలైన స్వరూపం. ఇహ బాలల ఆటపాటల లోకంలో విహరిద్దామా!

## చిన పాపా

చందమామా ఇల్లుకట్టి
చుక్కల ముగ్గు చక్కగపెట్టి
అత్తాచెవిలో ముత్యాల్ పోసీ
ఆడుదాం రావే చిన్నపాపా!

## మేలుకొలుపు

చిన్నారి పొన్నారి చిట్టినాతల్లి
చుక్కల్లో చంద్రుడూ చూడవచ్చాడు
తెల్లవారొచ్చింది కోడికూసింది
చూచేటి అక్కల్లు చూడరారమ్మ

ఆడేటి అక్కల్లు ఆడరారమ్మ
ఆడుకోరారమ్మ అక్కల్లుమీరు
ఆడేటివారికి అచ్చావుపాలు
పాడేటివారికి పాలు పంచదార

## ఆడవే పాప

రాయకు పాపమ్మ ఆడవేపాప
రాజులందరు గూడిచూడ వచ్చారు
చూడవచ్చినవారు ఏమి తెచ్చారు
పట్టాభి వుంగ్రాలు పెళ్ళిబటిపూలు
నన్నుగన్నా తండ్రి చీరెట్టనమ్మ
చీరకీ చిలకం అంచెట్టరమ్మ
పిలకీకి రత్నాలు పేరెట్టరమ్మ
పేరుకీ పెట్టెలతో సొమ్మెట్టరమ్మ

## చిట్టి చిలకమ్మ

చిట్టి చిలకమ్మ
అమ్మ కొట్టిందా
తోట కెళ్ళావా
పండు తెచ్చావా
గూట్లో పెట్టావా
గుటుక్కు - మింగావా

## ఆడుదాం - పాడుదాం

ఆడుదాం పాడుదాం
అల్లరెంతో చేయుదాం
గెంతుదాం దూకుదాం
గమ్మత్తెంతో చేయుదాం
కుందుదాం కూలుదాం
గుంజనాలు తీయుదాం
పరుగుదాం పట్టుదాం
గుంజికాయ గుంజుదాం

## చిప్ప చిప్ప గోళ్ళు

చిప్ప చిప్ప గోళ్ళు సింగరాజు గోళ్ళు
మా బావి నీళ్ళు మండాప రాళ్ళు
మా మామ కాళ్ళు మంచం కోళ్ళు

## ఊరెళదాం !

బండీ ఎక్కి మనము
ఏ ఊరెళదాము?
బండీ ఎక్కి మనము
బందరు వెళదాము

సైకిలు ఎక్కి మనము
ఏ ఊరెళదాము?
సైకిలు ఎక్కి మనము
సాలూరెళదాము

పడవా ఎక్కి మనము
ఏ ఊరెళదాము?
పడవా ఎక్కి మనము
పట్నం వెళదాము

రైలూ ఎక్కి మనము
ఏ ఊరెళదాము?
రైలూ ఎక్కి మనము
రాచూరెళదాము

విమానమెక్కి మనము
ఏ ఊరెళదాము?
విమానమెక్కి మనము
వెయ్యూళ్ళెళదాము

## ఆటకు పిలుపు

పిల్లల్లారా రండి
పిడికెడు బియ్యం తెండి
ఆడుకుందాం రండి

అట్టముక్కలు తెండి
శీలశీల బండి
చిత్రమైన బండి
కొత్త గుర్రాల బండి
కొనుక్కుందాం రండి

## కోడీ కోడీ కొక్కొరోకో!

కోడీ కోడీ కొక్కొరొకో
కాకీ కాకీ కావ్ కావ్
తెల్లవారింది తెలివి వచ్చింది
అమ్మలెమ్మంది ఆడుకొమ్మంది

## జానీ జానీ జగ్గయ్య

జానీ జానీ జగ్గయ్య
మంచం కింద మామయ్య
చుట్టాలొచ్చారు లేవయ్య
సినిమా కెళ్దాం రావయ్య
వేగం వేగం పదవయ్య

## విద్దెం విద్దెం

విద్దెం విద్దెం వీసెడు నెయ్యి
విద్దెం చేస్తే గిద్దెడు నెయ్యి
మళ్ళీ చేస్తే మానెడు నెయ్యి
పాకీ వస్తే పావుసేరు
దొర్లివస్తే దుక్కసేరు
నడచివస్తే నిండాసేర్
బువ్వలోకి నెయ్యివేసి
వాముపరక నమలవేసి
గోరు గోరు ముద్ద కాకమ్మ ముద్ద
పాపాయి ముద్ద పానకాల ముద్ద
'ఆ' అని నోట్లో 'గుటుక్' మ్రింగి

**2**

విద్దెం విద్దెం వరహాల విద్దెం
విద్దెం చేస్తే గిద్దెడు నెయ్యి
తప్పక చేస్తే తవ్వెడు నెయ్యి
మారాం చేస్తే మానెడు నెయ్యి

## తోడు

తోడు పాయసం తోడు
అత్తల్ల బంతికే తోడు
మామల్ల బంతికే తోడు
ముద్దు మాణిక్యం తోడు
ముత్యాల హారము తోడు
తోడితో నీ చెయ్యి వేడి
వేడి పాయసం జుట్టు
జుట్టుతే నీ చెయ్యి చుట్టు

**2**

తోడు పాశం తోడు
తొంగల్లి రెప్పల్ల తోడు
ముద్దు మాణిక్యమ్ము తోడు
మురహారి అక్కెప్ప తోడు
తోడు తేనీ చెయ్యివేడ
జూరుకో పాయసం జూరుకో!

## నన్నడుగు

పూగూడు చెట్లల్లో గంగూ
కాపురం చేతాము గంగూ
ఆమాను యీమాను పండూ
కోపురేగి మాగిన పండూ
సాకాల యెల్లప్ప జుట్టూ

జుట్టూకు టెంకాయ కొట్టూ
అది వూడిపోతే నన్నడుగూ
జారిపోతే నన్నడుగూ

**బుజ బుజ రేకులు**

బుజ బుజ రేకుల పిల్లుందా
బుజ్జా రేకుల పిల్లుందా
తాడిమేడి పిల్లుందా
తామరగిరి మొగ్గల్లు

**కిత కిత కిత కిత**

ఇల్లలికి – ముగ్గేసి
పీటేసి – ఆకేసి
పప్పు పెట్టి – పాయసం పెట్టి
అన్నం పెట్టి – అప్పచ్చి పెట్టి
కూర పెట్టి – ఊరగాయ పెట్టి
నెయ్యి వేసి – ముద్ద చేసి
తినిపించి – తినిపించి
చేయి కడిగి – మూతి కడిగి
తాతగారింటికి – దారేదంటే
అత్తవారింటికి – తోవేదంటే
ఇట్లాపోయి – ఇట్లాపోయి
మోచేతిపాలెం – ముందర్నుంచి
ఇట్లాపోయి – ఇట్లాపోయి
ఇదుగో ఇదుగో – వచ్చాం వచ్చాం
చక్కా వచ్చాం – చక్కా వచ్చాం
చక్కిలి గిలిగిలి – చక్కిలి గిలిగిలి

**ఆట పాట**

అవ్వ ఆట గువ్వ గూట
మువ్వ గజ్జి హంస పజ్జి
కేరి నవ్వి కేకి సువ్వి
కుల్కి పల్కి చిల్కి పుణ్కి
తేటలాడి తేటి సాట్టి
పాటపాడి కోకిలాడి
ఆటపాట అమరజ్యోతి

**హూత్ కాకీ**

హూత్! కాకీ
కావు కావు కాకి వచ్చె
కోత్తు! కోత్తు! కోత్తు కాకీ
రివ్వు రివ్వు రొట్టె పోయె
వెక్కి వెక్కి బిడ్డ ఏడ్చె

**చందమామ**

చందమామా చందమామా
అందమయిన చందమామా
ఆటలాడ చందమామా
పాటపాడ చందమామా
దిగిరావా చందమామా
దిగిరావా చందమామా

**సోమరి తిమ్మన్న**

తిండికి రారా తిమ్మన్న
ఇదిగో వస్తానమ్మమ్మా
కట్టెలు కొట్టర తిమ్మన్న
కడుపూ నొస్తుందమ్మమ్మ



**2**

కట్టెలకు పోరా తిమ్మప్పా
కడుపు నొప్పే యమ్మా
గడ్డికి పోరా తిమ్మప్పా
కాలు నొప్పే యమ్మా

మంచం తేరా తిమ్మప్పా
మడిమలు నొప్పే యమ్మా

నీళ్ళకు పోరా తిమ్మప్పా
కీళ్ళు నొప్పే యమ్మా

బొచ్చె తెచ్చుకోరా తిమ్మప్పా
అట్టచెప్పే మా యమ్మా

**చల్ల చెయ్యి**

చల్ల చెయ్యి గొల్లభామ నీ
సందిట దండలు కదిలేను
వెన్న చెయ్యి అమ్మాయి నీ
వెండి మురుగులు కదిలేను
పాలు తాగు అబ్బాయి నీ
పమిడి మురుగులు కదిలేను

(అని తల్లి బిడ్డ చేతులు తిప్పుతుంది. బిడ్డకు వ్యాయామం వలన రక్త ప్రసరణ బాగా జరుగుతుంది)

**అబ్బాయి ధైర్యం**

నూకలు పెట్టెద ఏకులు వడకు
రూకల నిచ్చెద మేకలు కాయి!
అటుకులు పెట్టెద ఆవులు మేపు
బెబ్బులి వచ్చిన బెదరవు కాదా!
చిరుతలు వచ్చిన వెరవవు కాదా!
ఎలుగులు వచ్చిన ఏడ్వవు కాదా!
వడగండ్లు రాలిన వణకవు కాదా!
ఎంతటి ధైర్యం ఇటు చూడు -
మరి 'ఉష్' అంటే ఉలిక్కిపడ్డావే!

**తీయని గంధం**

మామిడాకు కోసి తోరణాలు కట్టి
చింతాకుదూసి బుట్టల్లో పెట్టి
తలుపుల చాటున దాగుదమ
కోతీ కొమ్మచ్చు లాడుదమ

కొమ్మల చాటున దాగుదమ
తియ్యని గంధము తీయుదమ
బాలిక మెడకు పూయుదమ

**చేతి వ్రేళ్ళు**

తిందాం తిందాం ఒక వేలు!
ఎట్లా తిందాం ఒక వేలు?
అప్పుచేసి తిందాం ఒక వేలు
అప్పెట్లా తీరుతుంది ఒక వేలు
ఉన్నాను గదా అన్నిటికీ నేను
పొట్టివాణ్ణి గట్టివాణ్ణి బొటనవ్రేలు

**ఏనుగు**



ఏనుగొచ్చిందేనుగు
ఎక్కడ కొచ్చిందేనుగు
మావూరొచ్చిందేనుగు
మంచినీళ్ళు తాగిందేనుగు
ఉప్పొడెళ్ళిందేనుగు
ఉప్పునీళ్ళు తాగిందేనుగు

**2**

ఏనుగమ్మ ఏనుగు
ఎంతో చక్కని ఏనుగు
నాలుగు కాళ్ళ ఏనుగు
చిన్న తోక ఏనుగు
చేట చెవుల ఏనుగు
తెల్లకొమ్ముల ఏనుగు
బారెడు తొండం ఏనుగు
అంబారి వేసినారు ఏనుగూ
అబ్బాయిని మోసిందేనుగు

**3**

ఏనుగు ఏనుగు నల్లన
ఏనుగు కొమ్ములు తెల్లన
ఏనుగుమీద రాముడు
ఎంతోచక్కని దేముడు

**4**

ఏనుగమ్మ! ఏనుగు
ఏ ఊరెళ్ళిందేనుగు
ఉప్పాడెళ్ళిందేనుగు
ఉప్పు నీళ్ళు తాగిందేనుగు
మా ఊరొచ్చిందేనుగు
మంచి నీళ్ళు తాగిందేనుగు

**వాన పాటలు**

వానాలు కురవాలి వరిచేలు పండాలి
ఘూకొట్లు పండాలి బుడుగో బుడుగో
మా దాసి దంపాలి మాయమ్మ వండాలి
మాబొజ్జ నిండాలి బుడుగో బుడుగో

**2**

వానా వచ్చి వంకలు సాగే
గువ్వా వచ్చి గుడ్డూపెట్టె
తాతా వచ్చి తొంగిచూసే
అవ్వా వచ్చి గుడ్డూతీసే
అమ్మా వచ్చి అట్లూచేసే
నాన్నా వచ్చి గుటుక్కు మింగె

**3**

వానలు జోరుగ కురవాలోయ్
బాగా పంటలు పండాలోయ్
బిడ్డల బొజ్జలు నిండాలోయ్
రైతుల రాజ్యం రావాలోయ్
అందరి మిత్రత అల్లాలోయ్
స్వతంత్రపాలన కావాలోయ్
స్వర్ణయుగమని చాటాలోయ్
భారత బిడ్డలు బలవాలోయ్

**4**

కప్పతల్లి నీళ్ళాడె
కడవల నిండ నీళ్ళొచ్చే
కనవోయ్ – వానదేవుడా
ఈగతల్లి నీళ్ళాడె
వీధుల నిండ నీళ్ళొచ్చే
కనవోయ్ – వానదేవుడా
చేపతల్లి నీళ్ళాడె
చెరువుల నింద నీళ్ళొచ్చే
కనవోయ్ – వానదేవుడా



5

వానా వానా వల్లప్ప
చేతులు చాచు చెల్లప్ప
గడ్డిలోన గారప్ప
దొడ్డి తిరుగు అన్నప్ప
తిరుగు తిరుగు తిమ్మప్ప
తిరుగలేను నరసప్ప

6

వానాలు వానాలు వచ్చాయి
చెఱువులు అన్నీ నిండాయి
కప్పలు చాలా వచ్చాయి
బెక బెక మంటూ అరిచాయి

7

వానాలప్ప వానాలప్ప
వాన వస్తుందో వరద వస్తుందో
రాజుగారి పల్లకి వస్తుందో
వానా వానా వరదప్పా

8

వానా వానా చెల్లప్ప
వాకిలి తిరుగు చెల్లప్ప
తిరుగూ తిరుగూ చెల్లప్ప
తిరగలేనూ చెల్లప్ప
అన్నము తిను చెల్లప్ప
ఆకలి లేదూ చెల్లప్ప
విసురూ విసురూ చెల్లప్ప
విసరాలేనూ చెల్లప్ప

9

వానా వానా వల్లప్ప
వాకిలి తిరుగూ చెల్లప్ప
కొండమీది గుండురాయి
కొక్కిరాయి కాలు విరిగె
దానికేమి మందు?
వేపాకు పసుపూ, వెల్లుల్లిపాయ
నూనెలో మడ్డి నూటొక్కసారి
పూయవోయి నూరి, పూటకొక్క తూరి

**ఎందుకు ?**

ఎండలు కాసేదెందుకురా?
వానలు కురిసేటందుకురా
వానలు కురిసేదెందుకురా?
చెరువులు నిండేటందుకురా
చెరువులు నిండే దెందుకురా?
పంటలు పండేటందుకురా
పంటలు పండేదెందుకురా?
ప్రజలు బ్రతికేటందుకురా
ప్రజలు బ్రతికేదెందుకురా?
స్వామిని గొలిచేటందుకురా
స్వామిని కొలిచే దెందుకురా?
ప్రజలను బ్రోచేటందుకురా

మూళ్ళ నీమూతి నీమెళ్ళ మీద చెండు
మూళ్ళ నీ ఐదిలి నీమెళ్ళ మీద చెండు
ఐదిలి - సయిదలి కొండోడి కోత్తు
మీబాబు మీసాలు - ఇంతా ఇంత

**గుడు గుడు కుంచం**

గుడు గుడు గుంజం గుండే రాగం
పాములపట్నం పడిగా రాగం
చిన్నన్న గుర్రం చిందులుతొక్కే
పెద్దన్న గుర్రం పెండ్లికి పోయె
నీ గుర్రం నీళ్ళకు పోయె
నా గుర్రం పాలకు పోయె
కత్తా? కర్రా? వేన్నీళ్ళా? చన్నీళ్ళా?

**2**

గుడు గుడు గుంజం గుండే రాగం
పాములపట్నం పడగా రాగం
అత్తా చెవుల ముత్యాలు పోస్తే
ఆడుకురావే చిటు పాపా?
చిటుపాప పెళ్ళికి చిమ్మిలి దంస్తే
బయటికి రావే పందికొక్కా

**3**

గుడు గుడు గుంచం గుండారాగం
పాములపట్నం పడగారాగం
కత్తెయ్యనా? బద్దెయ్యనా?
రోకలెయ్యనా, రోకలెయ్యనా?
(తర్వాత) -
చన్నీళ్ళు పొయ్యనా
వెన్నీళ్ళు పొయ్యనా
(అని అడగాలి)

**4**

గుడుగుడు కుంచం - గుండే రాగం
పాముల పట్టం - పడగా రాగం
అప్పల్రాజు గుఱ్ఱం - ఆడుకోబోతే
పేపే గుఱ్ఱం - పెళ్ళికి బోతే
నీ గుఱ్ఱం - నీళ్ళకు బోతే
నా గుఱ్ఱం - పాలకు బోతే
కట్టెయ్యనా? బద్దెయ్యనా?
వేణ్ణీళ్ళా? చన్నీళ్ళా?
గుడుగుడు కుంచం - గుండే రాగం
పావడపట్టం - పడగా రాగం
అప్పడాల గుఱ్ఱం - ఆడుకోబేతే
పే పే గుఱ్ఱం - పెళ్ళికి బోతే
అన్నా! అన్నా! నీ పెళ్ళెపు దంటే
రేపు గాక ఎల్లుండి
కత్తీ గాదు బద్దా గాదు
గప్! చిప్!

**5**

గుడిగుడి కుంచం
గుండేరాగం
దేవులపట్నం
పడగారాగం
నీ పెళ్ళెప్పుడు
రేపా! ఎల్లుండా!

**6**

గుడి గుడి గుంచం గుండారాగం
పాములపట్టం పడగారాగం

అన్నపూర్ణ కళ్యాణీ గుళ్ళం
ఆడుకోడానికెళితే!

పార్వతీశం పంచకళ్యాణి
పడుకోటానికెళితే!

స్వామి కీలుగుఱ్ఱం
స్నానానికి వెళితే!

లక్ష్మణస్వామి కాశీగుఱ్ఱం
లగెత్తటానికెళితే!

రాజిబాబు తెల్లగుఱ్ఱం
రాగాలు తీసింది

గుద్దు కావాలా? ముద్దు కావాలా?
అన్నం పెట్టనా? ఆడుకుంటావా?

## తప్పట్లోయ్

తప్పట్లోయి తాళాలోయి
దేవుడిగుళ్ళో మేళాలోయ్
పప్పూబెల్లం దేముడికోయ్
పాలునెయ్యీ పాపాయికోయ్
గోవిందుడమ్మా గోపాలుడమ్మా
కొబ్బరీ బెల్లమ్ముకొని తెచ్చినాడే
ఏడాదికొకసారి ఇటు వచ్చినాడే
పల్లెటూళ్ళు గాన చెల్లిపోయింది
గొల్లవాళ్ళముగాన కూడివచ్చింది
పట్నవాసములోన పనికివస్తుందా?

**2**

తప్పట్లోయ్ తాళాలోయ్
పిల్లలనోళ్ళో బాకాలోయ్
కలహగూళ్ళు కులాలోయ్
మోసపోతులను ముంచాలోయ్
దాస్యబంధం తెంచాలోయ్
దొరల బుర్రలు దించాలోయ్
కుత్సిత మతులు కూలాలోయ్

న్యాయం ధర్మం నిల్వాలోయ్
నీతీ నియమం నేర్వాలోయ్
మాలో శౌర్యం మెదలాలోయ్
తెలుగు చదువు జరగాలోయ్
అయ్యలు మంచిగ నుండాలోయ్
అమ్మలు రాట్నం తిప్పాలోయ్

## గుమ్మాడమ్మ గుమ్మాడి

గుమ్మాడమ్మా గుమ్మాడి
తీగ పాకిందమ్మ గుమ్మాడి
పందిరెక్కిందమ్మ గుమ్మాడి
మొగ్గ తొడిగిందమ్మ గుమ్మాడి
పువ్వు పూసిందమ్మ గుమ్మాడి
కాయగాసిందమ్మ గుమ్మాడి
పండు పండిందమ్మ గుమ్మాడి
పంచిపెట్టేరమ్మ గుమ్మాడి
అమ్మాడమ్మా గుమ్మాడి
మార్చుకొండి పేర్చుకొండి
ఈనీని గుమ్మడి యీ పిల్ల ఎవ్వరు
ఏమే ఓ చిట్టి
ఏడవ్వే గుక్కెట్టి
అమ్మడి గుమ్మడి గునీవారా
అమ్మా అమ్మా వీరెవరు?

**2**

గుమ్మాడమ్మా గుమ్మడి
ఆకుల్లు వేసింది గుమ్మాడి
పూవుల్లు పూసింది గుమ్మాడి
పండ్లు పండిందమ్మ గుమ్మాడి
అందులో ఒక పండు గుమ్మాడి
అతిచక్కనీ పండు గుమ్మాడి
ఆ పండు యెవరమ్మ గుమ్మాడి
మా చిట్టితంద్రమ్మ గుమ్మాడి

**3**

గుమ్మడమ్మ - గుమ్మడి
గింజ వేశాం - గుమ్మడి
మొక్క మొలిచె - గుమ్మడి
తీగప్రాకె - గుమ్మడి
మొగ్గవేసె - గుమ్మడి
పువ్వుపూసె - గుమ్మడి
పిందెవేసె - గుమ్మడి
కాయకాచె - గుమ్మడి
పండు పండె - గుమ్మడి

**4**

గుమ్మాడమ్మ గుమ్మడి
ఆకుల్లు వేసింది గుమ్మాడి
పూత పూసిందమ్మ గుమ్మాడి
కాయ కాసిందమ్మ గుమ్మాడి
పండు పండిందమ్మ గుమ్మాడి
మా చిట్టి తంద్రమ్మ గుమ్మాడి

**5**

గుమ్మాడమ్మా గుమ్మాడి
పందిరే ఎక్కింది గుమ్మాడి
చిగురే వచ్చింది గుమ్మాడి
ఆకులే వేశాయి గుమ్మాడి
పువ్వులే పూచాయి గుమ్మాడి
కాయలే కాచాయి గుమ్మాడి
పండు గుమ్మడికాయల్లు పచ్చబడ్డాయి
నాన్నతో చెబుదాము రారా తమ్మాడా
అక్కతో నేనొక్క మాట చెబుతాను
అంత పెద్దకాయల్లు తీగెల్ల మోసె?
తీగ కాయకు బరువు అని చెప్పలేదా
మన అవ్వ మనతోటి మరచిపోతీవా
అమ్మరో దప్పళం బాగవండావే
నాకెంత యిష్టమో నీకు తెలుసూనె...

**తొక్కుడు బిళ్ళ**



వేడిఅన్నం అప్పడం ముక్క తినో తినో
చల్దిఅన్నం ఉల్లిపాయ జుర్రో జుర్రో
విశాఖపట్నం వీశెడు బెల్లం
నీకో పదలం నాకో పదలం
కళింగపట్నం కాసులపేరు

నీకోపేరు నాకోపేరు
భీమునిపట్నం బిందెల జోడూ
నీకో జోడూ నాకో జోడూ
చెన్నపట్నం చెరుకుముక్క
నీకోముక్క నాకోముక్క

**చెమ్మ చెక్క**

చెమ్మాచెక్కా చారడేసి మొగ్గా
అట్లుపొయ్యంగ ఆరగించంగ

రత్నాల చెమ్మచెక్క రంగు లెయ్యంగ
ముత్యాల చెమ్మచెక్క ముగ్గులెయ్యంగ

పగడాల చెమ్మచెక్క పందిరెయ్యంగ
పందిట్లో మా అన్న పెళ్ళి చెయ్యంగ

అమ్మాయి ఎండలోన
జాజిపూలదండ
మోరీలదండ ముత్యాలదండ

**2**

చెమ్మచెక్క – చారడేసి మొగ్గ
అట్లుపోయంగ – ఆరగించంగ
అరచేతిలో గవ్వ – ఆడుకుందాం రండి
సుబ్బారాయుడు షష్ఠి – చూచివద్దాం రండి
ఆకుపువ్వులదండ – అడిగివద్దాం రండి
ఆరుబైట స్థలంలో – ఆడుకుందాం రండి
ముత్యాల చెమ్మ చెక్క – ముగ్గు లెట్టంగ
రత్నాల చెమ్మచెక్క – రాలుగట్టంగ
ముత్యాల పందిట్లో – ముగ్గులెట్టంగ
రత్నాల పందిట్లో – రంగులెయ్యంగ
చెమ్మచెక్క చేయుమక్కా

**3**

కొండెక్కు పూలు జుట్టవే
అమ్మ నన్ను గోపాల కృష్ణుడనవే
చిన్నారి నామము పెట్టవే
అమ్మ నాకు వన్నెల సొమ్ములు పెట్టవే
వీరునాను నాకు పెట్టవే
అమ్మ నన్ను కీర్తివహించిన వీరుడనవే
కుప్పెకుచ్చుల జడలు నా కెయ్యవే
అమ్మ నన్ను కూర్మావతారుడనవే
హారం పతకం నాకు వెయ్యవే
అమ్మ నన్ను అయోధ్య రాముడనవే
చేతి వంకీలు నాకు పెట్టవే
అమ్మ నన్ను వయికుంఠ వాసుడనవే
వేలి ఉంగరం నాకు పెట్టవే
అమ్మ నన్ను వెలలేని కృష్ణుడనవే
మొలకు గజ్జలు నాకు గట్టవే
అమ్మ నన్ను మోక్షావతారుడనవే
కాలి కందెలు నాకు పెట్టవే
అమ్మ నన్ను కలికావతారుడనవే
వొళ్ళంత సొమ్ములెట్టవే
అమ్మ నన్ను వజ్రాల వాసుడనవే
పట్టుపంచ నాకు కట్టవే
అమ్మ నన్ను పార్వతీ తనయుడనవే

**4**

తెనుగు మొగ్గ భారతాంబ మెచ్చ
భాగ్యమివ్వంగ శోభ కల్గంగ
రత్నాల బిడ్డలు రంగు లేయంగ
ముత్యాల కొమ్మలు ముగ్గు లేయంగ

పందిట్లో ఒకపాప పరుగులెత్తంగ
రావమ్మ రావమ్మ భారత పద్మాక్షి

**5**

కొక్కోలంకా కొడవల్లంకా
లంకాతీసి రామునికొట్టు
ఏగుచుక్క ఏలకి మొగ్గ
వెన్నెల కుప్పలు ఘళ్ళు ఘళ్ళు
పచ్చి బియ్యం పేలాలు

**అచ్చనగాయలు**

ఒకటి ఒప్పులకుప్పా
రెండు రేగుల చుక్కా
మూడు ముక్కాలి పీటా
నాల్గూ నల్లని మొగ్గా
ఐదోది జెల్లు అందరు

**2**

ఒక్కా ఓ చెలియా రెండు రేవిళ్ళు
మూడు ముచ్చిలకా నాలుగు నందన్నా
ఐదుం చిట్టిగొలుసు ఆరుం జవ్వాజీ
ఏడని భేటీలు ఎనమల మనమందా
తొమ్మిది తోకుచ్చు పదికి పట్టెడు

**3**

ఒక్కా ఓ చెలియా రెండు రేగుళ్ళా
మువ్వల ముచ్చిలియ నల్లని గురివింద
అయిదని చిటె గొలుసు ఆరుం జివ్వాజీ
ఏడని భేటీలు ఎనిమిది మనమంద
తొమ్మిది తోకుచ్చు పదికి పట్టెడు
పరమట గుడిచిలుక కండె రెండాయె
కాక్కి కొరకంచు పిచ్చిక్కి బీరంచు
అమ్మకు బొమ్మంచు అయ్యకు జామాయ
నాకు పట్టంచు చెల్లెలు చేమంతి
తమ్ముడు తలపాక మరదలకు ఆభరణం

**4**

ఒక్కా ఓ చెలియా రెండూ రోకళ్ళా
మూడూ ముచ్చిలక నాలుగు నందన్నా
ఐదుంచిట్టి గొలుసు ఆరుందారాలు
ఏడుం బేడీలూ ఎనమా మనమందా
తొంబా తోకుచ్చు పదికీ పట్టెళ్ళాం
కన్నా రెండాయి ఒక్కాయి ఒక్కు
రెక్కాయి రెట్టి ముక్కాయి మువ్వ
నక్కాయి నంది ఐదుం బొడ్డు
ఆరింక తాళ ఏడిశాబొద్దు
ఏనమాకన్ను తొంబా పరక
తొట్టికి లగ్గి

**5**

మొదటిది – మొగ్గ
రెండోది – రోజా
మూడోది – ముత్యం
నాల్గోది – నవరత్నం
ఐదోది – అప్పచ్చి
ఆరోది – అక్కా
ఏడోది – ఎలుకా
ఎనిమిదోది – ఎనుము
తొమ్మిదోది – దొండ
పదోది – పాట
పదకొండోది – భామ
పన్నెండోది పద్మం నేపండా

6

కాయపటురానికుచ్చు బంగారుకుచ్చు
కాయ నాతో ఆడినది సంగాత పడుచు
కాయ మూడవదమ్మా ముక్కాలపీట
కాయ నాలగవదమ్మా నల్లాని పూస
కాయ అయిదవదమ్మా అచ్చన్నపట్టి
కాయ ఆరవదమ్మా అమ్మన్నకాయ
కాయ యేడవదమ్మా నాకాయ
యెత్తిపట్టికట్టు

7

ఒక్కా నంద చిక్కిటీలు
ముక్కుమల్లె నంగనాచి
ఆదుంరెళ్ళు అత్తవారు
కొత్తపుస్తి కొడుకుపేరు
మల్లెమొగ్గ మామిడిపండు

### ఐదు వేళ్ళు



తిందాం తిందాం ఒక వేలు
ఎట్లా తిందాం ఒక వేలు
అప్పుచేసి తిందాం ఒక వేలు
అప్పెట్టా తీరుతుంది ఒక వేలు
ఉన్నాగదా నేను అన్నింటికీ
పొట్టివాణ్ణి, గట్టివాణ్ణి బొటనవేలు

### చిప్ప చిప్ప గోళ్ళు

చిప్ప చిప్ప గోళ్ళు సింగరాజు గోళ్ళు
మాతాత గోళ్ళు మండాప గోళ్ళు
చుక్కచుక్కల గోళ్ళు సుందరమ్మ గోళ్ళు
ముచ్చటైన గోళ్ళు ముత్యాల జోళ్ళు

### గోరుముద్దలు

మాయెద్దు మీయెద్దు నీళ్ళకెళ్ళింది
తాతగారెద్దొచ్చి తన్ని పొడిచింది
అయ్యగారెద్దొచ్చి ఆలకించింది
మామగారెద్దొచ్చి మంతరించింది
మాబుల్లి మాబుల్లి చిట్టిబుల్లీలు
మీయమ్మ మాయమ్మ తోటికోడళ్ళు
మీబాబు మాబాబు అన్నదమ్ముల్లు
కరణాలదొడ్డిలో కంకణాలప్ప
బోడోడి దొడ్డిలో భోజనాలెట్టె

### కాళ్ళగజ్జి

కాళ్ళాగజ్జి కంకాళమ్మా
వేగులచుక్కా వెలగామొగ్గా
మొగ్గాకాదూ మోదుగ నీరు
నీరుకాదు నిమ్మలవాయ
వాయాకాదూ కమ్మరమెట్టు
మెట్టూకాదు మేదరి జబ్బా
జబ్బాకాదు జలారికట్టా
ముత్యంపెట్టె బైటికిరావే పందికొక్కా
దాగుడుమూతా దండాకోర్
పిల్లివచ్చె ఎలకా చోర్



## 2

రింగు రింగు బిళ్ళ -
రింగురింగు బిళ్ళ - రూపాయి దండ
దండ గాదు - తామర మొగ్గ
మొగ్గా గాదు - మోదుగ నీరు
నీరు గాదు - నిమ్మల బావి
బావి గాదు - బచ్చుల కూర
కూర గాదు - కుంకుమ మెట్టు
మెట్టు గాదు - మేదర యిల్లు
ఇల్లు గాదు - ఈగల తుట్ట
కాలు దీసి - కడకు పెట్టు

## 3

కాళ్ళగజ్జి కంకాళమ్మా
వేగుచుక్కా వెలగామొగ్గా
మొగ్గాకాదూ మోటానీరు
నీరుకాదు నిమ్మలబావి
బావికాదు బచ్చులకూర
కూరగాదు గుమ్మడిపండు
పండుగాదు పాపాకాలు
కాలుతీసి కడగబెట్టు

## 4

కాళ్ళాగజ్జి కంకాణమ్మ
ఏలకులచుక్క ఎలగా మొగ్గ
రాజుగారి దొడ్లో ఏముందంటే
గౌరీమోరీ కాలుతీసి కడగాబెట్టు

## 5

కాళ్ళాగజ్జి కంకాణమ్మ
వేగులచుక్క వెలగాపండు
మామిడిమొగ్గ మల్లేసారి
లింగులిటుకు పందేమారి పటుకు
రాజుగారిదొడ్లో ఏముందంటే
కవ్వలి తువ్వరి
కాలుతీసి కడగబెట్టు
వత్తిత్తిపండు వత్తిలేనిపండు
దానిమ్మపండు దబ్బపండు

## 6

కాళ్ళగజ్జీ - కంకాళమ్మ
వేగుచుక్క - వెలగ మొగ్గా
మొగ్గాకాదు - మోదుగనీరు
నీరుకాదు - నిమ్మలవాయ
వాయకాదు - వాయంటకూర
కూరగాదు - గుమ్మడిపండు
పండు కాదది - పాపడి మీసం
మీసం కాదు - మిరియాలపోతు
పోతుగాదు - బొమ్మలశెట్టి
శెట్టిగాదుర - శామలమన్ను
మన్నుగాదు - మంచిగంధపు చెక్క
లింగులిటుకు - పందెమాల పటుకు
కాలు పండినట్లు - కడకు దీసిపెట్టు

7

తెలుగు చొక్కా భారత మొగ్గ
స్వేచ్ఛాకాలం చప్పునరాగా
సోదరులంతా వెలుగుపూలూ
మంచి మతులు భారత సుతులూ
కాలూ పండేచెల్లి కడకు తీసిపెట్టు

(గమనిక: ఇచట గజ్జ అని మరో రూపమూ వాడుకలో ఉంది.)

## దాగుడుమూతలు



దాగుడుమూత దండాకోరు
పిల్లీవచ్చే ఎలుక చావ్
ఎక్కడి వారక్కడనే

2

దాగుడుమూతా దండాకోరు
పిల్లీవచ్చే ఎలుకాదాగే
ఎక్కడి దొంగలక్కడే
గప్‌చిప్ సాంబారు బుడ్డీ
దాగుడు మూత దండాకోర్
పిల్లీ వచ్చె ఎలుకా దాగే
ఎక్కడి దొంగలు అక్కడనే
గప్ చిప్ సంబారు బుడ్డి॥
కళ్ళూ మూసి కాలీకోర్
ఎక్కడి దొంగలు అక్కడనే
అడుక్కో – బుడుక్కో సంబారు బుడ్డి
గప్ చిప్ – గప్ చిప్॥

3

దాగుడుమూత లాడుదమ
తరువుల మూలల దాగుదమ
అటవీస్థలముల కేగుదమ
వటపత్రంబుల కోయుదమ
పొన్నలు పొగడలు ఎక్కుదమ
చిన్నకృష్ణుని వేదుదమ
కురువింద పొదలో దూరుదమ
అశోకవృక్షము ఎక్కుదమ
జనని జానకిని వెదుకుదమ
బాలికలందరు కూడుదమ
తలుపుల మూలల దాగుదమ

4

అటవీస్థలముల కరుగుదమ
వటపత్రంబుల కోయుదమ
చేరువ వనముల కేగుదమ
దాగుడుమూతల నాడుదమ
తరువులచాటున దాగుదమ
కోతికొమ్మచ్చు లాడుదమ
కొమ్మలచాటున దాగుదమ
తియ్యని గంధం తీయుదమ
బాలిక మెడల పూయుదమ

### 5

బూచి బూచీ బూచీ
నెత్తిన టోపీ ఎరుగండయ్యా
పేదలరక్తం పీల్చేబూచి
కర్షక కష్టం కుడిచే బూచీ
క్రూరత కలిగిన కోరల బూచీ
లంచగొండుల పెంచిన బూచీ
సోదరులంతా ఏకంకండీ
కళ్ళకుగంతా కట్టిన బూచీ
గంతలబూచీ కనుగొనవమ్మా
...................... దొంగ
తడుముచు వచ్చె
ఎక్కడదొంగ లక్కడే

### 6

దాగుడుముచ్చి దండాకోర్
పిల్లీవచ్చె ఎలుకదాట్
ఎక్కడి దొంగలక్కడే
పారిపో పారిపో
తూరితేపిల్లి పారితేపిల్లి
పడమటక్కల్లారా పారిపొండోయ్
గప్‌చిప్ సంబారుబుడ్డి

### 7

గట్టుమీదాకోడి – గవ్వల్లాకోడి
తొక్కితే తొంభయ్యి – పిల్లల్లాకోడి
అల్లల్లా కోడికి – ఆకు మిరియంబు
పిల్లల్లా కోడికి – పిండి మిరియంబు
మా తాతకోడికి – మంచి మిరియంబు
అప్పల్లాలా – డిప్పలు ముయ్యండి
అడుక్కో బుడుక్కో – సంబారుబడ్డి

## నాలుగు స్తంభాలాట



నాలుగు స్తంభాలాట నడిమికి తొడిమికి
తానక తప్పక తనపేరేమిటి?
ఊరగాయ కుండ ఉసిరికాయ కుండ
పాపిట కాయల కుండ పటుక్కుమంది

### 2

నాలుగు స్తంభాలాటా నడిమికి తొడిమికి
తానక తప్పక తన పేరేమంటే
ఉట్టిమీద బెల్లం పొట్టి కాకరకాయ
బావా బావా! బరుకూ బరుకూ!
తన్నులుతింటే తలకొకటి
తల కొట్టు

## తత్తిం బిత్తం

తత్తిం బిత్తం తగడా బిత్తిం
ఏకోపిల్ల వెలగాపండు
మామిడిముట్టి మల్లెరాకు
కీరకాయ బీరకాయ
గంగిరెడ్డీ బాయికాడ
కాలుముదువు కామాక్షీ

**ఎరుపు**

చిక్కుడు పువ్వెరుపు–చిలుక ముక్కెరుపు
చింత చిగురెరుపు – దోర పండెరుపు
రక్కిస పండెరుపు – రాగి చెంబెరుపు
రాచ వారిండ్లలో – మాణిక్యమెరుపు
తానెరుపు అమ్మాయి. – తన వారిలోన

**2**

చిట్టీత పండెరుపు – చిలక ముక్కెరుపు
చింతల్ల చిగురెరుపు – జీడి పండెరుపు
దానిమ్మ పండెరుపు–తాంబూలమెరుపు
తానెరుపు అబ్బాయి – తనవారిలోన

**రంగు రంగులు**

పాపల్లారా రండీ పాపల్లారా రండీ
చక్కటి రంగు చూడండి
గులాబి పువ్వును నేనండీ
ఎరుపూ రంగూ నాది
సంపంగి పువ్వును నేనండీ
పచ్చరంగు నాదండీ
చేమంతి పువ్వును నేనండీ
పసుపూ రంగూ నాదండీ
మల్లియపూవును నేనండీ
తెలుపురంగు నాదండీ
ఆకాశమంతా నేనండీ
నీలం రంగు నాదండీ

**పుల్లాట**

వెనకా వెనకా – వేముల తోట
కనకా పండ్లు – కాముని రూపులు
మేఘా శంకులు – మెత్తని గోళ్ళూ
దూదీ మణుగులు – దుప్పటి రేకులు

**2**

కుచ్చుకుచ్చు పుల్ల కూరాకు పుల్ల
దొమ్మరోడొస్తాడు దాక్కొయె పుల్ల
దూదూపుల్ల దురాయ్ పుల్ల
చూడాకుండా జాడాతియ్
ఊదాకుండా పుల్లతియ్

**కొంగ**



కొంగ కొంగ గోళ్ళు
కొరివేడితే చోకు
కోపం మాపై వద్దు
కొనగోళ్ళపై బెట్టు
కొమ్మలాకూ నీరెట్టు
కోటంత పువ్వు చూస్తేను
జూపు నవ్వితే నవ్వు

**దొంగాట**

ఉత్తుత్తీ పళ్ళు – ఉత్రాణీపళ్ళు
నేరేడుపళ్ళు – నిమ్మాపళ్ళు
తోడిపిల్లలారా దొంగైన పిల్ల
తన మొగుడి పేరేమొ తానె చెప్పాలి
(కస్తూరి దొంగ)

ముద్దు కస్తూరి! నీ మొగుడు పేరేమె?
నా మొగుడి పేరొచ్చి నారింజపండు
ఉత్తుత్తీ పళ్ళు ఉత్త్రాణీపళ్ళు
నేరేడీపళ్ళు - నిమ్మాపళ్ళు
(రమణ దొంగ)
చిట్టిరమణా! నీ చెల్వు పేరేమె?
నా చెల్వు పేరొచ్చి - నే చెప్పనమ్మ!
చెప్పవా? దొంగైతే తప్పదోయమ్మ!
నా చెల్వు పేరైతే నా చిట్టిమొగుడు
ఉత్తుత్తీపళ్ళు ఉత్త్రాణీపళ్ళు
నేరేడీపళ్ళు - నిమ్మాపళ్ళు
(శాకుంతల దొంగ)
శాకుంతలా! నీ చిన్ని మొగుడెవడె?
నా చిన్ని మొగుడొచ్చి ఆ చందమామ!

## చిట్ల పొట్లకాయ

చిట్ల పొట్లకాయ సీమ నెల్లికాయ
గోడపుచ్చకాయ గొబ్బినెల్లికాయ
అత్తకు పెడితే అల్లం నేతింటే బెల్లం
కొత్త కుండల్లోని గోధుమల్లారా!
పాలపిడతల్లోని పసిపాపలారా
అమ్మ అమ్మ నీబిడ్డ పేరేమంటే
నీళ్ళల్లో నిమ్మపండు
పాలల్లో పనసపండు
నేతిలో నేరేడుపండు

**2**

చిట్లా చిట్లా కాయా సీమనెల్లికాయా
గోడా పిచ్చికాయా గొబ్బి నెల్లికాయా
తాతాగుల్లం తన్నుకుపోయె
అవ్వ గుల్లం అడుసులో పడే
సూదికావలెనా? దబ్బనం కావలెనా?
వెన్నముద్ద కావలెనా?
గారెబూరగసట్టు
కరచుకో కామాక్షి తాతతై బొమ్మలాట
నీవుంది సామానుల కోట
కోటచుట్టూ బొమ్మలాట

## గోరింక

ఓ అమ్మాయి తలమీద గోరింక
చెప్పకు చెప్పకు చెడిపోతావు
చెప్తే నీ ముక్కు చేదిస్తా
దూలం నుంచి దూకిస్తా
పందిరి నుంచి పాకిస్తా
పట్టెడన్నం తినిపిస్తా
కడివెడు నీళ్ళు త్రాగిస్తా
కళ్ళల్లో కారం కొట్టిస్తా

## ఒప్పులకుప్ప

ఒప్పులకుప్ప ఒయారిభామ
నీలకుచ్చు వాలుమొగ్గ
విస్తరంట ఈనపుల్ల
సన్నబియ్యం చాయపప్పు
గూట్లో రూపాయి నీ మొగుడు సీపాయి

**2**

ఒప్పులకుప్పా ఒయారిభామ
సన్నబియ్యం చాయపప్పు
చిన్న మువ్వ సన్నగాజు
కొబ్బరికోరు బెల్లపచ్చు
గూట్లో రూపాయి నీ మొగుడు సీపాయి
(రోట్లో తవుడు నీ మొగుడెవడు?)

3



ఒప్పుల కుప్పా! ఒయారి భామ
సన్న బియ్యం! చాయపప్పా
పాలు నెయ్యి - పాయసం పొయ్యి
నీ మగడు తింటే - ఆనందమట్టే
ఒప్పుల కుప్పా! ఒయారి భామా
మినప పప్పా - మెంతి పిండీ
తాటి బెల్లం - తవ్వెడూ నెయ్యా
గుప్పెడు తింటే - కులుకూలాడీ
నడుమూ గట్టీ - నా మాటచిట్టీ

**అల్లీ బిల్లీ**

అల్లీ బిల్లీ పెద్దమ్మా
అల్లుడొచ్చా లెయ్యమ్మా
సిరిచాప వెయ్యమ్మా
సిరిగంధం పూయమ్మా
ఆకూవక్క ఇవ్వమ్మా
అల్లుని ముచ్చట తీర్చమ్మా

**అల్లల్లో**

కొండకు పోయి నీకోభాగం
కుందేల్ దెచ్చి నాకోభాగం
నట్టింట్లో బెట్టి అక్కకోభాగం
నాలుక్కోసి అన్నకోభాగం
అల్లల్లల్లో ...............

**గుజ్జం**

అల్లోమల్లో రాగుల మల్లో
రాయి గదిలెరాయి (ను?) చిలుకలు గదిలె
మున్నూటరువై గుజ్జం గదిలె
ముంగుట బొయ్యే గుజ్జం పేరేం
సలాం పైతుర్ హైదర్ గోల్
చింతబరిగెతోని చెల్లాడె గుజ్జం
బొంత బరిగెతోని బొర్లాడె గుజ్జం
అయిల్ బరిగెతోని అయిలాడె గుజ్జం
ఈత బరిగెతోని ఇల్లాడె గుజ్జం

**ఉజ్జీలు**

ఉలవలు ఉలవలు - వేయించి
ఉట్లునిండా పోయించి
కందులు కందులు వేయించి
కడవల నిండా పోయించి
కుడుములు కూలపోసి
అట్లు ఆరపోసి... (అంటూ తిరగకుండా
కుడి ఎడమ ప్రక్కలకు వంగుతూ ఆడతారు)

**గంజి కావడి**

ఉడుకుడుకు గంజి ఒక్కటే మెతుకు
ఉడుకుడుకు గంజి ఉచ్చులో గాడిద
కుంచెడు గంజి ఒక్కటే మెతుకు

**చర్రు**

గట్టుమీద కోడి గవ్వల్లా కోడి
తొక్కితే తొంభై పిల్లల్లా కోడి
అప్పల్లారా డిప్పలు ముయ్యండి చర్రు

2

తోడు పాయసం తోడు
తోడితే నా చెయ్యి వేడి
వేడి పాయసం జుర్రు
జుర్రితే నా నోరు చుర్రు

**బలాబలాలు**

చెన్నపట్నం చెరుకుముక్క
నీకో ముక్క నాకో ముక్క
భీముడు పట్నం బిందెల జోడు
నీకో బిందె నాకో బిందె
కాశీ పట్నం కాసుల జోడు
నీకో కాసు నాకో కాసు

**జంపాలక్క**

కోళ్ళు గోళ్ళు మోకాలు చిప్పలు మొలవడ్డాణము
సానరాయి గంధపు చెక్క పుక్కిట విడియము
కన్నుల కాటుక పండ్లకప్పు అడ్డబొట్టు
నిలువు బొట్టు చుక్కబొట్టు పాలకుండ
పెరుగుకుండ నేతికుండ నూనెకుండ
మీ పిల్లి వచ్చి మా పొయ్యిలో నుండిన
జగడానికి వస్తునా తరిమి వేయుదునా
జాడించే జంపాలక్క

**గోళీకాయల ఆట**

ఒక్కాయ ఒక్క రెక్కాయ రెట్టి
ముక్కాయ మువ్వ నక్కాయ నంది
ఐదుం బొడ్డు ఆరింక తాళ
ఏడిశా బొద్దు ఎనమాకన్ను
తొంబా పరక తొట్టి కంగి

**చెడుగుడు**

చెట్టు కొట్టగా పాలు గారగా
చెన్నా పట్నం దారిచ్చి దారిచ్చి
పిట్టా పిట్టాభాయ్ - పిగిలి పిట్టభాయ్
నెత్తిమీద గుండు దీసి - నేలకొట్ట భాయ్
అల్‌బల్ చెంగల్నాడ్ - కీత్ కీత్ కీత్
ఎల్లెద్దు పుల్లెద్దు - కర్రెద్దు ముగుదాడు

**కబడ్డీ**



బల్ బల్ దారం బంతికి దారం
నీకో దారం నాకో దారం

చెట్టు కొట్టంగ పాలు కారంగ
నిన్ను కొట్టంగ నీళ్ళు కారంగ

లవంగ మొగ్గ లాంతరు తీగె
రారా కృష్ణా రారా బాబూ

చాట్ల నూకలు చిల్లం కల్లం
చెట్టుమీద దయ్యం నాకేం భయ్యం

ఎగిరి తందునా
ఎవర్ని తందునా ఎల్ల తందునా

## మోచేతి పద్మం

మోచేతి పద్మమ్ము పట్టేటి వేళా
మొగ్గల్లు తామర్లు పూసేటి వేళా
కాకతాయ పువ్వుల్లు పూసేటి వేళా
కడవలతో ఉదకమ్ము తెచ్చేటి వేళా
చీరాయి పువ్వుల్లు పూసేటి వేళా
బిందెలలో ఉదకమ్ము తెచ్చేటి వేళా
సందింట దీపమ్ము పెట్టేటి వేళా
చాకిటింట మడతల తెచ్చేటి వేళా
అంబోతు రంకెల్లు వేసేటి వేళా
ఆవు గేదల్లు వచ్చేటి వేళా
అంబోతు రంకెల్లు వేసేటి వేళా
కోడళ్ళు పసుపు కొట్టేటి వేళా
గుండిగలతో వుదకము తెచ్చేటి వేళా
అన్నల్లు అందనా లెక్కేటి వేళా
తమ్ముళ్ళు తాంబూలం వేసే వేళా
బావల్లు పల్లకి చెక్కేటి వేళా
మఱుదల్లు మరి జూదమాసేటి వేళా
ముద్దు మొహం అద్దాన్ని బోలు
తన మొహం తామర పద్మాన్ని బోలు
పద్మం పెట్టిన చానకు పదివేలు
యేళ్ళు అయిదో తనం
(ఇది కొత్తగా పెండ్లయిన ఆడపిల్లలు పాడే పాట)

## ఇంగ్లీషు మాసాలు

జనవరి – జయం జయం
ఫిబ్రవరి – పెండ్లికి పిలుపు
మార్చి – మామిడి పూత
ఏప్రిల్ – ఎండలు మెండు
మే – మేడల వాడ
జూన్ – చుక్కల రాత్రి
జులై – జూలో సింహం
ఆగష్టు – ఆవుల మంద
సెప్టెంబర్ – చెట్టపట్టాల్
అక్టోబర్ – అందర మొకటే
నవంబర్ – నీకా? నాకా?
డిశంబర్ – ఢీఢిక్క

## వారాలు

ఆదివారం నాడు అరటి మొలచినది
సోమవారం నాడు సుడివేసి పెరిగినది
మంగళవారం నాడు మారాకు తొడిగినది
బుధవారం నాడు పొట్టి గెల వేసినది
గురువారం నాడు గుబురులో దాగినది
శుక్రవారం నాడు దాగినది పండినది
శనివారం నాడు చకచకా గెలకోసి
అందరికీ పంచితిమి అరటి అత్తములు
అబ్బాయి అమ్మాయి అరటి పండిదిగో

## అంకెలు

ఒకటీ, రెండూ తమ్ముడి గుండు
మూడు, నాలుగు తాతయ్య దగ్గు
ఐదు, ఆరు ఏట్లో నీరు
ఏడు, ఎనిమిది ఎగిరే గువ్వ
తొమ్మిది, పది పద పద మన్నది.

## 2

ఒకటి, రెండు – మంచిగ ఉండు
మూడు, నాలుగు – మాతో ఉండు
ఐదు, ఆరు – అటుపోకుండు
ఏడు, ఏనిమిది – ఏడవకుండు
తొమ్మిది, పది – తొందరవద్దు

3

ఒక్కటి ఒప్పందం – రెండూ తలిదండ్రీ
మూడు తిరిమూర్తి – నాలుగు వేదాలు
ఐదు ఆయుధం – ఆరు కర్మాలు
ఏడూ వారాలు – ఎన్మిది దిగ్గజము
తొమ్మిది దోరాలు – పదింటి కవతారాం

4

వక్కమ్ చెక్క
రెంటికి లెక్క
మువ్వల ముద్దు
నవ్వల నాగి
అయిదరం బొడ్డ
ఆరప గడ్డ
ఏడు సోలింగి
యెనమా కనమా
తొంబై బుగ్గ
పదేసి పావ

5

వొకటీ వొక్క
రెండు రోకలిబండ
మూడు ముత్యాల చెండు
నాల్గు నర్సిమ్ములు
అయిదు అనుమంతరాయడు
ఆ రరుసుకుంట[1]
యే దేడ్సుకుంట
యెనిమి దేనుంగొడ్డు[2]
తొమ్మిది తోల్ తిత్తి
పది పందికొక్కు
పదకొండు పార్వతీదేవి
పండెండు పరమేసురుడు

1 అరుసుకుంటూ, 2 ఎనుము గొడ్డు

**ఐదు వేళ్లు**

చిటికిన వ్రేలు చెల్లాయి
ఉంగరం వ్రేలు బంగారం
నడిమిన వ్రేలు నాయన్న
చూపుడు వ్రేలు నాకేసి
బొట్టన వ్రేలు బొట్టెట్టి
ఐదు వ్రేళ్లు అరచేయి
ఐదు ఐదు పది చేసి
దణ్ణం పెడదాం దేవునికి

2

చుట్టాల సులభి – బొటన వ్రేలు
కొండేల కొరివి – చూపుడు వ్రేలు
పుట్టు సన్యాసి – మధ్య వ్రేలు
ఉంగరాల భోగి – ఉంగరపు వ్రేలు
పెళ్ళికి పెద్ద – చిటికెన వ్రేలు

**అమ్మా! బొమ్మా!**

అమ్మా అమ్మా – ఆటబొమ్మ
కావాలమ్మా
ఆటబొమ్మకు – నేను ముస్తాబు
చేస్తాను
పాలబువ్వ కలిపి – పాపకు పెడతాను
నీవు నాకు అమ్మవి – బొమ్మకు నేను
అమ్మని.

## బుజ్జిమేక



బుజ్జిమేక బుజ్జిమేక ఏడకెల్తివి?
రాజుగారి తోటలోన మేత కెల్తిని
రాజుగారి తోటలోన ఏమి చూస్తివి?
రాణిగారి పూల చెట్ల సొగసు చూస్తిని

**2**

పూలచెట్లు చూసినీవు ఊరకుంటివా?
నోరూరగ పూలచెట్లు మేసివస్తిని
మేసివస్తే నిన్ను భటులు ఏమి చేసిరి?
భటులు వచ్చి నాకాళ్ళు విరగగొట్టిరి

కాలు విరిగిన నీవు ఊరకుంటివా?
మందుకోసం నేను డాక్టరింటికెల్తిని
మందు ఇచ్చిన డాక్టరుకు ఏమిస్తివి?
చిక్కనైన తెల్లపాలు అందిస్తిని

ఉన్న పాలు డాక్టరుకిస్తే యజమాని
  కేమిస్తవు?
గడ్డి తినక ఒక పూట పస్తులుండి
  తీరుస్తా
పస్తులుంటే నీకు నీరసం రాదా?
పాడు పని చేయనింక బుద్ధివచ్చెనాకు

## వసంత కాలం

వసంత కాలము రాగారాగా
కిలకిల లాడును కీరములు
వసంత కాలము రాగారాగా
కలకల పూయును కలువములు
వసంత కాలము రాగారాగా
పికములు కూకూ అని కూయున్
వసంత కాలము రాగారాగా
జనులకి కలుగు సంతసము

## బాలకిష్టమ్మ

కిష్టమ్మ కిష్టమ్మ బాలకిష్టమ్మ
పాలుపెరుగూ దొంగిలించుకుంటాడు
యమున ఒడ్డునజేరి మురళిపట్టేడూ-
చల్ల చల్లగ ఊది చేర బిలచేడూ-
ఏమి విడ్డూరమో ఏ వింతొయనుచూ
మాయ కిష్టమ్మనీ చేరుకున్నామూ -
చల్లకడవలకెల్ల చిల్లులెట్టాడూ -
పెరుగుపాలంతటిని పారబోశాడూ
చూడు యశోదమ్మ చూడవోయమ్మా-
మీ కన్న కొడుకునిక మందలించమ్మా

## అన్నదమ్ములు

సూర్యుడు చంద్రుడు అన్నదమ్ముల్లు
సూటిగుర్రాలెక్కి జూదమాడేరు
అబ్బాయి తమ్ముడు అన్నదమ్ముల్లు
లక్కపావాలెక్కి లెక్కరాసేరు

## అత్తారింటికి

ఇల్లలికి - ముగ్గెట్టి ఆకేసి పీటేసి
పప్పెట్టి బువ్వెట్టి పాలోసి పెరుగోసి

అత్తారింటికి దారెటంటే
కిత కిత కిత కిత కిత కిత
కిల కిల కిల కిల

**ఈశ్వరుడు**

లోకమ్మ వారికీ రెండు కన్నుల్లు
లోకరక్షక నీకు వేయికన్నుల్లు
ఇద్దరు పెండ్లాలు ఈశ్వరుడనీకు
పలువరుస చక్కనిది పార్వతీదేవి
కన్నులు చక్కన్న కనకదుర్గకును
ఇద్దరు పెండ్లాము లేలయ్య నీకు
ఎద్దెక్కి తిరిగేవు ఈశ్వరుడనీవు
బిచ్చమెత్తిందాక బిడ్డలకు లేదు
అడిగి తెచ్చిందాక ఆకలేలేదు

**దోసపళ్ళు**

త్రోవలో ఒకరాజు తోటేసినాడు
తోటలోపలపండ్లు దొర్లుతున్నావి
దొర్లుతున్నవి తియ్యదోసపండ్లన్ని
ఆ పండ్లు పంపాడు ఆరగించంగ
తింటేను తియ్యదోసపండ్లే తినాలి
కంటేను కొడుకుల కాన్పే కనాలి
కంటేను కొడుకుల కాన్పే కనాలి
అందితే అన్నతో వియ్యమందాలి
అందితే అన్నతో వియ్యమందాలి
ఆడితే వదినతో జగడమాడాలి

**నేతింటే బెల్లం**

చిట్ల పొట్లకాయ
సీమ నెల్లికాయ
గోడ పుచ్చకాయ
గొబ్బి నెల్లికాయ
అత్తకు పెడితే అల్లం
నేతింటే బెల్లం
నీ బిడ్డపేరేమి?
కొత్తకుండల్లోని గోధుమల్లారా!
పాలపిడతల్లోని పసిబిడ్డలారా!
అమ్మ అమ్మ నీ బిడ్డపేరేమంటే
నీళ్ళల్లో నిమ్మపండు
పాలలో పనసపండు
నేతిలో నేరేడుపండు

**హూత్**

ఉడతా ఉడతా హూత్
ఎక్కడి కెళ్ళావ్ హూత్
కానూరెళ్ళా నూత్
ఏమి తెచ్చావ్ హూత్
కందులు తెచ్చా హూత్
ఎక్కడి కెళ్ళావ్ హూత్
ఏలూరెల్లా హూత్
ఏమి తెచ్చావ్ హూత్
బెల్లము తెచ్చా హూత్
ఎవరికిచ్చావ్ హూత్
అబ్బాయికెట్టాను హూత్

**గుమ్మాడి**

గుమ్మాడమ్మ గుమ్మాడి
ఏవూరెళ్ళింది గుమ్మాడి
ఏమి తెచ్చింది గుమ్మాడి?
ముంగండెళ్ళింది గుమ్మాడి
ములక్కాయ తెచ్చింది గుమ్మాడి

పుసులూరెళ్ళింది గుమ్మాడి
పూలుపూసింది గుమ్మాడి
ఏలూరెళ్ళింది గుమ్మాడి
వెలక్కాయ తెచ్చింది గుమ్మాడి
కాసలూ రెళ్ళింది గుమ్మాడి
కాయలు కాసింది గుమ్మాడి
పండ్లు తెచ్చింది గుమ్మాడి
పాపాయికిచ్చింది గుమ్మాడి

**బువ్వ**

చేతులు కడిగి అరటాకేసి
పప్పు పెట్టి బువ్వ పెట్టి
కూరవేసి నెయ్యేసి
చారోసి మజ్జిగోసి
అత్తారింటికి దారేదోయ్?
అంబలికొండకి చల్లేదోయ్...?

**గోరింక**

ఓ తాయిలారి నెత్తిమీద గోరింక
చెప్పకు చెప్పకు చిట్టిపాప
చెబితే నీముకు కోయిస్తా
పంది మీద నుంచి పాకిస్తా
దూలం మీద నుంచి దూకిస్తా

**ఒకటే తుమ్ము**

చందమామ చీరగట్టి
సన్నబియ్యం ఒళ్ళోపోసి
అమ్మా నేను చిన్నదాన్ని
అల్లుడు వస్తే అంపబోకు
మామవస్తే మళ్ళీ రమ్మను
చద్దీకట్టా గుడ్డ లేదు
సాగనంపా పొద్దులేదు
ఇరుగు పొరుగు అక్కల్లారా
ఒకటే తుమ్ము ఆంచి!

**సిపాయి**

ఒప్పుల కుప్ప ఒయ్యారి భామ
నీలకుచ్చు వాలుమొగ్గ
విస్తరంట ఈన పుల్ల
సన్న బియ్యం చాయ పప్పు
గూట్లో రూపాయి నీ మొగుడు సిపాయి

**మారాజు**

చిక్కుడాకు మీద చిలుక వాలింది
చిలకెక్కి ఓరాజు చిక్కి ఉన్నాడు
అరిటాకు మీద హంసవాలింది
హంసెక్కి ఓరాజు అమిరి ఉన్నాడు
కొబ్బరాకు మీద గోరవాలింది
గోరెక్కి ఓ రాజు కోరి ఉన్నాడు
మామిడాకు మీద మంచు వాలింది
మంచెక్కి ఓరాజు పొంచివున్నాడు

**జడుపు**

నూకలు పెడతాను మేకలు గాస్తావా? కాస్తా!
పెద్దపులి వస్తే జడవవు గదా? జడవను!
చిఱతపులి వస్తే జడవవు గదా? జడవను!
ఎలుగుబంటి వస్తే జడవవు గదా? జడవను!
సివంగి వస్తే జడవవు గదా? జడవను!
తోడేలు వస్తే జడవవు గదా? జడవను!
నేవస్తే జడవవు గదా?
(ఇది చెప్పి కళ్ళలో ఊదవలెను; బిడ్డ కన్నులు మూసుకొనును)
జడిసినావులే అమ్మా జడిసినావు!!

## నా పేరు జమీందారు

కాకీ కాకీ కలుమల కాకీ
కాకీ నీకు కడియాలిస్తే
కడియాలెత్తి అమ్మకు యిస్తే
అమ్మనాకు అటుకులు పెడితే
అటుకులు యెత్తి పంతులకిస్తే
పంతులు నాకు పాఠం చెపితే
పాఠం మామకు చదివినిపిస్తే
మామ నాకు పిల్లనిస్తే
పిల్లపేరు మల్లిమొగ్గ
నా పేరు జమీందారు

## బొమ్మరిల్లు

చిట్టి చిట్టి మిరియాలు
చెట్టుక్రింద బోసి
పుట్టామన్ను తెచ్చి
బొమ్మరిల్లు గట్టి
బొమ్మరింట్లో పిల్ల పుడితే
బొమ్మతలకు నూనెలేదు
బొమ్మబిడ్డకి నెయ్యిలేదు
అల్లావారింటికి మజ్జిగకు వెళితే
అళ్ళావారి కుక్క భౌ మంది
కాళ్ళాగజ్జలు గళ్ళుమన్నాయి
చంకాపిల్ల కారుమంది

## అల్లీబిల్లీ పాట

కొండాపల్లీ కొయ్యా బొమ్మా
నీకో బొమ్మా నాకో బొమ్మా
నక్కాపల్లీ లక్కా పిడతలు
నీకో పిడత నాకో పిడత
నిర్మలపట్నం బొమ్మల పలకలు
నీకో పలకా నాకో పలకా.
బంగినపల్లీ మామిడి పండ్లూ
నీకో పండూ నాకో పండూ
ఇస్తానుండూ తెచ్చేదాకా
చూస్తూవుంటా ఇచ్చేదాకా

## చెన్నపట్నం - చెరుకుముక్క

చెన్నపట్నం, చెరుకుముక్క
నీకోముక్క, నాకోముక్క
భీమునిపట్నం, బిందెలజోడు
నీకోబిందె, నాకోబిందె;
కాళీపట్నం కాసులజోడు
నీకోకాసు, నాకోకాసు

## ఉష్ !

నూకలు పెట్టెద ఏకులు వడకు
రూకల నిచ్చెద మేకలు కాయి!
అటుకులు పెట్టెద ఆవులు మేపు
బెబ్బులి వచ్చిన బెదరవుకాదా!
చిరుతలు వచ్చిన ఏడ్వవు కాదా!
ఎలుగు వచ్చిన ఏడ్వవు కాదా!
ఎంతటి ధైర్యము ఇటు చూడు
మరి 'ఉష్' అంటే ఉలిక్కిపడ్డావే!

## బొట్ల బొట్లా సీరా గట్టీ

బొట్ల బొట్లా సీరా గట్టీ
బోనగిరికీ నేనే వోతే
బోనగిరీ బోయీ నా కొడుకూ – ఓ
నందగిరి రంగయ్యా మాఁవా
బొట్టు దించీ మెరుగూ పెట్టేనే!

కడవ మీదా కడవా బెట్టి
కాకినాడకు నేనే పోతే
కాకినాడా కాపు కొడుకయ్యో – ఓ
నందగిరి రంగయ్యా మామా
కడవ దించీ కన్నూ గీటేనే!

**బావి**



సేదే బాయి
సెంగన్న బాయి
మా తాత తొగిచ్చిన
మంచినీళ్ళ బాయి
మా నాయన కట్టిచ్చిన
నందన్న బాయి
తాగేకి నీళ్ళు లేవు
తందన్న బాయి.

**గోళీకాయలాట**

ఒక్కింలాం కొక్కి – రెండాం రొట్టె
మూడుం మువ్వ – నాలుగు నంది
ఐదర బొండాం – అరక్క ధారా!
ఏడిసే బొద్దు – ఎడమాకన్ను
తొమ్మా బుడగా – తొట్టికి లగ్గం
సోప్ నకాముకాల్ – ఆదూల్ బెదూల్
పేరే బనాన్ చట్ఫిట్ కాసుకో

**గచ్చకాయలాట**

కాయపెట్టుదాని కుచ్చు బంగారు కుచ్చు
కాయనాతో ఆడినది సంగాతపడుచు
కాయమూడవదమ్మా ముక్కాలపేట
కాయనాలగవదమ్మా నల్లాని పూస
కాయ అయిదవదమ్మా అమ్మన్నకాయ
కాయ యేడవదమ్మా నాకాయ
యెత్తిపట్టి కట్టు

**బిళ్ళం గోడు**

గోడీ బిళ్లి! సూటి బిళ్లి!
కాను బిళ్లి! కంచా బిళ్లి!
మాను బిళ్లి! మక్కె బిళ్లి!
సాను బిళ్లి! చక్కని బిళ్లి!
కోను బెట్టి! సూను పెట్టి
సాచి కొట్టి! గోచీ పెట్టి!
అంగట్లో! ఆమట్లో!
కర్రతో కొల్చి! బుర్రతో గుణించి!
వద్దంటే : కద్దంటే :
సాటి తగవులతో : గోటు తీర్పులతో
కంటి మంది : సొంటి పిక్క చాలలేని
టెంకాయ:
ఓనమాలు – కాక్కాలు – ఓడిన దొంగ!
పాటి మీద కొంగ
కూతెట్టి పోయి : లాలా! అర్థా
లాక్కురా! మిడక్కురా! గూటీబిళ్ల :
ఘాబొడ్డు :

## బొమ్మల పెళ్ళి



చింతమాని తొట్టిలోన
చిలుకలున్నవీ చిలుకలున్నవీ
చిలుకలకీ చిలుకలకీ
చిన్న కృష్ణుడు కావలున్నడూ
ఆరెండి అడవిలోన
ఆవులున్నవీ ఆవులున్నవీ
ఆవులకీ ఆవులకీ
బాలకృష్ణుడు కావలున్నడూ
మిట్టాల కోనలోన
మేకలున్నవీ మేకలున్నవీ
మేకలకీ మేకలకీ
మేనమామ కావలున్నడూ
దున్నిండె చేనిలోన
దూడ లున్నవీ దూడ లున్నవీ
దూడలకీ దూడలకీ
దుప్పికొమ్ము కావలున్నదీ
పాసిండె చేనిలోన
పాములున్నవీ పాములున్నవీ
పాములకీ పాములకీ
పరమేసుడు కావలున్నడూ.

**2**

తాటాకు బొమ్మకు కాటుకబొట్టు వెట్టి
చీర సింగారించి పోతు చేశారు
గాజుపూసల పేరు మెళ్ళో వేసారు
గౌరీ కళ్యాణాల రేఖ దిద్దారు
పానకం బిందెలు సిద్ధపరచారు
పాప పేరంటాళ్ళు కాచుకున్నారు
లక్కపిడతలో అన్నం ఉడికిపోయింది
పెళ్ళికూతురు మామ కట్నాలకోసం
చింతగింజల లెక్కపెట్టి దాచాడు
ఉత్తి వుత్తి అలజడి జరిగిపోతుంది
ఉత్తుత్తి బాజాలు మోగుతున్నాయి
కబురుమీదా కబురు వెళ్ళిందిగాని
పెళ్ళికొడుకులవారు తిర్గి రాలేదు.

## ఆట పాట



చిట్టి బొమ్మలపెండ్లి చేయవలెనన్న
శ్రీ రెండు వాకిళ్ల శ్రీతోరణాలు
గాజు స్తంభాలనే బూజంబుబుడ్లు
అరటి స్తంభాలనే అమర పెళ్లరుగు
చిన్నన్న పెట్టాడు పెద్దల సొమ్ము
పెద్దన్న పెట్టాడు పెద్దల సొమ్ము
నాయన్న పెట్టాడు నానుతోపుస్త
నాయక్క పెట్టింది పసుపాడు పళ్లెంబు
పసుపాడు పళ్లెములో పచ్చనక్షితలు
పచ్చనక్షితలోనే పుట్టినిల్లు
ముత్యాలు కూర్చిన ముక్కాలిపీట
రుద్రుడు మీనాన్న కూర్చుండగాను
పచ్చుల్లు చెక్కన్నా పట్టెపంచెమ్మ
పార్వతి మీ తల్లి పాలివ్వతగును.

## వాన దేవునికి ప్రార్థన

వానదేవుడా! వానదేవుడా!
వానల్లు కురిపించు! వానదేవుడా! ॥వా॥

కప్ప తల్లీ నీళ్లాడె
కడవల నిండా నీళ్లొచ్చె
మొర్రో వానదేవుడా! ॥వా॥

ఈగ తల్లీ నీళ్లాడె
వీధుల నిండా నీళ్లొచ్చె
మొర్రో వాన దేవుడా! ॥వా॥

దోమ తల్లీ నీళ్లాడె
దొరువుల నిండా నీళ్లొచ్చె
మొర్రో వాన దేవుడా! ॥వా॥

చేప తల్లీ నీళ్లాడె
చెరువుల నిండా నీళ్లొచ్చె
మొర్రో వానదేవుడా! ॥వా॥

తూరుపున మొయిలపట్టి వాన దేవుడా!
తుంపరలు రావాలి వానదేవుడా! ॥వా॥

## బూచాడు!

బూచాడమ్మా బూచాడు –
బుల్లి పెట్టెలో ఉన్నాడు.
కళ్ళకెపుడు కనపడడూ –
కబురులెన్నో చెపుతాడు ॥బూచా॥

గురుగురుమంటూ గోలెడతాడు
హల్లో అని మొదలెడతాడు
ఎక్కడవున్నా ఎవ్వరినైనా –
పలుకరించి కలుపుతాడు ॥బూచా॥

తెలుగు తమిళ హిందీ కన్నడ
భాషా భేదాలెరుగనివాడూ
కులముమతము జాతేదైన–గుండెలు
గొంతులు ఒకటంటాడూ ॥బూచా॥

ఢిల్లీ, మద్రాస్, హైద్రాబాద్, రష్యా,
అమెరికా, లండన్, జపాన్ ఎక్కడికైనా
వెళుతుంటాడూ, ఎల్లలు మనకు
లేవంటాడూ ఒకే తీగపై నడిపిస్తాడూ,
ఒకే ప్రపంచం అనిపిస్తాడు ॥బూచా॥

– బడి పంతులు సినిమా

# క్రైస్తవ బాలగేయాలు



తెలుగు దేశం నలుమూలల గల క్రైస్తవ బాల, బాలికలు పండుగ సందర్భాలలో, వేడుకలలో హాయిగా పాడుకొని ఆనందించే గేయాలు కొన్ని ఈ దిగువ అందజేస్తున్నాం.

**1**

చిన్ని తమ్ముడ, చెల్లీ - యేసు కడకు రా
నిన్ను ఆయన ప్రేమించెను - జాగు చేయక రా

నీవు చేసిన తప్పంతా - నిజముగ - ఒప్పుకొంటే
నీవు చేసిన తప్పంతా - యేసు నొద్ద - చెప్పుకొంటే

నిన్ను ఆయన మన్నించి - చేర్చుకొంటాడు
నన్ను ఆయన మన్నించి - చేర్చుకొంటాడు
మనలనాయన మన్నించి - చేర్చుకొంటాడు

**2**

ఢుం ఢుం ఢుం ఢుం ఢుం - మేళం కొట్టి
ధం ధం ధం ధం ధం ధం - తాళం తట్టి
హల్లెలూయ పాట పాడి - ఆనందంగా ఆడుదును
దేవుని గొర్రెపిల్ల రక్తములో -
పాపమంత పూర్తిగ కడిగివేసెను
దిగులే లేదుగా - కన్నీరే లేదుగా
ప్రభు యేసు ఇచ్చెను - క్రొత్త
జీవితం-సాక్షిగ జీవింతును, ఫలించుచు

**3**

చిన్న చిన్న పాప - నీవు యేసు గూర్చి చెప్పు
నా ముద్దు పాప - యేసు ప్రేమ గూర్చి చెప్పు

నడకలోను చెప్పు - ఆట్లాడున్నపుడు చెప్పు
నాన్నకు నీవు చెప్పు - ప్రియ అమ్మకు నీవు చెప్పు

చిన్న చిన్న పాప - నీవు యేసు గూర్చి చెప్పు
నా ముద్దు పాప - యేసు ప్రేమ గూర్చి చెప్పు

అన్నకు నీవు చెప్పు - ప్రియ తమ్మునికి చెప్పు
అంకుల్‌కు చెప్పు - ఆంటీకి కూడ చెప్పు

చిన్న చిన్న పాప - నీవు యేసు గూర్చి చెప్పు

నా ముద్దు పాప - యేసు ప్రేమ గూర్చి చెప్పు
చెప్పు - నీవు చెప్పు - చెప్పు - నీవు చెప్పు

**4**

బైబిలె గ్రంథము - అది జీవి గ్రంథము
దేవుడిచ్చిణ శ్రేష్ఠ గ్రంథము
ఓదార్చు గ్రంథము - మనల మార్చు గ్రంథము
దేవుని కడకు చేర్చు గ్రంథము
మార్గమంతట - మనతో నుండును
మనకు దీపమై నడిపించును

జీవ గ్రంథము - పరిశుద్ధ గ్రంథము
దేవుడిచ్చిన శ్రేష్ఠ గ్రంథము
ఓదార్చు గ్రంథము - మనల మార్చు గ్రంథము
దేవుని కడకు చేర్చు గ్రంథమూ...

**5**

విజయ శిఖరము - ఎక్కవలెనా?
ఉన్నత స్థితికి - చేరవలెనా?
మార్గము ఇదిగో - తెలుసుకో
జయవీరుడవై - నీవుండుటకు
రయమున రమ్మని నాయకుడేనసు
ప్రీతితో పిలుచుచుండె నిన్ను
అనుదినం - యేసుని పాదము చేరి
మానక నీవు ప్రార్థించిన
సాక్షిగ నిన్ను మార్చును
వెలుగు దీపముగ చేయును
వెలుగు దీపముగ చేయును

**6**

చిట్టి తమ్ముడ చెల్లి - భయపడకు
రాజు యేసు నీకు - తోడుండును

దుఃఖము - కష్టము - నిన్ను బాధపెట్టిన
యేసును నమ్మి - వేడుకొన్న - చాలు
అవి అన్ని తొలగి పోవును - భద్రముగ నుందువు

**7**

కుకుకుకుకూ అంటూ కమ్మగ పాడే కోయిలా
కు క్కూ కూ - పాటలు నీకు నేర్పినదెవరో చెప్పు

ఇంపైన ఈ పాటలు నాకు రాజు యేసు నేర్పెన్
ఆయన కీర్తిని పాడి పాడి సాక్షిగ ఎగిరెద హాయిగ

కుకుకుకుకూ అంటూ కమ్మగ పాడే కోయిలా
కు క్కూ కూ - పాటలు నీకు నేర్పినదెవరో చెప్పు

రెక్కలు చాపి, పింఛము విప్పి నాట్యమాడే నెమలీ
అందమైన నీపై వస్త్రాన్ని ఇచ్చిన దెవరో చెప్పు

సుందరమైన ఈ వస్త్రం - యేసు నా కిచ్చెను
ఆయన కీర్తిని పొగడి పొగడి - సాక్షిగ -
నాట్యమాడెదను

కుకుకుకుకూ అంటూ కమ్మగ పాడే కోయిలా
కు క్కూ కూ - పాటలు నీకు నేర్పినదెవరో చెప్పు

**8**

సాక్షిగా జీవించెదము - లోకములో
సాక్ష్యం చెప్పి ఆనందింతుము - అనుదిన జీవితంలో

సువార్త నౌకను పయనింపు జేతుము
ఎత్తుదుము జయ జెండ గగన వీధిలో
సిలువ గీతాలతో నింపుదు భూమిని
ప్రసరింపజేతుము యేసు ప్రేమ తేజము

చాటెదము ప్రభు ప్రేమను ప్రజలకు
మారనిదా ప్రియుని ప్రేమ నిజమే
బ్రతికెదమా ప్రియుడేసుని కొరకే
ఇదే మా తీర్మానం - మా విశ్వాసము

కడవరి దినములివి - బహు విపరీతము
ప్రభు రాకడకివి సూచనలు
ఈ అంత్య దినములలో బాలల నోళ్ళు తెరచి
స్తుతినొందు మా దేవా, హల్లెలూయా - జై క్రీస్తు

9

రాజులకు రాజు నీవే - మా దేవా
రాజులకు రాజువు - తేజో మయుడవు
పూజింతుమయ్య నిన్నె -పుణ్యాత్ముడవని

కనకసాంబ్రణి భోళము - కానుకలియిగో
ఘనముగా నిచ్చుచుంటిమి - కానుకలియిగో
ఘనముగా నిచ్చేడి - వినయ కానుకలను
మనస్సారా గై గొని - మమ్ము దారింపుము

తారమార్గము చూపగా - మేమందరము
తన్మయమైపోతిమి
ధరణిలో నీకంటే - ధన్యుండింకెవ్వరయ్యా
రయముగా మా పై నీ దయ చూపి బ్రోవుమా

ముక్తి దాతువు నీవని - ముదముతో మేము
భక్తి కల్గి చేరితిమ్
శక్తి కల్గియున్న - శాంతి మూర్తివి నీవే
శరణు జొచ్చితిమయ్యా - మరుమభోకింకనయ్యా

10

అల్లదేవేకువైన తారదే - అల్లదే క్రీస్తు జన్మ తారదే
అల్లదే తూర్పు దిక్కు తారదే

ఆకాశమందు వెలుగు చూడుడి
ఆ వింత పిలుపు నాలకించుడి
దావీదు పురమున రక్షకుండు పుట్టెను
అయనే ప్రభువైన క్రీస్తను

ఆ మరియ ప్రసవ దినము నిండగా
ఆ క్రీస్తు బాలుడేసు కలుగగా
సత్రమందు స్థలము లేక పుత్రుడైన యేసుని
పశుల తొట్టి పొత్తి గుడ్డ నుంచగా

ఆ రాత్రి వెళ్ల మంద కాయుచు
ఆ రాత్రి గొల్ల లెల్ల గాంచుచు
రాత్రి వెలుగు చూచిరి శాస్త్రమంత తరచిరి
యూదుల రాజు జన్న చాటిరి

భూలోక దిగంతముల క్రైస్తవా
ఈ మంచి వార్త నెల్ల చాటవా
యేసుక్రీస్తు పుట్టెను - బెత్లెహేమునందున
హల్లెలూయ - హల్లెలూయ - హల్లెలూయ

11

ప్రభు జన్మ దిన మీ రోజు
ప్రపంచ రక్షకుడీ రాజు
ప్రతి వ్యక్తికిని శ్రీ యేసు
ప్రశస్త జీవిత మొనగూర్చు

నరరూపంబున నరుదెంచాడు
పరలోకంబును మరి విడిచాడు
మరియగర్భమున నుదయించాడు
మనకు దేవుడై వెలిచాడు

బెత్లె హేము పట్నమందున
కసువున్న పశుశాల యందున
పొత్తి గుడ్డలను బొందికి చుట్ట
రాతి తొట్టిలో పరుండీ

పరిశుద్ధుండీ మరియ సుతుడు
నీతి సూర్యుడై ఏతెంచాడు
చేరి యూదవులు మ్రొక్కేరు
జ్ఞానులు కానుక లిచ్చేరు

ఆ లాగునన్ మనమందరము
ఆ యేసునే స్తుతి యింతం
జాలి పరుండా ప్రభువుని వేడి
విలువైనట్టి కానుకలిద్దాం

12

క్రిస్మస్ క్రిస్మస్ హల్లెలూయా
యేసు ప్రభువు పుట్టెను
పాప చీకటి తొలగి పోయి
వెలుగు కానవచ్చెను

గొల్లలెమి జ్ఞానులేమి
వెలుగును చూడ వెళ్లిరి
చూచి వెళ్లి సంతోషించి
శుభవార్త మానం చాటిరి.

ఓహో మిత్రులారా మీరు
వెలుగు చూడ వెళ్లిరా
చూచి వెళ్లి సంతోషించి
శుభవార్త మానం చాటిరా

చిన్న వాడు లెదిగి పోయి
లోక మంత చాటేను
చీకటిలో కూర్చున్న వారిని
వెలుగు లోనికి తెచ్చేను

## 13

చింత లేదిక యేసు పుట్టెను
వింత గను బెత్లె హేమందున
చెంత జేరనురండి సర్వ జనాంగమా
సంతసమొందుమా

దూత తెల్పెను గొల్లలకు
శుభవార్త నాదిసంబు
వింతగా ఖ్యాతి మీరగ వారు
యేసును గాంచిరి స్తుతులొనరించిరి

చుక్క గనుగొని జ్ఞానులెంతో
మక్కువ తోనా ప్రభుని గనుగొన చక్కగా
బెత్లెహేము పురమున జొచ్చిరి
కానుక లిచ్చిరి

కన్య గర్భమునందు బుట్టెను
కరుణ గల రక్షకుడు క్రీస్తుడు
ధన్యులగుటకు రండి
వేగమే దీనులై సర్వ మాన్యులై

పాప మెల్లను పరిహరింపను
పరమ రక్షకుడవతరించెను
దాపుజేరిన వారికిడుగడు
భాగ్యము మోక్ష భాగ్యము

## 14

నీ కొక తెల్లంగి నా కొక తెల్లంగి
దైవ పిల్లల కొక తెల్లంగి

మోక్షంలో నేను మోక్షం చేరగా
తెల్లంగి ధరించగా చుట్టూ చుట్టు తిరిగి చచ్చెదన్

నీ కొక వాయిద్యం నాకొక వాయిద్యం
దైవ పిల్లల కొక వాయిద్యం

మోక్షంలో మోక్షంలో నేను మోక్షం చేరగా
వాయిద్యం ధరించగా చుట్టు చుట్టు తిరిగి వచ్చెదన్

నీ కొక కిరిటం నాకొక కిరీటం
దైవ పిల్లల కొక కిరీటం

మోక్షంలో మోక్షంలో నేను మోక్షం చేరగా
కిరీటం ధరించగా చుట్టు చుట్టు తిరిగి వచ్చెదన్

## 15

యేసుంభజే యేసుంభజే
మన యేసుడు వస్తున్నాడు యేసుంభజే
ఊరుఊరు తిరిగినాడు మన ఊరికి
వస్తున్నాడు యేసుంభజే

వీధి వీధి తిరిగినాడు మన వీధికి
వస్తున్నాడు యేసుంభజే
ఇల్లు ఇల్లు తిరిగి నాడు మన ఇంటికి
వస్తున్నాడు యేసుంభజే

చిన్న పిల్లలను నా యొద్దకు
రానియ్యుడి అంటున్నాడు
వారిని ఆటంక పర్చవద్దు అంటున్నాడు
ఆ లాంటి వారిదే పరలోక రాజ్యము

# తొక్కుపలుకులు



తెలుగు బాల సాహిత్యంలో ఎదిగిన ఒక విచిత్రమైన ప్రక్రియ తొక్కు పలుకులు. మిగతా భారతీయ భాషలలో ఈ విధమైన ప్రక్రియ ఉన్నట్లు బాలసాహిత్య చరిత్రలో కానరాదు. ఈ ప్రక్రియను తొలిసారిగా గృహలక్ష్మి మాసపత్రిక ఆదరించి ప్రోత్సహించింది. ఒక పదం చివర నొక్కి పునరుక్తితో మరో పదం సృష్టించడం ద్వారా తొక్కు పలుకులు ఏర్పడతాయి. కొత్త పదాలు త్వరగా నేర్చుకోడానికి, పలకడానికి తద్వారా భాషా జ్ఞానం, విజ్ఞానం పెంచుకోడానికి ఇవి ఎంతగానో వినియోగిస్తాయి. ఉత్సాహాన్ని కలిగిస్తాయి.

రా రా –
ఏమిరా?
బండి ఱ –
ఏమి బండి?
పెట్టె బండి –
ఏమి పెట్టె?
చెక్క పెట్టె –
ఏమి చెక్క?
జాజి చెక్క –
ఏమి జాజి?
సన్నజాజి

ఇలా కొండవీటి చాంతాడులా సాగిపోతూ ఉంటాయి.

ఆపదలచుకున్నప్పుడు ఆపవలసిందేగాని అంతం లేదు. ఇందలి పదాలు దొంతర ప్రత్యేకంగా గమనించదగింది. తెలుగు భాషకు ప్రత్యేకంగా అబ్బిన తెలుగు సొమ్ములు ఈ తొక్కు పలుకులు. కె ఎన్ కేసరిగారి 'గృహలక్ష్మి' మాసపత్రికలోను, న్యాయపతి రాఘవరావుగారి 'బాల' పత్రికలోనూ తొక్కుపలుకులు అపారంగా వచ్చాయి.

## పండమ్మ పండు

పండమ్మ పండు!
ఏమి పండు? మామిడి పండు
ఏమి మామిడి? ముంత మామిడి
ఏమి ముంత? ఆముదం ముంత
ఏమి ఆముదం? వంట ఆముదం
ఏమి వంట? పిండి వంట
ఏమి పిండి? సున్ని పిండి
ఏమి సున్ని? మినప సున్ని
ఏమి మినప? పెద్ద మినప
ఏమి పెద్ద? బడి పెద్ద
ఏమి బడి? వీధి బడి
ఏమి వీధి? సంత వీధి
ఏమి సంత? గొడ్ల సంత
ఏమి గొడ్లు? బఱ్ఱెగొడ్లు

## వనలక్ష్మి



ఏమేమిటా తోట? అరటీల తోట
ఎట్లాంటిదా తోట? యిట్లాంటి తోట
వేసేమురా తోట వేసంగి తోట
మంచిదిరా తోట మామంచి తోట
లేతాదిరా తోట పువ్వుల్ల తోట
పీపీలురా తోట పిందిల్లు తోట
కాయాలిరా తోట కదళీల తోట
పండాలిరా తోట భాగ్యంపు తోట
చూడాలిరా తోట చోద్యంపు తోట

## ఏరుకో ఏరుకో

కాశీపట్నం – కాసులపేరు
నీకో పేరు – నాకో పేరు
చెన్నపట్నం – చెరుకుముక్క
నీకో ముక్క – నాకో ముక్క
భీమునిపట్నం – బిందెల జోడు
నీకో జోడు – నాకో జోడు
బొంబాయి పట్నం – బొమ్మల జోడు
నీకో బొమ్మ – నాకో బొమ్మ
లక్కవరం – లక్కపిడతలు
నీకో పిడత – నాకో పిడత
చెట్టు క్రింద రత్నాలు
ఏరుకో ఏరుకో.

## ఆవు పాలు

ఎచటికి పోతివి – ఊరికి పోతిని
ఏ వూరికి – పచ్చలూరికి
ఏమి పచ్చ – ఆకుపచ్చ
ఏమి ఆకు – అరటి ఆకు
ఏమి అరటి – కర్పూర అరటి
ఏమి కర్పూరం – రస కర్పూరం
ఏమి రసం – మిరియం రసం
ఏమి మిరియం – తోక మిరియం
ఏమి తోక – కుక్క తోక
ఏమి కుక్క – తెల్ల కుక్క

ఏమి తెల్ల - పాలు తెల్ల
ఏమి పాలు - ఆవు పాలు

**పళ్ళమ్మ పళ్ళు**

ఏం పళ్ళు మామిడి పళ్ళు
ఏం మామిడి నర మామిడి
ఏం నర సేరున్నర
ఏం సేరు కర్రసేరు
ఏం కర్ర వెదురు కర్ర
ఏం వెదురు పచ్చ వెదురు
ఏం పచ్చ ఆకుపచ్చ
ఏం ఆకు చిగురుటాకు
ఏం చిగురు చింత చిగురు
ఏం చింత పాప చింత
ఏం పాప కన్నుపాప
ఏం కన్ను నెమలికన్ను
ఏం నెమలి మొగ నెమలి
ఏం మొగ గ్రామం మొగ
ఏం గ్రామం సంగ్రామం

**బారు బారు**

ఏమి బారు చీమల బారు
ఏమి చీమ గండు చీమ
ఏమి గండు పిల్లి గండు
ఏమి పిల్లి నల్ల పిల్లి
ఏమి నల్ల కారునల్ల
ఏమి కారు పట్టుకారు
ఏమి పట్టు నారపట్టు
ఏమి నార గోగునార

**చెంప పెట్టు**

ధిమిత ధిమిత ఏమి ధిమిత
పసుపు ధిమిత ఏమి పసుపు
వంట పసుపు ఏమి వంట
పిండి వంట ఏమి పిండి
తెలక పిండి ఏమి తెలక
గొర్రె తెలక ఏమి గొర్రె
పాల గొర్రె ఏమి పాలు
జెముడు పాలు ఏమి జెముడు
పాత జెముడు ఏమి పాత
గోచి పాత ఏమి గోచి
పట్టు గోచి ఏమి పట్టు
చెంప పట్టు

**కంబళి బొంత**

ఏనుగమ్మా ఏనుగు
ఏ ఏనుగు? మదపుటేనుగు
ఏ మదం? ఆముదం
ఏ ఆముదం? చిట్టాముదం
ఏం చిట్టి? నెయ్యిచిట్టి
ఏం నెయ్యి? పేరి నెయ్యి
ఏం పేరు? గుళ్ళపేరు
ఏం గుళ్ళు? సరిగుళ్ళు
ఏం సరి? దాసరి
ఏం దాసు? కాళిదాసు
ఏం కాళి? భద్రకాళి
ఏం భద్ర? తుంగభద్ర
ఏం తుంగ? పాలతుంగ
ఏం పాల? బర్రెపాల

ఏం బర్రె? చుక్కబర్రె
ఏం చుక్క? చాదుచుక్క
ఏం చాదు? బియ్యపుచాదు
ఏం బియ్యం? వూచ బియ్యం
ఏం వూచ? అరటి వూచ
ఏం అరటి? బొంత అరటి
ఏం బొంత? కంబళిబొంత
ఏం కంబళి? రత్నకంబళి
ఏం రత్నం? గోరురత్నం
ఏం గోరు? పులిగోరు
ఏం పులి? పెద్దపులి
ఏం పెద్ద? గోచిపెద్ద
ఏం గోచి, పట్టు గోచి
ఏం పట్టు? ముక్కు పట్టు

**శివకంచి**

ఏమి గోగు - పుల్లగోగు
ఏమి పుల్ల - కాకిపుల్ల
ఏమి కాకి - జెముడుకాకి
ఏమి జెముడు - బొమ్మజెముడు
ఏమి బొమ్మ - పిండిబొమ్మ
ఏమి పిండి - వరిపిండి
ఏమి వరి - మొక్కవరి
ఏమి మొక్క - జొన్న మొక్క
ఏమి జొన్న - పచ్చజొన్న
ఏమి పచ్చ - పైరుపచ్చ
ఏమి పైరు - మంచి పైరు
ఏమి మంచి - కామంచి
ఏమి కామ - గొడుగుకామ
ఏమి గొడుగు - ఆకుగొడుగు
ఏమి ఆకు - తాటిఆకు
ఏమి తాడి - పోతుతాడి
ఏమి పోతు - మేకపోతు
ఏమి మేక - కంచిమేక
ఏమి కంచి - శివకంచి

**పాయసం**

నీచేతు లేమయ్యాయోయ్-పిల్లెత్తుకు పోయింది
పిల్లినెందాక తరిమావ్ - గోలకొండ దాకా
గోలకొండేమిచ్చింది - గుడ్డిగవ్వ
గుడ్డిగవ్వేమి చేశావు - కుమ్మరాడికిచ్చాను
కుమ్మరేమిచ్చాడు - కుండిచ్చేడు
కుండేమి చేశావు - మా తాతకిచ్చాను
మీ తాతేం చేశాడు - మూతి కడుక్కుని
గిరగిర త్రిప్పి నూతిలో వేశాడు
నుయ్యేమిచ్చింది - నీళ్ళిచ్చింది
నీళ్ళేం చేశావు - చెట్లకు పోశాను
చెట్లేమిచ్చాయి -
పువ్వులు - కాయలు యిచ్చాయి
పువ్వులు - కాయలు ఏం చేశావు
పువ్వులు మా అక్క తలలో పెట్టాను
కాయలు తిన్నా
మీ అక్క తల ఏమిచ్చింది - పేనిచ్చింది
పేను నేంజేశావు - గడపమీద కుక్కాను
గడపేమిచ్చింది - పేళ్ళిచ్చింది
పేళ్ళేంచేశావు - పొయ్యిలో పెట్టాను
పొయ్యేమిచ్చింది - బూడిదిచ్చింది
బూడిదేం జేశావు - పెంట మీద పోశాను
పెంటేమిచ్చింది - గడ్డిచ్చింది

గడ్డేంజేశావు - ఆవులికి గేదెలికి వేశా
ఆవులూ గేదెలూ ఏమిచ్చాయి - పాలిచ్చాయి
పాలేంజేశావు - పరమాన్న మొండా
పరమాన్న మేంజేశావు కొంత నేను తిన్నాను

## పూవు

చేతులేమి చేశావు పిల్లెత్తుకుపోయింది
పిల్లినేమి చేశావు గోలకొండ తోలా
గోలకొండ ఏమిచ్చింది గ్రుడ్డిగవ్వ
గ్రుడ్డిగవ్వ ఏంచేశావు కుమ్మరివాడికిచ్చా
కుమ్మరివాడేమిచ్చాడు కుండయిచ్చాడు
కుండేమి చేశావు బావిలో వేశా
బావేమిచ్చింది నీళ్ళిచ్చింది
నీళ్ళేమి చేశావు కాయచెట్టుకు పూ చెట్టుకు పోశా
కాయచెట్టు పూచెట్టు ఏమిచ్చింది
కాయచెట్టు కాయ
పూచెట్టు పువ్వు యిచ్చింది
కాయేమి చేశావు
కాయ మా తాత కొట్టుకుతిన్నాడు
పూవేమి చేశావు
పూవు మా అక్క తలలో పెట్టా

## ఈరమ్మ కథ

ఇంటివెనుక ఈరమ్మా
మా కోడొచ్చిందా? వచ్చింది
ఎన్ని గ్రుడ్లు పెట్టింది? మూడు గ్రుడ్లు
గుడ్లేమి చేశావు? కుమ్మరోడికిచ్చాను
కుమ్మరోడేమిచ్చినాడు? కుండిచ్చినాడు
కుండేమి చేశావు? బావిలో వేశాను
బావి యేమిచ్చింది? నీళ్ళు యిచ్చింది
నీళ్ళేమి చేశావు? తోటకు పోశాను
తోటేమిచ్చింది? పువ్వులిచ్చింది
పువ్వులేమి చేశావు?
అప్ప కొప్పులో పెట్టాను
మీ అప్పేమిచ్చింది? పేనిచ్చింది
పేనేమి చేశావు? దూలంకేసి కుక్కేను
దూలమేమిచ్చింది? పేడిచ్చింది
పేడేమి చేశావు? పొయ్యిలో పెట్టినాను
పొయ్యేమిచ్చింది? బూడిదిచ్చింది
బూడిదేమి చేశావు? చేనికి వేశాను
చేనేమిచ్చింది? గరికిచ్చింది
గరికేమి చేశావు? ఆవుకేశాను
ఆవేమిచ్చింది? పాలిచ్చింది
పాలేమి చేశావు? పాయస మొండించాను
పాయసమేమి చేశావు?
సగము తిని సగము ఉట్టిమీద పెడితే
కుమ్మరోడి కుక్కవచ్చి తినిపోయింది

## ఇనుప గుండు

ఇల్లు! కట్టుదామా?
ఏమి యిల్లు పెంకుటిల్లు
ఏమి పెంకు వార పెంకు
ఏమి వర తామర
ఏమి తామర మెట్ట తామర
ఏమి మెట్ట కొండమెట్ట
ఏమి కొండ బొగ్గు కొండ
ఏమి బొగ్గు నేల బొగ్గు
ఏమి నేల గచ్చు నేల
ఏమి గచ్చు పాల గచ్చు

ఏమి పాలు బఱ్ఱె పాలు
ఏమి బఱ్ఱె చుక్క బఱ్ఱె
ఏమి చుక్క చారు చుక్క
ఏమి చారు బియ్యపు చారు
ఏమి బియ్యము ఊచ బియ్యము
ఏమి వూచ జొన్న వూచ
ఏమి జొన్న మొక్క జొన్న
ఏమి మొక్క మామిడి మొక్క
ఏమి మామిడి అంటుమామిడి
ఏమి అంటు మల్లె అంటు
ఏమి మల్లె గుండు మల్లె
ఏమి గుండు ఇనప గుండు

**నీ ముక్కు**

కొలువుకు పోదాం - వస్తావా
ఏం కొలువు? రాజు కొలువు,
ఏ రాజు? అడవి రాజు,
ఏ అడవి? చిట్టడవి,
ఏం చిట్టు? సొర చిట్టు,
ఏం సొర? మంచి సొర,
ఏం మంచి? కాయమంచి,
ఏం కాయ? అరటికాయ,
ఏం అరటి? ఉక్కు అరటి,
ఏం ఉక్కు? నీ ముక్కు..

**వాన వాన**

చినుకు చినుకు ఏమి చినుకు?
చినుకు చినుకు వాన చినుకు
వాన వాన ఏమి వాన?
వాన వాన గాలి వాన
గాలి గాలి ఏమి గాలి?
గాలి గాలి చెట్టు గాలి
చెట్టు చెట్టు ఏమి చెట్టు?
చెట్టు చెట్టు పూల చెట్టు

**పిట్టమ్మా పిట్ట**

పిట్టమ్మా పిట్ట ఏమి పిట్ట
చిలక పిట్ట ఏమి చిలుక
తెలుపు చిలక ఏమి తెలుపు
హంస తెలుపు ఏమి హంస
రాజ హంస ఏమి రాజు
మృగ రాజు ఏమి మృగము
వన మృగము ఏమి వనము
పూల వనము ఏమి పూలు
జాజి పూలు ఏమి జాజి
గుత్తి జాజి ఏమి గుత్తి
కవ్వం గుత్తి ఏమి కవ్వం
చల్ల కవ్వం ఏమి చల్ల
మంచు చల్ల ఏమి మంచు
పొగ మంచు ఏమి పొగ
దీపం పొగ ఏమి దీపం
గోడ దీపం ఏమి గోడ
కోట గోడ ఏమి కోట
తులసి కోట ఏమి తులసి
రామ తులసి ఏమి రామ
ఆత్మా రామ.

**చెంగల్వ**

నల్ల నల్ల ఏమి నల్ల
బొగ్గు నల్ల ఏమి బొగ్గు

కట్టె బొగ్గు ఏమి కట్టె
మామిడి కట్టె ఏమి మామిడి
అంటు మామిడి ఏమి అంటు
మల్లె అంటు ఏమి మల్లె
బొడ్డు మల్లె ఏమి బొడ్డు
కల్వ బొడ్డు ఏమి కల్వ
చెంగల్వ

**సంగ్రామం**

పళ్ళమ్మా పళ్ళు ఏం పళ్లు
మామిడి పళ్లు ఏం మామిడి
నర మామిడి ఏం నర
సేరున్నర ఏం సేరు
కర్ర సేరు ఏం కర్ర
వెదురు కర్ర ఏం వెదురు
పచ్చ వెదురు ఏం పచ్చ
ఆకు పచ్చ ఏం ఆకు
చిగురుటాకు ఏం చిగురు
చింత చిగురు ఏం చింత
పాప చింత ఏం పాప
కన్ను పాప ఏం కన్ను
నెమలి కన్ను ఏం నెమలి
మొగ నెమలి ఏం మొగ
గ్రామం మొగ ఏం గ్రామం
సంగ్రామం.

**సన్నజాజి**

కాళ్ళెందాకా పోయాయీ -
గోల్కొండదాకా పోయాయి
గోల్కొండ యేమిచ్చింది -
గడ్డి గవ్వనూ యిచ్చింది



గడ్డి గవ్వ నేం చేశావూ -
గడ్డిమోపులో దాచానూ
గడ్డిమోపూ ఏమిచ్చిందీ -
ఎద్దూ బండి యిచ్చిందీ
ఎద్దూ బండి నేం చేశావూ -
బండివానికీ యిచ్చానూ
బండివాడూ ఏమిచ్చాడూ -
పూలదండనూ యిచ్చాడూ
పూలదండ నేం చేశావూ -
పాలవెల్లికీ కట్టానూ
పాలవెల్లి ఏమిచ్చిందీ -
బాలకృష్ణనీ యిచ్చిందీ
బాలకృష్ణ నేం చేశావూ -
గొల్లభామకూ యిచ్చానూ
గొల్లభామ యేమిచ్చిందీ -
వెన్నముద్దనూ యిచ్చిందీ
వెన్న ముద్ద నేం జేశావూ -
చిన్ని అత్తకూ ఇచ్చానూ
చిన్ని అత్త యేమిచ్చిందీ -
చక్కని బావా నిచ్చిందీ
బావా పేరూ బంతిపువ్వూ -
నా పేరు సన్నజాజులు.

# పిల్లల రచనలు



వయసు పెరుగుతున్న కొలదీ పిల్లల్లో ఊహలు పెరుగుతూ ఉంటాయి. వ్యక్తిత్వం పెరుగుతూ ఉంటుంది. ఆ సమయంలో తోటి పిల్లలతో కలసి కొత్త మాటలు నేర్చుకుంటారు. పాటలు కడతారు. సరదాగా పాడుకుంటారు. ఈ పాటల్లోని పదాలకు అర్థం ఉండచ్చు, ఉండకపోవచ్చు. ఈ సందర్భంలో బాలలకు భావ సౌష్టవం కుదుర్చుకునేంతటి కల్పనాశక్తి ఉండదు. అందుకనే ఈ పాటలను అర్థం లేని పాటలని పాశ్చాత్య పండితులు అభిప్రాయ పడినట్లు "ఎన్‌సైక్లో పీడియా అమెరికానా" వలన తెలుస్తుంది. కేవలం ఈ పాటలలో అర్థం లేదని కొట్టిపారవేయలేము. ఒక అర్థం ఉంటుంది. అర్థం, భావం, ఊహ, కల్పన లేకపోతే గేయం నిలవదు.

స్థూలంగా ఈ రచనలను పిల్లల రచనలు అనొచ్చు. వేటూరి ప్రభాకరశాస్త్రిగారు దీన్ని దుడుకు కవిత్వం అన్నారు. పంతులుగారిని ఎగతాళిచేస్తూ పిల్లలు కల్పించిన గేయం–

"పంతులు పంతులు
పావుసేరు మెంతులు
కూర్లోకి చాలవు
గుప్పెడు మెంతులు"

నలుగురు పిల్లలు ఒక చోట కూర్చొని కబుర్లు చెప్పుకుంటున్నపుడు ఒకడు మెల్లగా అపానవాయువు విడుస్తాడు. ఇది గమనించిన మరొక బాలుడు ఒక పాటతో ఎగతాళి ప్రారంభిస్తాడు–

"ఉసిరికాయ–ఊరు బిందె
లవ్వో–లాటో
చెంబో–బైటో
టాంగు–టింగు
తమ్ముళ్ళు–పెద్దమ్మ
తుసుక్కు–పుసుక్కు"

మరోసారి అదే సందర్భంలో ఇలా అంటారు.

"అగ్గిపెట్టె – గిగ్గిపెట్టె
కోడి – కొమ్మ
పిల్ల – పిత్తు"

ప్రతి పదానికి వేరు వేరు అర్థం ఉన్నా లేకపోయినా భావాన్ని పిల్లలు గమనించి నవ్వుకుంటారు. కొల్లలు, కోకొల్లలుగల ఈ కోవకుచెందిన పాటలలో – గోటిబిళ్ళ ఆడునపుడు "చిర్ర" అను బద్దీయున్న చోటకి గోనెతో కొలత వేసేప్పుడు పాడే పాట –

"ఒంటి కాలు
చిచ్చి మూటాల్
మూడో ముచ్చి
నాల్గో నడ్డి
ఐదో పెద్ది
ఆరో కన్ను
ఏడో పొల్ల"

పైన వివరించిన ఏడంకెలకు సంగ్రహరూపంలో ఒంటి, చిచ్చి, ముచ్చి, నడ్డి, పెద్ది, కన్ను, పొల్ల అని ఏడు సంకేతాలు వివరిస్తూ ఉంటారు. నిజంగా ఇదే బాలభాష.

**ఉసిరికాయ**

ఉసిరికాయ ఊరుపిందె
లవ్వోలాటో చెంబోబైటో
టాంగుటీంగు తమ్ముళ్ళ పెద్దమ్మ తుసుక్కు

**2**

ఉసిరికాయ ఊరిబంతి
లవలవలత్తో చండోబైటో
తుసుకుదెబ్బ

**3**

ఉసిరికాయ కుండ
ఊరుబండి కుండ
పసిడివన్నె కుండ
పచ్చిపాల కుండ
చల్లనిండిన కుండ
చక్కదనాల కుండ
అటకమీద కుండ
ఆవునెయ్యి కుండ
అచ్చు బెల్లం కుండ
అందుకోండి కుండ
కుండమ్మా కుండ

**4**

ఊరిపిండి ఊరకాయ
లక్ లక్ చెంబుకా బరిణికొక
టామ్ టామ్ టుపాక్ టుక్స్
ఎక్కడి దొంగలక్కడే
గప్ చిప్

5

ఉసిరికాయల కుండ
ఊరుబిండి కుండ
కుండమ్మ కుండ

పసిడివన్నె కుండ
పచ్చిపాల కుండ
కుండమ్మ కుండ

చల్లనిండిన కుండ
చక్కదనాల కుండ
కుండమ్మ కుండ

అటకమీద కుండ
ఆవు నెయ్యి కుండ
కుండమ్మ కుండ

అచ్చుబెల్లం కుండ
అందుకోండి కుండ
కుండమ్మ కుండ

6

ఉసిరికాయ కుండా ఊరుపిండి కుండా
మెల్లగా దించండి చెల్లాపకుండ
కుండా! కుండా! కుండా! కుండా!

7

కుండనిండా కందూలు
రంగసాని బొందూలు

8

కుండమీది పిండి పిసుక్కు తినరా
కొమ్మనున్న పండు కోసుకు తినరా

9

చెంబు డటుకులు
దమ్మిడి బెల్లం

**పంతులు**

పంతులు పంతులు పయ్యెక్కే
పంతులు పెండ్లాం జుట్టెక్కె

2

పంతులు పంతులు
పావుసేరు మెంతులు
కూర్లోకి చాలవు
గుప్పెడు మెంతులు

**సోములు గడ్డం**

చన్నంపల్లి సాయిబు
సోములుకున్నది గడ్డం
గడ్డానికున్నది గరక
గుఱ్రమొచ్చి పెరక
లబలబ మొత్తుకొని ఉరక

**పిచిక - పిచికి**

కిచకిచ మనును – పిచికమ్మంటే
కిలకిల మనును – పిచకకు గొప్ప
కేరుచు త్రుళ్ళుచు – పిచికయ్యంటే
క్రిందికి మీదికి – పిచికికి గొప్ప
గిరగిర తిరుగుచు – పిచికా పిచికీ
గంతులు వేయుచు – లోకము లోపల
పిచికా పిచికీ ఉండేవి – తామేగొప్పని
తలచేవి
పిచికమ్మక్కడ – పిచిక 'కిచ' అనగ

కిచకిచమనిన - పిచిక 'కిచ కిచ'
పిచకయ్యక్కడ - 'కిచ కిచ' అనగా
కిచకిచ మనుచు - 'కిచకిచకిచ' మరి
వెంట వెంటనే - 'కిచకిచకిచ' అన
వెంబడించుచూ - 'కిచకిచ కిచకిచ'
విచ్చలవిడిగా తిరిగేవి - ఒకటే కిచకిచ

**రూపాయి**

గోడమీద రూపాయి
నీ మొగుడు సీపాయి
పెద్దోళ్ళింట్లో ఉల్లిపువ్వు
మావాళ్ళింట్లో మల్లిపువ్వు

**తాంద్ర**

అప్పటితిప్పటి తాంద్ర
అయ్యవారి తాంద్ర
అల్లీ బుల్లీ తాంద్ర
అయ్యవారి కొప్పులో తాచుపాము

**చింతకాయ**

చింతకాయ బొంతకాయ
చిగురు మామిడి కాయ
బాపట్ల వంకాయ బలే మంచికాయ
వాలికిలి గుంటలో వెలగిలు మెయ్యగా
ఒక్కటేరాలగా ఒంటిపువ్వు పూయగా
తాటాకు చప్పుడుకు కోట వెలుగు

**2**

చింతకాయ బొంతకాయ
జీడిమామిడికాయ
కొల్లేటి వంకాయ
కొమ్మనిమ్మ పండు
వాగులగుంటలో - జీలుగలు వెయ్యగా
ఒక్కటే ఉండగా - ఒంటి పువ్వురాలగా
తాటాకు దప్పళం - కోట వెలుగు
కోటలో ఉన్నది - కొంపేటిపిల్ల
తరిమి కొట్టింది - తాబేటిపిల్ల

**3**

చింతకాయ బొంతకాయ
చిగురు మామిడికాయ
కోనేటి వంకాయ
కొమ్మనిమ్మని పండు
జీలుగుతోటలో
నాగులు మొయ్యగా
శ్రీవంటి పూరాలంగా
తాటాకు దబ్బనం
కోటగట్టించగా
కోటలో ఉన్నాది
తాంబేలుపిల్ల
మహరాజు కూతురు

**హూత్ కాకి**

కావు కావు కాకి వచ్చే
హోత్తు కాకి హూత్
రివ్వు రివ్వూ రొట్టేపోయే
వెక్కి వెక్కి బిడ్డ ఏడ్చే

**తాయిలాలు**

ఒకమ్మాయి నెత్తి మీద గోరింక
చెప్పకు చెప్పకు చిట్టిపాప
చెపితే నీ ముక్కు కోయిస్తా

పందిరి మీదపాకిస్తా
దూలంమీద నుంచి దూకిస్తా

**శంకరయ్య**

శంకరయ్య నీముద్ది వంకరయ్య
నీకుక్క దొంగదయ్యా
దారి వెంట బోతుంటే
భౌ భౌ మంటదయ్య

**రహస్యం**

చెప్పకు చెప్పకు చెడిపోతావు
చెప్పితే నీ ముక్కు చెక్కిస్తా
దూలంమీంచి దూకిస్తా
పందిరిమీంచి పాకిస్తా
కంచం అన్నం తినిపిస్తా
కడివెడు నీళ్ళు తాగిస్తా

**సేర్**

దొబ్బుల్ సేర్    నారాయన్ సేర్
గాడీక నంబర్  టొంటీయైట్!...

**నక్క తోక**

నారాయణ నారాయణ నక్క తోక
నారాయణ పెండ్లాం కుక్క తోక
నన్నెందుకుంచినావు తీస్కుపోక
వోళిగల్ల గంపకాడ ఉంచిరాక
మంచి నీళ్ళ బాయి కాడ ముంచిరాక

**తేలు కుట్టింది**

ఏక్, దో, తీన్, చార్, పాంచ్ బజానా
నిన్న పట్నపిలకే తేలుగుట్టిందీ
దావఖాన కెత్కపోతే దగ్గుదలిగిందీ
బాజేపల్లికెత్కపోతే పానం బోయిందీ...!

**రేడియో**

జన్ ఝం జన్ ఝం
ఎవ్వరొచ్చింద్రూ మామొచ్చింద్రూ
ఏమి తెచ్చిందూ రేడియో తెచ్చిందూ
ఎట్లు తిప్పాలే?  గిట్ల తిప్పాలే!
(చెవి మెలిపెట్టి చూపాలి)

**ఎక్కడికి?**

పిల్లీ! పిల్లీ! ఎక్కడికీ?
ఎలుకల వేటకు వెళుతున్నా!
బల్లీ! బల్లీ! ఎక్కడికీ?
ఈగల వేటకు వెళుతున్నా!
నల్లీ! నల్లీ! ఎక్కడికీ?
మనుషుల వేటకు వెళుతున్నా!

**ఋతువులు**

చలికాలం వచ్చింది
నిప్పుల కుంపటి తెచ్చింది
ఎండాకాలం వచ్చింది
కాళ్ళకు చెప్పులు తెచ్చింది
వానాకాలం వచ్చింది
మనకు నీరు తెచ్చింది

**సాలీడు**

సన్నని దారం నున్నని దారం
మన్నిక తోడ వన్నెలు మీద
కట్టెను గూడు చిట్టి సాలీడు

**రంగుల రథం**

రండి రండి రారండి
బాలల్లార రారండి

రంగుల రంగుల రథమండి
రంగనాధుని రథమండి
రయ్యని పరుగిడి రారండి
రథమును లాగగ రారండి

## భేష్

ప్రొద్దున మనము లేవాలి
పళ్ళను బాగా తోమాలి
గ్లాసెడు పాలూ తాగాలి
మంచిగ స్నానం చేయాలి
తలను నున్నగా దువ్వాలి
ఉతికిన బట్టలు కట్టాలి
ఛలో ఛలోమని పోవాలి
గురువుకు దణ్ణం పెట్టాలి
బడిలో చక్కగ చదవాలి
అమ్మా నాన్నా మెచ్చాలి
అందరు భేషని పొగడాలి

## ఠం! ఢం! ఘం! భం!



తప్పెట కొడితే ఠం! ఠం! ఠం! ఠం!
ఢంకా మ్రోగిస్తే ఢం! ఢం! ఢం! ఢం!
మద్దెల వాయిస్తే ఘం! ఘం! ఘం! ఘం!
శంఖం ఊదితే భం! భం! భం! భం!

## ఆంపండు - జాంపండు

ఆంపండు జాంపండు అమ్మవారికి
నా జేబులోని రూపాయి పూజారికి
అరటిపళ్ళు కొబ్బరికాయ అమ్మవారికి
నా చేతిలోని చెల్లని నోటు పూజారికి
కర్పూరం అగరొత్తులు అమ్మవారికి
నా చేతిలోని ఏం లేదు పూజారికి

## పూజ

చిన్ని మొక్కలు నాటితిని
నీళ్ళు బాగా పోసితిని
ఆకులు రెమ్మలు వేసినవి
పువ్వులు ఎన్నో పూసినవి
పువ్వులు ఎన్నో కోసితిని
మాలలు ఎన్నో గుచ్చితిని
దేవుని మెడలో వేసితిని

## రంగులు

కాకమ్మ నలుపు మేఘమ్ము నల్లన
కారుమబ్బు నలుపు కొంగమ్మ తెలుపు
కోయలమ్మ నలుపు కోడి గుడ్డు తెలుపు
చిలకమ్మ పచ్చన చెట్లన్ని పచ్చన
దాసాని ఎరుపు దానిమ్మ ఎరుపు

## ఈగ

ఇంటికిరా ఇంటికిరా
ఈగా ఈగా ఇంటికిరా
అందంబయిన నాయింట
ఆడాపాడా నా యింట
ఇంటికిరా ఇంటికిరా
ఈగా ఈగా ఇంటికిరా

సాలీడా సాలీడా
ఏటి ఇంటికి సాలీడా
అందంబయిన నీ యింట
ఆడాపాడా నీ యింట

**పాట నాకిష్టం**

తోట నాకు ఇష్టం – ఆట నాకు ఇష్టం
మాటలతో మురిపించే – పాట నాకు ఇష్టం

**మామిడి పండు**

మామిడి పండు మామిడి పండు
పసుపు పచ్చని మామిడి పండు
మా ఊరి మామిడి పండు
ఎంతో తీయని మామిడి పండు

**పాడుకో**

పాపలొస్తే పాడుకో
పరమేశ్వరుని వేడుకో
కొడుకుబుటితే ఎత్తుకో
మొగుడు కొటితే మొత్తుకో

**2**

పాటలైతే వచ్చుగానీ
పాడనైతే నేర్తుగాని
పాపిష్ఠి సిగ్గు నన్ను పాడనివ్వదో

**సొమ్ము**

సూదివాయె సూదివాయె
దేవుకో! దేవుకో!
కాలువాయె కాలువాయె
కలమంద గట్టుకో
ఎల్లిపాయ గట్టుకో
ఎర్ర గొర్రెందింటా
ఎవనబ్బ సొమ్ము

**పండూ - పండూ**

పండు పండూ ఏమి పండు
పండు పండూ పనస పండు
పనస పనసా ఏమి పనస
పనస పనసా నేల పనస

**చిట్టి చీమ**

చిట్టి చీమ చిట్టి చీమ ఎక్కడి కెళ్ళావు
చిట్టి పాప పుట్టిన రోజు విందు కెళ్ళాను
విందు కెళ్ళి చిట్టి చీమ ఏం చేసావు
చిట్టి పాప బుగ్గపైన ముద్దు పెట్టాను

**ఉన్న ఊరు**

ఉన్నఊరూ విడిచి ఉండనేలేము
కన్నతల్లిని విడిచి ఘడియుండలేము
ఉన్నఊరే నాకు చెన్నపట్నమ్ము
కన్నతల్లే నాకు కల్పవృక్షమ్మ

**బొమ్మకు నీతులు**

వీధిలో తలవిప్పి ముడువకే బొమ్మ
పల్లెత్తి గట్టిగా పలుకబోకమ్మ
పొరుగిళ్ళ కెప్పుడూ పోవకేబొమ్మ
నలుగురీ నోళ్ళలో నానకే బొమ్మ

**చెలిమి**

కానివారీతోను కావించు చెలిమి
కట్టెవిరిచీ పొయిని పెట్టినట్లుండు
అయినవారీతోను కావించు చెలిమి
ఆకుమడచీ మడత పెట్టినట్లుండు

కానివారీమాట కంట్లోది నలుసు
ప్రాణం పోయిందాక ప్రక్కలో పోటు
అయినవారిమాట అమృతపుతేట
బ్రతికి ఉన్నందాక భాగ్యంబుమూట

### మాణమ్మ

మాణమ్మ నవ్వులూ మంచి ముత్యాలు
సుగుణమ్మ చూపులు చుక్కల్ల పొదుపు
మాణమ్మ సుగుణమ్మ మామనీడల్లు
సుగుణమే మణిగాద ఎంచి చూడంగ

### రోత

చేతగాని పనులు చేసిన రోత
నీతిమాలినచోట నిలుచుంటె రోత

### ఎలకా

ఎలకా ఎలకా వేవిళ్ళు
ఎవరూ నీతోటన్నారు
నిన్నా నీ మొగుడన్నాడు
నీలాటి రేవున విన్నాను
అంతా పుణ్యమాయేనా
అనంతనోమూ నోసేనూ
తలకీ వాసనకట్టెనూ
తమ్మిరాజు పేరెట్టమా!

### 2

ఎలుకా ఎలుకా యాకటాట?
ఎవ్వరుచెప్పిరి నీతోటి?
నీ మొగుడె చెప్పె నాతోటి
నూనె బువ్వా తినేనా
నులకా మంచ మెక్కేనా?



పాలబువ్వ తినేనా?
పట్టెమంచ మెక్కేనా?
అంతకు నోచుకున్నానా?
అంచుల చీర గట్టెనా?
బంగారు కచ్చుల బాలుణ్ణెత్తుక
బాజారంత తిరిగేనా?

### 3

తెల్లవారి లేచింది చిట్టెలుకా
కాళ్ళు మొహం కడిగింది చిట్టెలుకా
పట్టేనామం పెట్టింది చిట్టెలుకా
పల్లెత్రోవ పట్టింది చిట్టెలుకా
ఉల్లిగడ్డ కొరికింది చిట్టెలుకా
ఊరిత్రోవ పట్టింది చిట్టెలుకా

### బంతిపూవు

బంతిపువ్వు చింతపూవు రాలంగ
చిమ్మిలిబొట్టూ బుల్లిచెంబు
దండే వెళ్ళేడు నామరిది
దండలు తెచ్చాడు నామరిది
గోలకొండ పంపించి
గోటూ రవికలు తెప్పించి
కుమ్మరాళ్ళింటికి పంపించి

కుమ్మరి మట్టి తెప్పించి
బొమ్మారిళ్ళు వేయించి
బొమ్మారింట్లో బిడ్డనికంటే
అత్తతలకీ ఆముదం లేదు
మామాతలకీ మడ్డీలేదు
అల్లవారింటికీ చల్లకెడితే
అల్లవారి కుక్కొచ్చి బొఁయ్‌మంది
పుట్టలో నాగన్న గుంయ్‌మన్నాడు
నా కాళ్ళగజ్జలు గల్లుమన్నాయి

**రావమ్మ కోకిలా**

రావమ్మ కోకిలా
రావమ్మ కోకిలా
అల్లదే మా దొడ్లో అంటు మామిడిగున్న
కలదు మాచెట్లోన కమ్మని చిగురు
కడుపునిండా తినిన కదలిపోవచ్చు
“కూవూ” అను నీదు కూత విన్నంత
పాపాయి నీలాగె పాడసాగింది
నీతోను సమముగా నిన్నటిబాల
ఆలపింపగలేదు అలక చెందకుము
వచ్చి వచ్చీ పాడి వల్లె వేయించి
పాటలు నేర్పుమా పాప కనుదినము

**చీర పాట**

పడెయ్య మొలచింది - పత్తెయ్య చెట్టు
వెన్నెల్ల మహదేవి - వడికింది నూలు
మొదటనే నేసేడు - మొగ్గల్లతోను
చిగురునే నేసేడు - చిలకల్లతోను
అంచునే నేసేడు - అతిమంచి వనము
ఝామెక్కి మగ్గాన్ని - జలతారు నేసె
ప్రొద్దెక్కి మగ్గాన్ని - పొన్నల్లునేసె
ప్రొద్దుపొడుపుండేటి - సూర్యుణ్ణి నేనే
చల్లదనమిచ్చేటి - చంద్రుణ్ని నేనే
సరిజేసి నేసెదా - చక్కని చీర
నువ్వుచూ మా బాల - ఈ చీరకట్టె

**అమ్మ గున్న**

అమ్మనా గున్నను ఏమన్నారే
అప్పప్పాలా - పండన్నారే
అప్పుడు కాచిన నెయ్యన్నారే!
కరకర వేగిన గారెన్నారే
కర్రి ఆవుల జున్నన్నారే
లేత కొబ్బరి పండన్నారే
ముదురు మామిడి చెట్టన్నారే
ముంతా మామిడి పప్పన్నారే

**బాలలాడీని**

దేవూడి గుళ్ళోను దేవుడాడీని
దేవేంద్ర సభలోను జూదమాడీని
పరమేశ్వరుడు గుళ్ళోను పాములాడీని
పణతి నా నట్టింట బాలలాడీని

**కడుపు చల్లన**

గంధమ్ము తీసిన్న సాన చల్లన్న
సభలోన అబ్బాయి మాట చల్లన్న
ఇందూవ తీసిన్న నీళ్ళు చల్లన్న
ఇంట్లోను అమ్మాయి కడుపు చల్లన్న

**వారే**

చిన చిన గొంతుల్ చిటారి గొంతుల్
లక్కామేడల్ - లవంగ మొగ్గల్
చిన్నారేటివారే - చిలకా మీరేటివారే

**ఆటల బడి**

ఆడే పాడే అబ్బాయి
అల్లరి పెట్టని అమ్మాయి
అందరు కలసి రారండి
ఆటలబడికి పోదాము

**లడ్డూలు**

అదిగదిగో అమ్మ
పిండి కలిపిందమ్మ
బొక్కల చట్రం నిండ
పోసింది అమ్మ
దూరారు దొంగలు
పండింది కడుపు
పుట్టారు బిడ్డలు
బిడ్డల పేరు లడ్డూలు

**తినడు-బలడు**

దబ్బ చెట్టుకాడ దాన్నెం
దంచితే బియ్యం
వండితే అన్నం
తినమంటే తినడు
బలమంటే బలడు
అంటికాయ* దప్పడం
పలికొట్టుకొని తిప్పడం

* అరటి కాయ

**పొగదాగడు**

అప్పప్ప చోడిపప్ప
మాడిపోతంది
అమ్మదొంగ! రైలుబండి
పారిపోతంది

**పొట్టోడు**

పొట్టోడమ్మా - పొట్టోడు
పొట్టి సైకిలు కొన్నాడు
కొండా మీదా తొక్కాడు
కాలూ జారీ పడ్డాడు

**తిక్క అక్క**

నాకు ఉంది అక్క
చక్కని చుక్క
శనగపప్పు చెక్క
మిగలకుండ మెక్క
నాన్న చీల్చు డొక్క
అమ్మ పట్టు రెక్క
కుదిరె అక్క తిక్క

**ఎలా తిప్పాలి?!**

ఒకటి రెండు
మూడు నాలుగు
గంటకొట్టింది!
ఎవరొచ్చారు?
నాన్నొచ్చారు!
ఏటి తెచ్చారు?
బొక్కి రేడియో!
ఎలా తిప్పాలి?
ఇలా తిప్పాలి!
(చెవి మెలిపెడుతూ)

**బెల్లం ముక్క**

చిన్నక్కా - పెద్దక్కా
చెరువు కెళ్ళారు
ఉల్లిపాయ - మిరపకాయ

ఊసులాడాయి
మద్దెనున్న కరింపాకు*
కయ్యిమెట్టింది
విజయనగరం బెల్లమ్ముక్క
విడిపించింది.

* కరివేపాకు

**అట్లు**

అట్టమ్మ అట్లు
వేడి వేడి అట్లు
నాన్నకి ఆరు
అమ్మకి ఐదు
అన్నకి నాలుగు
అక్కకి మూడు
నాకేమో రెండు
తమ్ముడికొకటి
నీకేమో సున్నా.

**బలే తీపి**

ఇంతింతా నారింజా
నిన్ను చూడగానే
నోరూరు చున్నది
తొక్కతీసి తిందునా
అబ్బబ్బ పులుపు
కాయను కోసి
గ్లాసులో పోసి
చక్కెర వేసి
గిర గిర తిప్పి
గుటుక్కు తాగితే
బలె బలె తీపి.

**పాపా - పాపా లేవమ్మా**

పాపా - పాపా లేవమ్మా!
పళ్ళూ తెల్లగ తోమమ్మా
ఒంటికి స్నానం చెయ్యమ్మా
ఉతికిన బట్టలు కట్టమ్మా
చద్దీ అన్నం తినవమ్మా
చకచక బడికి పదవమ్మా
అఆ, ఇఈ రాయమ్మా
అందరి మెప్పుపొందమ్మా

**వంటా - వడ్డన**

కోడి కక్కలు
కొబ్బరి ముక్కలు
గంటలు అమ్మి*
వంట చేసింది
అన్నమెయ్యమంటే
సున్నమేసింది
బెల్ల మిమ్మంటే
బెడ్డ లిసిరింది
ముద్దు లిమ్మంటే
మొగుడి కెళ్ళింది.

* అమ్మాయి

**కొబ్బరి లడ్డు**

చింతా చెట్టు
చెంతా పుట్ట
పుట్టా మీద
కోడీ పెట్టా
కోడీ పెట్టా
గుడ్లు పెట్టె

నీకో గుడ్డు
నాకో గుడ్డు
కోడికి మాత్రం
కొబ్బరి లడ్డు

**శ్రమ**

అవిగవిగో చుక్కలు
అందొచ్చిన మొక్కలు
చిన్న బావ - పెద్ద బావ
చేసారు సేద్యం
చిన్నక్కా - పెద్దక్కా
కట్టారు మేడలు

**కాకమ్మ చెరువు**

పిల్లకోడి నీపీక - పిసికేస్తాను
దొడ్డవతల గడ్డి కాడ - దూసేస్తాను
వంకమామిడి చెట్టుకాడ - వండేస్తాను
తియ్యమామిడి చెట్టుకాడ - తినేస్తాను
కాకమ్మ చెవులోన - కడిగేస్తాను

**సహజం**

పిల్లల్లారా సంపెంగ -
పూలుకెళ్ళొద్దు
సంపెంగ తోటలోన -
పామున్నాది
పాము కోసం పాములోడు -
కాపున్నాడు
గట్టు మీద గంగిరెద్దు -
గంతులేస్తుంది
చెరువులోని చేపపిల్ల
ఈదుతున్నాది
బుజ్జిపాప కొప్పులోని -
పువ్వునవ్వింది.

**బీరబద్ద**

వదినా ఏమికూర?
మరిదీ బీర బద్ద!
దమ్మీ నూనె బొట్టా?
దాకా పేల గొట్టు

**రూపాయి**

ఆ చేతిన పావలా
ఈ చేతిన పావలా
మొగుడిచ్చిన పావలా
మూటగట్టిన పావలా
కలిపిస్తా నుండరా
రూపాయి చిల్లర

**మేనత్త**

అత్తా అత్తవుకాదా
మేనత్తవు కాదా
సంతకెళ్ళావు కాదా
దార బందాలు[1] కాడ
దార బోసావు కాదా
కోడి కూసే వేళా
కొడుకు పుట్టాడు కాదా
పేడ దిబ్బల మీద
పేరు పెట్టావు కాదా
ఇసక దిబ్బల కాడా
ఇల్లు కట్టావు కాదా

* ద్వార బంధాలు

## గాలిపటం



గాలిపటం చూడరా
గాలిలోన ఎగురురా
దారం చుట్టి వదలిరా
దాని గొప్ప చూడరా
రెక్కలేమొ లేవురా
పక్షివలె ఎగురురా!

## పొట్టు పులుసు

పిన్నమ్మా! పిన్నమ్మా
పిండీ సుక్కల పిన్నమ్మా
దద్ద* ఎక్కడి కెళ్ళాడు?
దద్ద మిల్లీ** కెళ్ళాడు
దద్ద కేటి పులుసు
మేక పొట్టు*** పులుసు

* నాన్న, ** మిల్లు, *** పేగులు

## పిలకడి పెళ్ళి

పిలకడికి పెళ్ళి
పిఠాపురం డప్పు
కంది గింజ మేళం
కరక్కాయ పెళ్ళం

## మా యప్ప నడగండి

అప్పయ్యమ్మ మేడమీద
బొమ్మలున్నాయి
బొమ్మలకి బోజనాలు
ఎవులెడతారు?
గూటిలోని రామసిలక
గుడ్డెట్టింది
గుడ్డుకొక్క రూపాయి
ఎవులిస్తారు?
లచ్చలున్నాయండీ - మా
లచ్చిమి నడగండి
మా లచ్చిమియ్యక పోతే
మా యప్పనడగండి.

## కలిసుందాం రండి

చినచెట్టు* చింత చెట్టు కాడ చిన్నావు
తోలుకురారా చిన్నన్నా
పాలు తియ్యరా పోలన్నా
మరగబెట్టవే మారమ్మ
సల్లందులు తెచ్చీ
సర్దుకుందాం రండి
సూరి నాయుడు పెళ్లి
సూసొద్దాం రండి
ఆదినారాయణ పెళ్ళి
అడిగొద్దాం రండి
మన ఇంట్లో పెళ్ళి
మళ్లీ వద్దాం రండి.

* చింత చెట్టు

## రేతిరి బోజనం

చిన్న చిన్న తిరగలి
చిట్టి చోడంబలి
పాతబియ్యం అన్నం
చింత చిగురు పులుసు
కోడి క్కక్కలు*
కొబ్బరి ముక్కలు
రారా కిష్టయ్య
రేతిరి బోజనాలకి

* మాంసం ముక్కలు

## వదిన

అదికొండ - ఇది కొండా
మద్దిన - నలగొండా
నలగొండ - సేరుపునా*
బంకూటుయ్యాల
బంకుటుయ్యాల కాడా -
బంగారు చాపుంది
బంగారు చాప మీదా -
పసు పెండా బోసి
తీసుకో ఓ వదినా -
నూటొక్కా కొమ్ము
పోసుకో ఓ వదినా -
పొద్దల్లా నీల్లు
మాయన్న తెచ్చాడు -

* చేరువ

## పొగదొంగ

అప్పుప్ప చోడిపప్పు*
మాడిపోతంది
అమ్మదొంగ! రైలు బండి
పారిపోతంది

* చోడిపిండి అట్టు

## బడాయి బావ

బావగారండీ
బడాయెందుకండీ - మీ
బాద లేమిటండీ
పక్కజేబులోన
పదిలచ్చాలున్నాయండీ
లెక్కతెలీపోతే - మా
అక్కనడగండి
మా యప్ప గొప్పనాతి
మా సెల్లి సందమామ
మా నాన్న మేనమామ
మా యమ్మేనీకు మందు
మా తాత తాటిపండు.

## ఎవులాలు?

చింత చెట్టు కాడెవులాలో
చింతోలమ్మిని నేనేనూ
కాగుచెట్టు కాడెవులాలో
కాగోలమ్మిని నేనేను
మునగచెట్టు కాడెవులాలో
మునగోలమ్మిని నేనేను
పాచి చెట్టుకాడెవులాలో
పాచోలమ్మిని నేనేను
మామిడి చెట్టు కాడెవులాలో
మామిడోలమ్మిని నేనేను
పనస చెట్టు కాడెవులాలో

పనసోలమ్మిని నేనేను
నేరెడు చెట్టు కాడెవులాలో
నేరడోలమ్మిని నేనేనూ

### ఛల్ ఛల్ గుర్రం



ఛల్ ఛల్ గుర్రం – చలాకి గుర్రం
రాజూ ఎక్కే – రంగుల గుర్రం
రాణీ ఎక్కే – జీనూ గుర్రం
రాకుమారెక్కే – రత్నాల గుర్రం

### అమ్మ నన్ను కాయకే

అమ్మ నన్ను కాయకే
దొమ్మరోడి ఒక రకం
సంచారజాతి కియ్యకే
డప్పులోంచమంటడు
డోలోంచ మంటడు
సాలెక్క మంటడు
సాం జెయ్యమంటడు
చెట్టెక్క మంటడు
చెయ్యూపమంటడు
అమ్మ నన్ను కాయకే
దొమ్మరోడి కియ్యకే

### కాయగూర పచ్చడి

పొట్టి బుడం కాయ
పొయిలోన వంకాయ
నక్క దోసకాయ
నారింజ కాయ

### దమ్మిడి

చిన్న చిన్న దమ్మిడి
చీకటి తెచ్చిన దమ్మిడి
మొగుడు మెచ్చిన దమ్మిడి
మూటగట్టిన దమ్మిడి
జగ్గయ్యమ్మ తోటకాడ
జారిపోయిన దమ్మిడి

### ఏమో మరి!

పుట్టమీద చెమర పిల్లి
గెంతుతున్నది
గట్టుమీద గంగిరెద్దు
ఆడుతున్నది
పొయ్యిలోన తాటి మట్ట
కునుకు తున్నది
పొయ్యిమీద కూటికుండ అన్నంవంగే
మట్టిపాత్ర
మూలుగుతున్నది

### చిలకా చిలకా...

చిలకా చిలకా చిన్న
కబురున్నాది
నువు నిలబడితే నిమ్మచెట్టు
నీడున్నాది
నువు కూర్చుంటే కుర్చీల
పీటున్నాది



నువు పడుకుంటే పట్టిమంచం
పరువున్నాది
నీకాకలేస్తే సన్నబియ్యం
కూడున్నాది
నీవు కావాలంటే పెద్దావు
పాలున్నాయి
నీకు రోగమొస్తే ఆసుపత్రి
పక్కనున్నాది
నువు చచ్చిపోతే వల్లకాడు
దగ్గిరున్నాది.

**మరికొన్ని పాటలు**

అహా! విచిత్రం
వినుకొండసీమ
ఇతః పరం కట్టెలు నీవు లేవు
ఆర్కోసు సజ్జ
మరి జొన్నబువ్వ
పితాళ్ళకైన వరి బువ్వలేదు

**2**

ఎంత చక్కనిదమ్మ ఏలూరు కోట
ఎక్కి కూర్చున్నారు వెలమ నాయకులు
సరులు చక్కనిదమ్మ చల్లపల్లి కోటా
చదురు మీదున్నారు సరికమ్మ దొరలు
మానుచక్కనిదమ్మ మా మర్రిమాను
మ్రానుమీదున్నాడు మామ పెదమామ

**3**

విసిరీ విసిరీ పేలపిండి
విసరలేను జొన్నపిండి
మా అప్ప సవరం మాకుతే
దేవుడిగిన్నె మాకుతే

**4**

ఉత్తత్తా పండు - ఉత్తరేణీపండు
దానిమ్మపండు - దబ్బపండు

**5**

కోడి కొక్కొరాట
కొబ్బరికాయ ముక్కలాట
పాలోసి బెల్లమాట
పంచదార చిలుకలాట
మారాజి పట్టాల్‌మీద మహారాజు
మీ అబ్బాయి మా ఇంటికి భోజనానికి

**6**

చలి చలి చలి చలి చందాయమ్మ
గొంగళికప్పుకో గోనాయమ్మ
వడ వడ వడ వడ వణికేనమ్మ
చలిమంటకు చితుకులు తేవమ్మ

**7**

వంటిపిల్లి రాకా సొకచోట
ఇద్దరు ముగ్గురు ఒకచోట

ఆడతారీబొమ్మ పాడతారీబొమ్మ
నక్కేరు చెట్టుక్రింద బొక్కేరుబొమ్మ
తోలుముక్కా ఉన్నతైతక్క బొమ్మ
బొమ్మా! బొమ్మా! బొమ్మా! బొమ్మా!

**8**

కాటుక్క పెట్టితే కన్నెంత తీరు
కలువల్లు పూచితే చెరువంత నిండు
కాటుక్క పెట్టింది కన్నుతిప్పింది
కలవారి అమ్మన్న ఎవరాడపడుచు

**9**

కాకమ్మ కాకమ్మ
చుట్టాలొచ్చారు చూచిపో
పక్కాలొచ్చారు పారిపో
నీకాలికిగజ్జ కడతా
కాలుతీసి ఖంగున గంతెయ్

**10**

అమ్మగారమ్మొచ్చెనూ
ఆదొండపండొచ్చెనూ
చిలకాలదండొచ్చెనూ
కెంపూల నత్తొచ్చెనూ
శ్రీలక్ష్మి మొగుడొచ్చెనూ
వెంకమ్మ నీపేరు కుంకాలిభరణి

**11**

చిట్టి నాఅమ్మాయి చీరకేడ్చింది
నేయరా సాలీ నెల్లూరుపట్టు
మురుస్తు సాలీ మూణ్ణెల్లు నేస్తే
అరుస్తు చాకలి ఆర్నెల్లు ఉతుకు
వేడుకతో అమ్మాయి వెయ్యేళ్ళుకట్టు
ఆ చిరకట్టంగ అందరికీ ముద్దు

**12**

వడ్డరొల్లగుడిసెమీద దేవుడుండు
ముక్కు ముక్కు శాంతమ్మకు
కొడుకుపుట్టిండు
కొడుకుపుట్టిన తెల్లారి కోడలొచ్చింది
కోడలొచ్చిన బాంట్ల బంగ్లుంది
బుగ్గమీద రామచిలుక పలుకు పల్కుచుండె
కల్లుకింద కారంపెట్టె తియ్యగుండె

**13**

"అమ్మణి ముద్దును ఏమన్నారు-
అప్పుడు కాచిన నెయ్యన్నారు
కందిపప్పు ముద్దన్నారు-
కాటుక పెట్టిన కన్నన్నారు
లేతమామిడి చిగురన్నారు-
లేగంటావుల పెరుగన్నారు
అందరు మెచ్చిన ముద్దన్నారు-
అప్పాల పండు అన్నారు.

**14**

బొజ్జనిండా వేడిబువ్వ తిన్నావా
కాళ్ళకు గజ్జల్లు కట్టుకొన్నావా
దోసగింజలె బొట్టుపెట్టుకొన్నావా
వచ్చేము వుండవె వరహాలతల్లి

**15**

తొలకరిలో ఒక మబ్బు తొంగిచూచింది
మబ్బులో ఒక మెరుపు మెరిసిపోయింది

పెరటిలో ఒకజల్లు కురిసిపోయింది
వీధిలో ఒకగాలి విసిరిపోయింది
పూలతో జగమంత విరిసిపోయింది
అవిచూచి మా పాప మురిసిపోయింది

**16**

పాపాయి పాట పసిడిమూట
అబ్బాయి ఆట అందాలకోట
పంతుల మాట వరాలమూట
పందె పందెం బడికే అందం

**17**

చింతపూవు చింత పువ్వులియ్య మందేయి
చింతపూ రాలింది సిరిగడపలోను
నేనున్న తమ్మయ్య వియ్యమందితె
మల్లెపువ్వు రాలింది మాగడపలోను

**18**

చిమడకే చిమడకే ఓ చింతకాయ
నువ్వెంత చిమిడినా నీ పుల్లపోదు
ఉడకకే ఉడకకే ఓ ఉల్లిపాయ
నువ్వెంత ఉడికినా నీ కంపు పోదు

**19**

చిన్న నా అమ్మన్న చీరకేడుస్తే
నెయ్యవోయి సాలెవాడ నేత్రంపుపట్టు
వెయ్యవోయి కంసాలి వెండిజల్తారు
మూలుగుతూ సాలెవాడు మూన్నెల్లు నేసే
అరుస్తు చాకిత ఆర్నెళ్ళు ఉతికె
వేడుకతో అమ్మన్న వెయ్యేళ్ళుకట్టే

**20**

మూలమంచమువేసి ముంతపొగ బెడుదు
కందకడిగిననీళ్ళు కాళ్ళకందించి
చేమకడిగిననీళ్ళు చేతికందించి
దవ్వకడిగిననీళ్ళు దాహానకిచ్చె

**21**

చిలకా చిలకా పంచదార చిలకా
పచ్చని చిలకా పలికే చిలుకా
రంగుల చిలకా రామ చిలకా

**22**

సీమ మిరపకాయ చిర్రోబుర్రో
పాతగుడ్డ చిరిగితె పుర్రోపుర్రో
దాని మొగుడు దాన్ని కొడితే మొర్రోమొర్రో

**23**

అక్కలి కర్ర ముక్కాలిపీట
కూర్చోవదినా! వదినా! వదినా!

**24**

సూరీ తాపిల్లీ మారీ తాపిల్లీ
పడమటక్కల్లారా! పారిపొండు

**25**

కథ కథ కంగు  మాతాత టెంగు
నూనెపోసి కొని  దిగమింగు

**26**

చీమిడి ముక్కు చింతకాయ తొక్కు
మా అత్త పెట్టిన మామిడికాయ తొక్కు

**27**

మొండిచెయ్యక్క మొగడేదక్క
దానిమ్మ చెట్టుక్రింద దాసుకున్న డక్క

**28**

అంపండు జాంపండు అమ్మవారికి
నా జేబులో చిల్లుకాని పూజారికి
అరటిపళ్ళు కొబ్బరికాయ అమ్మవారికీ
నాచేతిలోని చిల్లుకాని పూజారికి
కర్పూరం అగరొత్తులు అమ్మవారికీ
నాచేతిలోని చిల్లుకాని పూజారికీ

**29**

మామిడాకుగోసి తోరణాలుగట్టి
చింతాకుదూసి బుట్టలో పెట్టి
అయ్యవారి కుక్కొచ్చి బొయ్యమంటే
నా కాళ్ళగజ్జలు ఘల్లుమన్నాయి

**30**

బిందె నిండా కందులూ
రంగసాని బొందులూ
బొందులూ బొందులూ

**31**

సూరీ గుమ్మడి కాయ
సూరప్ప తలకాయ
తలకాయ తలకాయ

**32**

అనపకాయ అచ్చమ్మ
తలకాయ తలకాయ

**33**

బూడిద గుమ్మడికాయ
బుచ్చెమ్మ తలకాయ
నార దబ్బకాయ
నారమ్మ తలకాయ

**34**

పండక ముందు - పచ్చని చొక్కా
పండిన పిదప - ఎర్రటి చొక్కా
పచ్చి మిరప కాయ - ఏమిటి నీ మాయ

**35**

పోయి వా రమ్మాయి నీళ్ళకెళ్ళింది
పాలైన యివ్వవే ఓ కుక్కపిల్లా

**36**

పిల్లెమ్మ వెళ్ళింది పల్లెల్లు దాటి
అబ్బాయి వెళ్ళేడు రచ్చల్లు దాటి

**37**



ఏనుగు తొండము - ఒకటి
మనిషికి కళ్ళు - రెండు
జెండా రంగులు - మూడు
కుక్కకు కాళ్ళు - నాలుగు
చేతికి వేళ్ళు - ఐదు

# అభినయ కథాగేయాలు



గేయ కథలలో. ఇదొక కొత్త ప్రక్రియ. ముఖ్యంగా గ్రామీణ ప్రాంతాలలోగల ప్రాధమిక పాఠశాలలో ఈ గేయాల ప్రాధాన్యం మెండు. బాలలు ఈ పాటలను పాడేప్పుడు సర్వాంగాల కదలిక లయానుభూతిగల అభినయం ముఖ్యాంశాలు. "కాకి మాంసం ముక్క" అనే పాట పిల్లలు అభినయిస్తూ పాడతారు.

"ఓ మంచి కాకమా – మా మంచి కాకమా
మా మంచి కాకమా – అందమైన దానివి
ఆనందమిచ్చు దానివి"

కాకి – కూజా ... అనే మరో గేయంలో –

"కాకి ఒకటి నీళ్ళకై కావు కావు మనుచును
అడవి అంత తిరుగుచు అలసి సొలసి పోయెను.
చిన్న మూతికూజా అడుగునున్న నీరు
కన్నులార చూచెను మనసార తాగెను"

ఈ కథను బిడ్డలు అభినయిస్తూంటే వారికి కథ సులభంగా గుర్తుంటుంది. నోటికి వస్తుంది. శరీరానికి మంచి వ్యాయామం చేకూరుతుంది. ఇలాటివి ఎన్నో గేయాలున్నవి. కొన్నిటిలో కథ లేకపోయినా అభినయం విధిగా ఉంటుంది.

### పూజ

సుందరమైన తోటలోనికి
అందరమును మనమరుగుదమా
మందారంబులు కోయుదమా
వాణికి పూజలు చేయుదమా
మొగలిపువ్వులు కోయుదమా
సంపెంగపువ్వులు కోయుదమా
జాజిపువ్వులు కోయుదమా
కాలనిలోనికి పోవుదమా
కలువపూలు తేయుదమా
వాణికి పూజలు చేయుదమా
మృదువగు రంగు పూవులతో
వాసనకలిగిన పూవులతో
మాలలతో బంతులతో
వాణికి పూజలు చేయుదమా

### తారంగం - తారంగం

తారంగం తారంగం తాండవకృష్ణ తారంగం
చిన్నారి తారంగం శ్రీకృష్ణ తారంగం
తారంగమ్మని సారెకు సారెకు
అందరు చూడగ ఆడర కృష్ణ
వీరందరు చూడగ ఆడర కృష్ణ తార॥

దురితమగుచు చెవులమద్ది
కాయలల్లాడా కృష్ణ
పులిగోరు పతకము గొలుసు
బొజ్జపై నోలలాడగ తార॥

మురుగులు గొలుసులు చేతులు త్రిప్పుచు
కిలకిల నవ్వుల కెరల కృష్ణ
అద్దంపు చెక్కిళ్ళు నాకు ముద్దులియ్యర
తద్దిక్కు తాకుడు తకధిమితక
తాళము వేయరా తార॥

### 2

తారంగం తారంగం
తాండవకృష్ణా తారంగం
వేణునాధ తారంగం
వెన్నాముద్దల తారంగం
ఆలా బాలా తారంగం
ఆడుకోపాపా తారంగం

### రామాయణం



ఉత్తముని పేరేమి? ఊరిపేరేమి?
సత్యపురుషులగన్న సాధ్వి పేరేమి
ఉత్తముడు దశరథుడు ఊరు అయోధ్య
సత్యపురుషులగన్న సాధ్వి కౌసల్య

ఇల్లాళ్ళు ముగ్గురే ఈ దశరథునకు
పిల్లాళ్ళు నలుగురే పేరుగలవారు
అయోధ్యలో వారు అందరున్నారు
సయోధ్యలో వారు సరిలేనివారు

శ్రీరామ జయరామ శృంగారరామ
కారుణ్య గుణధామ కళ్యాణనామ

జగతిపై రామయ్య జన్మించినాడు
సత్యమ్ము లోకాన స్థాపించినాడు
తల్లిదండ్రులమాట చెల్లించినాడు
ఇల్లాలితోపాటు హింసపడ్డాడు
సీతామహాదేవి సృష్టిలోపలను
మా తల్లి వెలసింది మహనీయురాలు

**2**

ఉత్తరం వురిమింది దక్షిణం మెరిసింది
పరిగెకుపోయి రామన్న పదును చూచివచ్చె
ఇంటికడ సీతమ్మ విత్తనాలు చేసే
వారితల్లి వసుదేవి కురులు సవరించె
నేను చేసింది పన్నెండు ధాన్యాల ప్రత్తివిత్తులు
పణతి ఆ సీతమ్మ విత్తనాలు వడికట్టె
సీతయెద పట్టంగ శ్రీరాముడు గొర్రుపట్టు
రంభయెద పట్టంగ రఘురాముడు గొర్రుపట్టు

## అయోధ్య రామయ్య

అయోధ్య రామయ్య అన్నయ్య మాకు
వాలుగన్నుల సీత వదినమ్మ మాకు
రాములంతటివాడు రట్టుపడ్డాడు
మానవులకెట్లమ్మ మాట పడకుండ
సీతమ్మ రామయ్య దారిగదిలితె
పారిజాతపు పువ్వులు పలువరించినవి
సీత పుట్టగ నేల లంక చెడనేల
లంకకు విభీషణుడు రాజుగానేల
ఏడు ఏడూ యేండ్లు పదునాలుగేండ్లు
ఎట్టులుంటివి సీత నట్టడవిలోను
లక్ష్మయ్య నా మరిది రక్షిస్తూ ఉండ
నాకేమి భయమమ్మ నట్టడవిలోను
దేవుడంతటివాడు జననింద పడెను
మానవుడెంతయ్య మాటపడకుండ
అన్నదమ్ములులేక ఆదరులేక
తోడులేకా సీత దూరమైపోయె
దండమ్ము దండమ్ము దశరథరామ
దయతో మముగావు దాక్షిణ్యధామ

## సిరిమల్లె చెట్టు

సీతమ్మవాకిటా చిరుమల్లెచెట్టు
చిరుమల్లెచెట్టేమొ చితుకపూసింది
చెట్టుకదలాకుండ కొమ్మ వంచండి
కొమ్మ విరుగాకుండ పూలు గోయండి
పట్టి పూలూ కోసి బుట్ట నిలపండి
అందులో పెదపూలు దండగుచ్చండి
దండతీసుకువెళ్ళి సీతకియ్యండి
దాచుకో సీతమ్మ రాముడంపేడు
దొడ్డిగుమ్మంలోన దొంగలున్నారు
దాచుకో సీతమ్మ దాచుకోవమ్మ
దాచుకొంటేను దోచుకుంటారు

## సీతమ్మ మార్గం

చిన్నారి పొన్నారి చిలుకవే నీవు
చిట్టిమామడిపండు హంసవే నీవు
శ్రీరామ అల్లుడు సీత అల్లుడు
రావయ్య పెద్దన్న రాజు అల్లుడు
రాజు పుట్టాదన్ని రాజ్యాలు నీకెరుక
పన్నెండు రాజ్యాల పట్టానికెరుక
రాముడు లేడటే రాత్రి సభలోను
నిద్రయెట్టాపట్టింది నీకు సీతమ్మ
అన్నలారా! మీరు విన్నార లేదా
ఆలిమీద పెండ్లి విన్నార లేదా
అత్తిల్లు ఒకటైన పుట్టిల్లు ఒకటి
అవి రెండు దప్పితే అడవిమార్గంబు

## దశావతారాలు



మా పాప మామల్లు మత్స్యావతారం
కూర్చున్న తాతల్లు కూర్మావతారం
వరసైన బావల్లు వరహావతారం
నట్టింట నాయత్త నరసింహావతారం
వాసిగల బొట్టెల్లు వామనావతారం
పరమ గురుదేవ పరశురామావతారం
రక్షించు మామయ్య రామావతారం
బంటైన బంధువుల బలభద్రావతారం
చిట్టినాకసోదు శ్రీకృష్ణావతారం
బుద్ధితో మాచిట్టి బుద్ధావతారం
కలివిడితో పసిపాప వర్ధిల్లు నాతండ్రి

## కంచి కామాక్షమ్మ

కంచికిపోతావా కృష్ణమ్మా
ఆ కంచి వార్తలేమి కృష్ణమ్మా
కంచిలో ఉన్నది అవ్వ
ఆ అవ్వ నాకు పెట్టు బువ్వ
బువ్వ ఉన్నదిగాని కృష్ణమ్మా
నీకు పప్పు ఎక్కడదోయి కృష్ణమ్మ
కోమటి ఇంటిది అప్పు
ఆ అప్పునాకు పెట్టు పప్పు
పప్పు ఉన్నదిగాని కృష్ణమ్మా
నీకు కూర ఎక్కడిదోయి కృష్ణమ్మ
దొడ్లోను ఉన్నది బీర
ఆ బీరనాకు పెట్టుకూర.
కూర ఉన్నదిగాని కృష్ణమ్మా
నీకు నెయ్యి ఎక్కడిదోయి కృష్ణమ్మ
కోమటి అక్కెమ్మ చెయ్యి
ఆ చెయ్యినాకు పోయి నెయ్యి
నెయ్యి ఉన్నదిగాని కృష్ణమ్మా
నీకు పెరుగు ఎక్కడిదోయి కృష్ణమ్మ
ఉన్న ఇంటి ఇరుగు పొరుగు
ఆ పొరుగునాకు పోయు పెరుగు
బువ్వతిందువుగాని కృష్ణమ్మా
నీకు ఆ వూళ్ళో పనియేమి కృష్ణమ్మ
అక్కడ ఉన్నది అమ్మ
నేను మొక్కివత్తును కామాక్షమ్మ

2

కొండలో ఉండే సిన్నోడా – నీకు
కూరేడ కద్దురో సిన్నోడా!
కుమ్మరోనింటిలో కుండమ్మా
కుండ గిండమ్మ నాకంత కూరమ్మా!

కూడు కలిగీన సిన్నోడా – నీకు
పప్పేడ కద్దురో సిన్నోడా!
అప్పడాలమ్మే కుప్పమ్మా!
కొప్పు తిప్పితే నాకంత పప్పమ్మా!

పప్పులు గలిగినా సిన్నోడా – నీకు
చారేడ కద్దురా సిన్నోడా!
సీమతో పోయే యేరన్నా!
ఏరు పెరికితే నాకింత చారన్నా!

చారు కలిగినా చిన్నోడా! నీకు
నెయ్యేడ కద్దురో సిన్నోడా!
కుక్కను కొట్టే కొయ్యమ్మా!
కొయ్య గియ్యమ్మ నాకింత నెయ్యమ్మా!

నెయ్యి గల్గినా సిన్నోడా! – నీకు
పెరుగేడ కద్దురో సిన్నోడా!
ఆ యింటి యీ యింటి పెరుగమ్మా!
పెరుగు గిరుగమ్మ నాకింత పెరుగమ్మా!

పెరుగు గల్గినా సిన్నోడా! – నీకు
పాలేడ కద్దురా సిన్నోడా!
ఆవులా మేపే బాలన్నా
బాల గీలన్న నాకంత పాలన్నా!

పాలు గలిగినా సిన్నోడా! – నీకు
వక్కేడ కద్దురా సిన్నోడా!
అడవిలో పొయ్యే నక్కన్నా!
నక్క గిక్కన్న నాకంత వక్కన్నా!

వక్క గల్గినా సిన్నోడా – నీకు
ఆకేడ కద్దురా సిన్నోడా!
ఆకసాన పొయ్యే కాకమ్మా!
కాకి గీకమ్మ నాకంత ఆకమ్మా!

ఆకు గల్గినా సిన్నోడా! – నీకు
సున్న మేడ కద్దురా సిన్నోడా!
ఆ యింటి యీ యింటి సూరమ్మా!
సూర గీరమ్మ నాకంత సున్నమమ్మా!

సున్నము కల్గినా సిన్నోడా! నీకు
పొవ్వాకు ఏదిరా సిన్నోడా!
సెట్టుమీద వుండే పిట్టన్నా!
పిట్ట గిట్టన్న నాకంత చుట్టన్నా!

**బూచమ్మ కూతురు**

బూచమ్మ కూతుర్ని నేనేనా?
బుద్ధిమంతురాలిని నేనేనా?
ఆకులు పోకలు నావేనా?
ఆవులు గేదెలు నావేనా?
అందెలు కడియాలు నావేనా?
అద్దగోడమీద బెల్లంముక్క
అందిపుచ్చుకో బూచమ్మ
బూచమ్మ కూతుర్ని నేనేగా –
బుద్ధిమంతురాలిని నేనేగా
ఆకులు పోకలు నాకేగా
అందెలు కడియాలు నాకేగా
ఆవులు గేదెలు నాకేగా
తోలుకు రారా చిన్నన్న
దొడ్డిని కట్టరా పెద్దన్న
తలుపూతీయ్ పెద్దొదినా
పాలూ పితుకూ చిన్నొదినా

## బంతి



చేతిలో చామంతి – చిన్నారి బంతి
చుక్కల మండలం – మా చేతిబంతి
చక్కని చంద్రుణ్ణి – చేరేటిబంతి
ఒక్కసారి విసరి – ఊరెల్లబంతి
చెక్కు చెదరకుండ – చేతికొచ్చింది

## చిట్టి చిట్టి

చిట్టి చిట్టి మిరియాలు
చెట్టుక్రింద పోసేరు
పుట్టమన్ను త్రవ్వేరు
బొమ్మరిల్లు గట్టేరు
బొమ్మరింట్లో పిల్లపుడితే
పిల్ల తలకి నూనెలేదు
నా తలకి నూనె లేదు
అల్లావారింటికి చల్లకు వెళితే
ఆళ్లావారి కుక్క భౌ మంది
కాళ్ళాగజ్జలు ఘుళ్ళుమన్నాయి
చంకాపిల్ల కారుమంది

**2**

చిట్టి చిట్టి మిరియాలు
చెట్టుక్రింద బోసారు
బొమ్మరిల్లూ కట్టారు
బొమ్మల పెళ్ళిల్లు చేశారు
వియ్యపురాలికి నూనేలేదు
వియ్యపురాల్తో వచ్చినదానికి
నెయ్యిలేదు

**3**

గాకం గక్కచ్చి
(ఊటో రమ్మన్న)
ఏడుస్తే వెలక్కాయ
ఊరుకుంటె ఊరగాయ
తోటకు నీళ్లొస్తే
(ఎన్నిపండ్లు పెడతావు)
ఏతాం తోడతాను

**4**

చిట్టీ చిట్టీ ముత్యాలు
చెట్టూక్రిందా పోయించి
ఆరబోసి తెప్పించి
అంది పుచ్చుకు యిప్పించి
శ్రీరాముని పిలిపించి
సీతమ్మ కిప్పించి

**5**

చిట్టి చిట్టి మిరియాలు
చెట్టుక్రింద బోసి
పుట్టామన్నూ తెచ్చి
బొమ్మరిల్లు గట్టి
బొమ్మరింట్లో బొమ్మ నీళ్ళాడితే
బొమ్మతలకు నూనెలేదు
బొమ్మబిడ్డకి నెయ్యిలేదు

అంతట్లోనే పెద్దన్నొస్తే
కాళ్ళచెప్పులు విడిపించి
కంచెడు పాయసము జుర్రించె

**చందమామ**

చందమామ చీరగట్టి
సన్నబియ్యం ఒళ్ళోపోసి
అమ్మా నేను చిన్నదాన్ని
అల్లుడొస్తే అంపాబోకు
మామవస్తే మళ్ళీ రమ్మను
చాకింటి మడతాలన్నీ
చాకలివాడు తేనేలేదు
చద్దికట్ట గుడ్డలేదు
సాగనంప పొద్దులేదు
ఇరుగు పొరుగు అక్కల్లారా
చుట్టుపట్ట సుదతుల్లారా
చూడవచ్చే పణతుల్లారా
తుసుక్కున తుమ్మండి
ఒకటే తుమ్ము ఆచ్చి !

2

చందమామ ఇల్లుకట్టి
సారెపప్పు ఒళ్ళోపోసి
అమ్మా నే చిన్నదాన్ని
అల్లుడొస్తే అంపబోకు
తోపుల్లో ఉండే ఆవుల్లారా గోవుల్లారా
అమ్మమ్మ నీ మొగుడి పేరేమిటి?
నీళ్ళల్లో నిమ్మపండు
పాలల్లో పనసపండు

3

చందమామ చల్లగుంటె
మాబ్రఱ్రి పాలిస్తే
పాలెత్తుకెళ్ళి తాతకిస్తే
తాతనాకు దమ్మిడియిస్తే
దమ్మిడెత్తుకెళ్ళి కోమటికిస్తే
కోమటినాకు బెల్లం పెడితే
బెల్లం ఎత్తుకెళ్ళి పంతులకిస్తె
పంతులునాకు పద్యం చెపితె
పద్యమెత్తికెళ్ళి మామకిస్తె
మామనాకు పిల్లనిస్తె
పిల్లపేరు మల్లిమొగ్గ
నాపేరు చిటపటాలు

4

చందమామ – చల్లాగుండ
తాతానాకూ – దమ్మీడిస్తే
దమ్మిడీ తీసికెళ్ళి – కోమటికిస్తే
కోమటి నాకు – బెల్లం పెట్టే
బెల్లం తీసికెళ్ళి – గుఱ్ఱానికిస్తే
గుఱ్ఱం నాకూ – సలాం చేస్తే
సలాం తీసికెళ్ళి – పంతులుకిస్తే
పంతులునాకూ – పద్యం చెప్తే
పద్యం తీసికెళ్ళి – మామకిస్తే
మామానాకూ – పిల్లానిస్తే
పిల్లా పేరూ – మల్లెమొగ్గా
నాపేరూ – జమీందార్

**చిలకమ్మ పెండ్లి**

చిలకమ్మ మొగుడెంతొ శింగారమయ్యే
చెలికత్తెలందరు చెంతకూర్చుండి

సీతాకోకలు చీరలు తెచ్చిరి
కాకులు మూకలు బాకాలూద
పందిట పిచికలు సందడిచేయ
కప్పలు బెక బెక డప్పులు కొట్ట
చిలుకమ్మ మగనితోచేరి కూర్చుండె

**బాలకృష్ణుడు**

శ్రీపతి కృష్ణమ్మ రేపల్లెలోను
పాపడై పెరిగెను బహువిధంబుగాను
అంతకంతకు ముద్దు యశోదకును
వింతలుగ జూపెనే వేడ్క నొకనాడు
ఓయమ్మ! ఓతల్లి! ఓ గోపిదేవి
ఎన్నో నోములు నోచి నిను గంటికృష్ణ
గోవింద గొల్లపల్లెకు బోకుమయ్య
గోపికలు నినువచ్చి కొట్టుదురు కృష్ణా

**2**

ఓరుగుండా నుంచి ఒక వీధినుంచి
వచ్చెను గొల్లాపె పండ్ల గంపతో
వాకిట్లో దింపవే ఓ పళ్ళగంప
మంచి పంచదార పోసేముగాని
పారిపోయి అబ్బాయి పండెత్తుకొచ్చె
తిట్టకవె ముసలాపె దీవించవమ్మ
కొట్టకవె గొల్లాపె కొడుకుల్లతల్లి
మాబిడ్డ దుష్టని ఊరంత తెలుసు
రుద్రాక్షపండైతే రూకలిచ్చాను
మామిడిపండ్లయితే మాడలిచ్చాను
దీవించు కృష్ణున్ని దీవించుతల్లి

**పెళ్ళిగొడవ**

రాయాకు పాపమ్మ ఆడవే పాప
రాజులందరుగూడి చూడవచ్చేరు
చూడవచ్చినవారు ఏమి తెచ్చారు?
పట్టాభి వుంగ్రాలు పెళ్ళి బటువులు
నన్నుగన్నాతల్లి చీరెట్టవమ్మ
పమిటికి రత్నాల పేరెట్టవమ్మ
పేరుకీ పెట్టెలతో సొమ్మెట్టవమ్మ

**కోతిబావ**



కోతీబావకు పెళ్ళంట
కొండాకోనా విడిదంట
కుక్కా నక్కల విందంట
ఏనుగు వడ్డన చేయునట
ఎలుగూ వింత చూచునట
కోడీ కోకిల కాకమ్మ
కోతీ పెళ్ళికి పాటంట
నెమళ్ళు నాట్యం చేయునట
ఒంటెలు డోలూ వేయునట
ఊరంతా శుభలేఖలట
వచ్చేవారికి విందులట
పెళ్ళి పీటలపై కోతీబావ
పళ్ళికిలించునట

**బొమ్మల పెళ్ళి**

చిట్టి బొమ్మల పెళ్ళిచెయ్య వేడుక
శ్రీరెండు వాకళ్ళు సిరితోరణాలు
గాజుగుమ్మాలను రత్నకంబళ్ళు
అరటి స్తంభాలనీ అమరెపెళ్ళిరుగు
పసిబాలపాపిటలో పచ్చనక్షత్రము
చిన్నన్న పెట్టేడు చింతాకుచీర
పెద్దన్న పెట్టేడు పెట్టెళ్ళసొమ్ము
నాయన్న పెట్టేడు నానుతోపుస్తి
నా బొమ్మ వెళ్ళింది దబ్బలుదాటి
నా బొమ్మ వెళ్ళింది నిమ్మలుదాటి
నా బొమ్మ వెళ్ళింది తోటల్లుదాటి
నా బొమ్మ వెళ్ళింది అత్తవారింటికి

**2**

చాలా చాల చెక్కిళ్ళూ
చెయ్యరానీ బొమ్మల్లూ
నీబొమ్మ పేరేమి?
సీతమ్మ శ్రీరాములు
చక్కనికీలు కడియాలూ
ఎవరు చేయించారు?
శ్రీరాములు చేయించారు
సీతమ్మ పెట్టుకుంది

**3**

చిట్టిబొమ్మా పెళ్ళి చేయవేడుకా
శ్రీరెండువాకిళ్ళు సిరితోరణాలు
గాజుగంభాలనే బూజుగంబళ్ళు
అరటిస్తంభాలనే అమర పెళ్ళిళ్ళు
చిన్నన్న పెట్టేడు చింతాకుతీగ
పెద్దన్న పెట్టేడు పెట్టెల్ల సొమ్ము
నా అక్క పెట్టింది నానుతోపుస్తె
గతిమడక పెట్టించి ఘంటవాయించి
అత్తకందుల మిచ్చి తాగుర్రమెక్కే
గుర్రముమీదికీ కూతుర్ని తేరే
కూతురీ ముందరికి కురువేరు తేరే
నన్నుగన్న తల్లికీ నానుతేరమ్మా
నాతికీ ముత్యాలబొట్టు తేరమ్మా
బోటికీ బొమ్మంచు చీర తేరమ్మా
చీరకీ చిలకలారవికె తేరమ్మా
రవికెకూ రత్నాలపుస్తె తేరమ్మా
పుస్తెకూ పూలతాళికా బెట్టిరా
సారిచీరాబెట్టి సాగనంపెరా

**4**

చిట్టిబొమ్మల పెళ్ళి - చేయ వేడుకలు
శ్రీరెండు వాకిళ్ళు - సిరితోరణాలు
రంగు గుమ్మముముందు రత్నకంబళ్ళు
పసిబాల తలమీద - పచ్చ అక్షతలు
అరటి స్తంభాలతో - అమరె పెళ్ళరుగు
చిన్నన్న పెట్టేడు - చింతాకు చీరె

**5**

చిట్టిబొమ్మల పెండ్లి చేయవలెననగా
శృంగార వాకిళ్ళు సిరితోరణాలు
గాజు పాలికలతో గాజుకుండలతో
అరటిస్తంభాలతో అమరె పెండ్లరుగు

**6**

తాటియాకుకు కాటికాబొట్టు పెట్టె
చీర సింగారించి షోకు జేశారు

గాజు పూసలపేరు మెళ్ళోవేశారు
గౌరి కళ్యాణాల రేఖ దిద్దారు
పానకం బిందెలూ సిద్ధపరచారు
పాప పేరంటాండ్రు కాచుకున్నారు
లక్కపిడతలో అన్నముడికిపోయింది
లక్కచట్టిలో పప్పు ఉడికిపోతోంది
పెళ్ళికూతురు మామ కట్నాలకోసం
చింతగింజలు లెఖ్ఖపెట్టి దాచాడు
ఉత్తుత్తి అలజడి జరిగీ పోతోంది
ఉత్తుత్తి బాజాలు మ్రోగుతున్నాయి
కబురుమీదా కబురు వెళ్ళిందికాని
పెళ్ళికొడుకులవారు తర్లిరాలేదు

**7**

గోరుచిక్కుడుగాయ గెలవేసినట్లు
గోత్రాన అబ్బాయి నేరికిస్తాము
ఎవరికిస్తామమ్మ ఎవరికిస్తాము
కులములో మేనత్త కూతురికిస్తాము
అత్తమంచిదైతే అనుకూలమైతే
బాలుడు లేతయితే పట్టినిచ్చేము
పాపమా అబ్బాయి పాలకేడిస్తే
పాడియావులు పంపిరి మేనమామల్లు
రాజుల్లబోలిన మామలుంటే
రచ్చల్లు నేలంగ సందేహమేమి?

**8**

తాటాకు బొమ్మకు కాటుకెట్టి
చీరసింగారించి పోతు చేశారు
గాజు పూసలపేరు మెళ్ళో వేశారు
పాపపేరంటాళ్ళు కాచుకున్నారు
చుట్టపక్కాలంత వచ్చియున్నారు
పానకపు బిందెలు తెచ్చియున్నారు

**కొండమీద**

కొండమీద వెండిగిన్నె
కొక్కిరాజు కాలువిరిగి
విరిగి విరిగి రెండాయె
వీధుల్లో మూడాయె
పటమట చుక్కలు పండేయి
భళ్ళున తెల్లారె

**2**

కొండమీద గుండెజారె
కొక్కిరాజు కాలువిరిగె
దానికేం మందు, వేపాకు చేదు
వెల్లుల్లిగెడ్డ నూనెమ్మ బొడ్డు
నూటొక్క ధార

**3**

కొండమీద గుండుపై కొంగ
కొంగ కొరకు దొంగ
పొంచియుండ పాము
దొంగ కాలు కరిచే

**4**

కొండమీద వెండిగిన్నె
కొక్కిరాయి కాలువిరిగె
దానికేమి మందు?
వేపాకు చేదు వెల్లుల్లి గడ్డ
నూనెలో మడ్డి నూటొక్కసారి
పూయవోయి నూరి పూటకొక్కసారి

### కాదరయ్య

పొద్దన్నె లేచినాడు కాదరయ్య
వాడు కాళ్ళు మొగము కడిగినాడు కాదరయ్య
కాళ్ళు మొగము కడిగినాడు కాదరయ్య
వాడు పంగనామ బీకినాడు కాదరయ్య
పంగ.. పంగనామ బీకినాడు కాదరయ్య
వాడి సద్ది సంగడి దిన్నాడు కాదరయ్య
సద్దిసంగడి తిన్నాడు కాదరయ్య
సద్ది... వాడు బుట్టసంకకేసినాడు కాదరయ్య
బుట్టసంకకేసినాడు కాదరయ్య
వాడు పల్లెదోవ బట్టినాడు కాదరయ్య
పల్లెదోవబట్టినాడు కాదరయ్య
పల్లెకుక్క బౌవ్వమనె కాదరయ్య
పల్లెకుక్క బొవ్వమనె కాదరయ్య
వాడు అడ్డదోవ దొక్కినాడు కాదరయ్య
అడ్డదోవదొక్కినాడు కాదరయ్య
సద్దసేను ఎదురాయె కాదరయ్య
సద్దసేను ఎదురాయె కాదరయ్య
వాడు ఇరిసిరిసి బుట్లోబెట్టె కాదరయ్య
ఇరిసిరిసిబుట్లోబెట్టె కాదరయ్య
సేను రెడ్డి కూతలుబెట్టె కాదరయ్య
నేను గువ్వలు దోలుతా దనుకుంటే కాదరయ్య
గువ్వలుగాదు గివ్వలుకాదు కాదరయ్య
వాడు గొడ్డుదంటు బీక్కుండె కాదరయ్య
గొడ్డుదంటు బీక్కుండె కాదరయ్య
నేను చెరకిత్తడనుకుంటి కాదరయ్య
చెరక్కాదు గిరక్కాదు కాదరయ్య
వాడు – నేలకొంగ బీకినాడు కాదరయ్య
నేలకొంగ బీకినాడు కాదరయ్య
నేను పేనులుజూత్తాడనుకుంటె కాదరయ్య
పేనులుగాదు గీనులుకాదు కాదరయ్య
వాడు మంచి గుంజకాల బీకె కాదరయ్య
మంచి గుంజకాలబీకె కాదరయ్య
నేను ఉయ్యాలూపుతా దనుకుంటె కాదరయ్య
ఉయ్యాలగాదు గియ్యాలగాదు కాదరయ్య
వాడు ఊపూపి అంటుకుంటె కాదరయ్య
ఊపూపి అంటుకుంటె కాదరయ్యా
వాడు దావులు దావలురికి వాడుకాదరయ్య

అనంతపురం జిల్లాకు చెందిన ఈ పాటను హాస్య భారతి అమళ్ళదిన్నె గోపీనాథ్ వేలసభలలో పాడి అలరిస్తున్నారు)

### గాజులు : కడియాలు

చేతినిండా గాజులెవరి కందమ్మ
చేయెత్తి పెట్టేటి చెలియ కందమ్మ
అందెలు కడియాలు ఎవరి కందమ్మ
అడుగుదీసడుగెట్టు అక్క కందమ్మ

### తల్లీ తండ్రీ

ఉంగరమ్ములు పెట్టి ముంగురులుదువ్వి
వద్దపెట్టుకు తల్లి ముద్దులాడింది
పలక బలపములిచ్చి పద్యాలుపాడి
సరస పెట్టుకు తండ్రి చదువు నేర్పాడు

### ముత్యాలు

విశాఖ పట్నాన విసిరింది గాలి
వింజరపు రేవున్న తేలింది వాడ
వర్తకుడి పోసిన్న దినుసు పేరేమి
వాడలో పోసిన్న దినుసు పేరేమి
వర్తకుడు అబ్బాయి వాడనావాడ
వాడలో పోసిన్న దినుసు ముత్యాలు

## అల్లారు ముద్దుపాప



చిన్ని మా అమ్మాయి శ్రీముఖము చూడు
సిగ్గుపడి జాబిల్లి పొడవగా వెరచు

పందిట్లో అమ్మాయి పాకుతూ ఉంటే
పనసపండని జనులు పరుగులెత్తేరు

దొడ్లోను అమ్మాయి దొర్లాడుతుంటే
దోసపండని జనులు దోసిలొగ్గేరు

నీలాలు కెంపులు నిలువువజ్రాలు
నిత్యమూ అమ్మాయి నీళ్ళాడుచోట

పగడాలు రత్నాలు పారిజాతాలు
పడతి మా అమ్మాయి పని చేయుచోట

ఆడగా ముద్దమ్మ పాడగా ముద్దు
అందరికి మా అమ్మ అల్లారుముద్దు

## బొమ్మరిల్లు

చెంబెడు నీళ్ళు తెచ్చాము
పెంకుల బెడ్డలు కూర్చాము
నల్ల మన్నును కలిపాము
బొమ్మరిల్లును కట్టేము
తాటాకు బొమ్మలు చేశాము
బొమ్మకు బట్టలు కట్టేము
ఆకుబూరలు ఊదేము
ఇరుగుపొరుగును పిలిచాము
బంధుగులెల్లరు వచ్చారు
పెళ్ళికి విందులు చేశాము

## బండోయమ్మ బండి

బండోయమ్మ బండి–బండికి కుచ్చులుతెండి
సుబ్బారాయుడి పెండ్లి–చూచివద్దాంరండి
అమ్మనాకు బువ్వ–అరచేతిలో గవ్వ
నీళ్ళమీద నిప్పు–అల్లరిపిల్లల ఒప్పు
చేయబోకు తప్పు–చేస్తే కాలిచెప్పు

**2**

బండోయమ్మ బండి పదహారుకుచ్చులబండి
సుబ్బారాయుడు పెండ్లి చూచివద్దాము రండి
ఆకు వక్కలు తెండి అడిగివద్దాము రండి
అమ్మన్నాకు బువ్వ అరచేతిలో గవ్వ
అందరూ నీకు డిల్ల కొప్పులో కోడిపిల్ల
దానికొప్పు యెడంకాలు చెప్పు

## కాకీ - కాకీ

కాకీ కాకీ! కలుముల కాకీ!
కాకి నాకు కడియాలిస్తే
కడియాలెత్తి అమ్మకు యిస్తే
అమ్మనాకు అటుకులుపెడితే
అటుకులుయెత్తి పంతులుకిస్తే?
పంతులునాకు పాఠం చెపితే
పాఠం మామకు చదివినిపిస్తే
మామ నాకు పిల్లనిస్తే
పిల్లపేరు మల్లిమొగ్గ
నా పేరు జాగీరుదార్

**2**

కాకి నాకు దీపమిచ్చె
దీపమెత్తి అవ్వకిస్తి

అవ్వ నాకు అడ్డిగలిచ్చె
అడ్డిగలెత్తి యెనుము కిస్తె
ఎనుము నాకు పాసియిచ్చె
పాసి ఎత్తి తురుక్కుయిస్తి
తురక నాకు తురాయి యిచ్చె
తురాయి ఎత్తి దొరకు యిస్తి
దొర నాకు దొరతనమిచ్చె

**3**

కాకీ కాకీ కడవల కాకీ
కాకిని పట్టుకు గంగలో ముంచితే
గంగ నాకు గంధామిచ్చె
గంధం తీసుకెళ్ళి ఆవుకి రాస్తే
ఆవు నాకు పాలూ యిచ్చె
పాలుతీసుకెళ్ళి అమ్మకిస్తే
అమ్మానాకు రొట్టియిచ్చె
రొట్టి తీసుకెళ్ళి మాష్టారుకిస్తే
మాష్టారు నాకూ చదువుచెప్పే
చదువూ తీసుకెళ్ళి మామకిస్తే
మామానాకు పిల్లానిచ్చే
పిల్లాపేరు మల్లిమొగ్గ
నా పేరూ జమీందార్

**5**

పిట్టదంచింది పిడికెడు బియ్యం
కాకిదంచింది కడివెడు బియ్యం
అమ్మాయి దంచింది బస్తాడు బియ్యం
రాజులకందరికీ విందాయెనూ

**6**

కాకమ్మా! కాకమ్మా
చుట్టాలొచ్చారు చూచిపో
పక్కా లొచ్చారు పారిపో
నీ కాలికి గజ్జకడతా
కాలుతీసి ఖంగున గంతెయగ
చందమామబొట్టు
నాసందిటికేసి కట్టు
ఊళ్ళో ఉంటే ఒట్టు
నీవు వచ్చినదారిని బట్టు

**పాపాయి**

ముందుబోయిన మీనాక్షి
చిన్న ఇంటికి దీపము వెలిగించితిమి
చేతిలోబిడ్డ ఉన్నాది
బిడ్డను క్రింద విడిచిపెట్టి
ఒక చెయ్యి అంబలి త్రాగేసి
నోటిలో తాటిబెల్లము వేసికొని
రొమ్మున తట్టుకొనిరా
ఏమి గుంటలో మునిగితివి
తామరగుంటలో మునిగితిని
మా ఇల్లంత బంగారమాయెను పో పో

**2**

ఆకు వక్క సున్నం సుడి
అరిటా బొరిటా టాం టపాకాయ
అత్తయ్యచెవులో ముత్యాలుబోసి
కోడలిచెవిలో కొబ్బరిపెట్టి
తురుముకు రావే చక్కని పాపా

**అబ్బాయి - అమ్మాయి**

చిక్కుడాకుమీద చిలుక వాలింది
చిలుకెక్కి ఓ రాజు చిక్కి ఉన్నాడు
అరిటాకుమీద హంస వాలింది
హంసెక్కి ఓరాజు అమిరి ఉన్నాడు

కొబ్బెరాకుమీద గోర వాలింది
గోరెక్కి ఓరాజు కోరి ఉన్నాడు
మామిడాకుమీద మంచు వాలింది
మంచెక్కి ఓరాజు పొంచి ఉన్నాడు
గుమ్మడాకుమీద గువ్వ వాలింది
గువ్వెక్కి ఓరాజు గూడొగ్గినాడు
చిక్కుడాకుమీద చిలుక అబ్బాయి
చిలుకెక్కి అబ్బాయి చిక్కి ఉన్నాడు
అరటి ఆకుమీద హంస అబ్బాయి
హంసెక్కి అమ్మాయి అమిరి ఉన్నాది
కొబ్బెరాకుమీద గోర అబ్బాయి
గోరెక్కి అమ్మాయి కోరి ఉన్నాది
మామిడాకు మీద మంచు అబ్బాయి
మంచెక్కి అమ్మాయి పొంచి ఉన్నాది
గుమ్మడాకుమీద గువ్వ అబ్బాయి
గువ్వెక్కి అమ్మాయి గూడొగ్గినాది

## కాకి శకునం

కాకూలమ్మా కర్రాలమ్మా
చుట్టాలమ్మా పక్కాలమ్మా
సాయంత్రానికి చుట్టాలొస్తే
ఖరెల్ని గంతెయి కాకమ్మా
కాళ్ళాకి గజ్జెలు కడతా
ముక్కూకి ముత్తెం పెడతా
ఏడడుగులు ఎదురూవెళ్ళి
కబురూ తేవే కాకమ్మ
కావూ కావూ కాకూలమ్మ
మా ఇంటికి చుట్టాలొస్తే
పరుగూ పరుగున ఎదురూపోయి
కలసీరావే కాకమ్మా
తోడూలేదూ నీడాలేదూ
ఒంటిగ యింట ఉన్నాన్నమ్మా
మావారు వస్తూవుంటే
గబుక్కున గంతెయి కాకమ్మా
వంటా అంతా అయ్యేనమ్మ
వడ్డిద్దామని ఉన్నాన్నమ్మ
వస్తారా రారా మా ఇంటీ
వారూ చెప్పూ కాకమ్మా
మడిగట్టుకుని పెరటీలోనా
మాటా శకునం అడిగేసరికి
దండెం గెడమీదా అరుస్తూ
గంతేసింది కాకమ్మా
కాకమ్మా గంతూవేసి
కావూ కావని అరిచేటంతలో
చెప్పులజోడూ చప్పుడువింటూ
సీతా పొంగిపోయింది

## చీమకథ

చీమ యొకటి నీటిలోన
చిక్కుపడుచు నుండగా
పావురమొకటి పుడక విడిచి పార్వైచే నీటిలో
దానిమీద ఎక్కి చీమ దరికిజేరే
ఒక్కనాడు వేటగాడు పట్టువిడుచు వేళ
చీమ గట్టిగాను కుట్టె
బాణము గురితప్పగా పావురం పారిపోయె
అప్పుడిద్ద రానందించిరి

## ఇల్లాలు

వంటయిల్లు దిద్దేటీ కోలు ఓ అత్తగారూ
మా అన్నలొచ్చారూ కోలు మమ్మంపరమ్మా
మీ అన్నలొస్తేనూ కోలు ఏమి తెచ్చినారే?

నాకు నల్లచీర కోలు నెమలడుగు రవికె
పాపకు పట్టంగీ కోలు పాలుత్రాగు గిన్నె
వారికి ఎంబ్లాషా కోలు అంగీలాజోడూ
అత్తకు పట్టుచీరె కోలు అద్దాలరవికే
మామకు పట్టంచు కోలు మడతల శాలువలూ
అయితే నేనెరుగా కోలు మీబావేగానీ
భారతం చదివేటి కోలు బావగారండీ
మా అన్నలొచ్చారూ కోలు మమ్మంపారండీ
మీ అన్నలొస్తేనూ కోలు ఏమి తెచ్చినారూ?
నాకు నల్లచీర కోలు నెమలడుగురవికె
పాపకి పట్టంగీ కోలు పాలుత్రాగూ గిన్నె
వారికి ఎంబ్లాషా కోలు అంగీలాజోడూ
అత్తకు పట్టుచీరె కోలు అద్దాలరవికె
మామకు పట్టంచు కోలు మడతల శాలువలూ
అయితే నే నెరుగ మీ అక్కొగాని

## గౌరమ్మ

ఒక్కొక్క పోకందునే గౌరమ్మా
ఒక్కకట్ట ఆకులందు
తీగల్లాగౌరి మొగ్గల్లాగౌరి
గందాన కలికోట మొలకొన్నగౌరి
బంతిపూలు బాలాటమే గౌరమ్మ
బాలలకు బెండ్లాటమే
ఏమేమి పూవందురే గౌరమ్మ
ఏమేమి కాయయందురే
గుమ్మడీ పూవందురే గౌరమ్మ
గుమ్మడీ కాయందురే
గుమ్మడీ పూవులో
గుమ్మడీ కాయలో
ఆటచిలుకలు రెండు
పాటచిలుకలు రెండు
కందూరు మేడలో
కలికి చిలుకలు రెండు
అంగప్ప రంగరథమూ నారమ్మ
బంగారు పూలరథమూ

## కోలాటం పాటలు

నలుపు నలుపనియేరు
నవ్వేరు జనంలెల్లా
నలుపూ నారాయణుడూ
నలుపుగాదా
గరుడూ గంగాపురము
శివుడూ ధరియించేటి నీలవరణము కడవా
నలుపూ గాదా
ఇరిజాజి తోటలో
ఏదిగిన్ని మల్లెలకు వాలిన్ని తుమ్మెదలె
నలుపూ గాదా

## 2

రాచూరి సున్నమందూ గౌరమ్మా
రాయ బారమందునూ
నిన్ను చూచి మా అన్నల్లూ గౌరమ్మా
ఏడు మేడలెక్కిరీ
ఏడు మేడలలోపలా – గౌరమ్మా
దొంగలేమొ దోచిరి
దొంగలతో నేమందునూ – గౌరమ్మా
దొరలతో ఏమందును
బంట్లకూ బయ్యారమూ గౌరమ్మా
బాలలతో బెండ్లాటము

3

ఒక్కొక్క అక్షింతలూ - గౌరమ్మా
ఒక్క మల్లె సొరెలూ
సన్న దీపాలలో గౌరమ్మా
చిన్న చిటివత్తులు
నీలాటి రేవువద్ద గౌరమ్మా
నీ నోము నీకుజెల్లె
నీ నోము నీకుజెల్లె - గౌరమ్మా
నా నోముఫలము జెప్పు
తపుకుతో తపికెడూ
ముత్యాలు తీసికొని
గుమ్మడీ కుచ్చులా
సొమ్ములూ పెట్టుకొని
వీధినా పెండ్లాడవే - గౌరమ్మా
వాడనా పెండ్లాడవే

4

ఒక్కొక్క పువుగోసి రాసిపడవేసి
రాసిగొల్తాము రావే రత్నాలగౌరి
ఆవూలు ఎరుపైన
అమర్తాము తెలుపైనా
పిండేటి దుత్తాలే నలుపూగాదా

సుక్కాలు తెలుపైన
సూర్యుడు ఎరుపైనా
సూసేటి నయనాలే నలుపూగాదా

ధాన్యంబు ఎరుపైన
దగసంబు తెలుపైన
దంచేటి రోకండ్లే నలుపూగాదా

వడ్లన్ని ఎఱ్ఱంగా
వరికూడు తెల్లంగా
వండేటిబానాలు నలుపూగాదా

5

కోలాటంబుల వేయుదమా -
కోరికతీరగ మనమందరము
చాల సంతోషంబుగను -
సభికులు మెచ్చెడి తీరుగను
గుప్పు గుప్పున గంతులువేస్తూ -
ఒప్పుగ జడలు వేయుదమా
ఒప్పుగా వేసిన జడలన్ని -
ఓపికతోడుద విప్పుదమా
సరిగరి సరిగరి యనుచు -
సభ్యులు మెచ్చెడి రీతిగను
రత్నగిరి కోలాటము -
రమ్యముగను వేయుదము
రత్నగిరి కోలాటము -
రమ్యముగను వేయుదము
కూడిపాడి వేడ్కతోడ ఆడుదాం పాడుదాం
ఆడుదం పాడుదం
రారే చెలియలార రంజిల -
కోలాటంబులు వేయుదము
ఆడుదం పాడుదం అందరముగూడి
మునగకాయ నువ్వు కాయ జడలల్లుదాము
మనము వలవేసి నిచ్చెన వేయుదము
సంతోషముతో గూడి యాడరే సఖియలార
వంతపాటతోడ యాడరే వరుస జడలు
విప్పివేయరే

నాకు నల్లచీర కోలు నెమలదుగు రవికె
పాపకు పట్టంగీ కోలు పాలుత్రాగు గిన్నె
వారికి ఎంబ్లాషా కోలు అంగీలాజోడూ
అత్తకు పట్టుచీరె కోలు అద్దాలరవికే
మామకు పట్టంచు కోలు మడతల శాలువలూ
అయితే నేనెరుగా కోలు మీబావేగానీ
భారతం చదివేటి కోలు బావగారండీ
మా అన్నలొచ్చారూ కోలు మమ్మంపారండీ
మీ అన్నలొస్తేనూ కోలు ఏమి తెచ్చినారూ?
నాకు నల్లచీర కోలు నెమలదుగురవికె
పాపకి పట్టంగీ కోలు పాలుత్రాగూ గిన్నె
వారికి ఎంబ్లాషా కోలు అంగీలాజోడూ
అత్తకు పట్టుచీరె కోలు అద్దాలరవికె
మామకు పట్టంచు కోలు మడతల శాలువలూ
అయితే నే నెరుగ మీ అక్కెగాని

## గౌరమ్మ

ఒక్కొక్క పోకందునే గౌరమ్మా
ఒక్కకట్ట ఆకులందు
తీగల్లాగౌరి మొగ్గల్లాగౌరి
గందాన కలికోట మొలకొన్నగౌరి
బంతిపూలు బాలాటమే గౌరమ్మ
బాలలకు బెండ్లాటమే
ఏమేమి పూవందురే గౌరమ్మ
ఏమేమి కాయయందురే
గుమ్మడీ పూవందురే గౌరమ్మ
గుమ్మడీ కాయందురే
గుమ్మడీ పూవులో
గుమ్మడీ కాయలో
ఆటచిలుకలు రెండు
పాటచిలుకలు రెండు
కందూరు మేడలో
కలికి చిలుకలు రెండు
అంగప్ప రంగరథమూ నారమ్మ
బంగారు పూలరథమూ

## కోలాటం పాటలు

నలుపు నలుపనియేరు
నవ్వేరు జనంలెల్లా
నలుపూ నారాయణుడూ
నలుపుగాదా
గరుడూ గంగాపురము
శివుడూ ధరియించేటి నీలవరణము కడవా
నలుపూ గాదా
ఇరిజాజి తోటలో
ఏదిగిన్ని మల్లెలకు వాలిన్ని తుమ్మెదలె
నలుపూ గాదా

### 2

రాచూరి సున్నమందూ గౌరమ్మా
రాయ బారమందునూ
నిన్ను చూచి మా అన్నల్లూ గౌరమ్మా
ఏడు మేడలెక్కిరీ
ఏడు మేడలలోపలా – గౌరమ్మా
దొంగలేమొ దోచిరి
దొంగలతో నేమందునూ – గౌరమ్మా
దొరలతో ఏమందును
బంట్లకూ బయ్యారమూ గౌరమ్మా
బాలలతో బెండ్లాటము

**3**

ఒక్కొక్క అక్షింతలూ - గౌరమ్మా
ఒక్క మల్లె సారెలూ
సన్న దీపాలలో గౌరమ్మా
చిన్న చిటివత్తులు
నీలాటి రేవువద్ద గౌరమ్మా
నీ నోము నీకుజెల్లె
నీ నోము నీకుజెల్లె - గౌరమ్మా
నా నోముఫలము జెప్పు
తపుకుతో తపికెడూ
ముత్యాలు తీసికొని
గుమ్మడీ కుచ్చులా
సొమ్ములూ పెట్టుకొని
వీధినా పెండ్లాడవే - గౌరమ్మా
వాడనా పెండ్లాడవే

**4**

ఒక్కొక్క పువుగోసి రాసిపడవేసి
రాసిగొల్తాము రావే రత్నాలగౌరి
ఆవూలు ఎరుపైన
అమర్తాము తెలుపైనా
పిండేటి దుత్తాలే నలుపూగాదా

సుక్కాలు తెలుపైన
సూర్యుడు ఎరుపైనా
సూసేటి నయనాలే నలుపూగాదా

ధాన్యంబు ఎరుపైన
దగసంబు తెలుపైన
దంచేటి రోకండ్లే నలుపూగాదా

వడ్లన్ని ఎర్రంగా
వరికూడు తెల్లంగా
వండేటిబానాలు నలుపూగాదా

**5**

కోలాటంబుల వేయుదమా -
కోరికతీరగ మనమందరము
చాల సంతోషంబుగను -
సభికులు మెచ్చెడి తీరుగను
గుప్పు గుప్పున గంతులువేస్తూ -
ఒప్పుగ జడలు వేయుదమా
ఒప్పుగా వేసిన జడలన్ని -
ఓపికతోడుద విప్పుదమా
సరిగరి సరిగరి యనుచు -
సభ్యులు మెచ్చెడి రీతిగను
రత్నగిరి కోలాటము -
రమ్యముగను వేయుదము
రత్నగిరి కోలాటము -
రమ్యముగను వేయుదము
కూడిపాడి వేడ్కతోడ ఆడుదాం పాడుదాం
ఆడుదం పాడుదం
రారే చెలియలార రంజిల -
కోలాటంబులు వేయుదము
ఆడుదం పాడుదం అందరముగూడి
మునగకాయ నువ్వు కాయ జడలల్లుదాము
మనము వలవేసి నిచ్చెన వేయుదము
సంతోషముతో గూడి యాడరే సఖియలార
వంతపాటతోడ యాడరే వరుస జడలు
విప్పివేయరే



వెయ్యి గంధపుచెక్క ఓరాచ గుమ్మడీ
ఏ రాజు పంపినాడే ఓరాచ గుమ్మడీ
తియ్యాలేదు పుయ్యాలేదు ఓ రాచగుమ్మడీ
తీసి బొట్టుపెట్టలేదు ఓ రాచగుమ్మడీ
మాయదారి అల్లుడట ఓ రాచగుమ్మడీ
మాయల్ల కృష్ణుడట ఓ రాచగుమ్మడీ
గొల్లవారి అల్లుడట ఓ రాచగుమ్మడీ
గోపాలకృష్ణుడట ఓ రాచగుమ్మడీ
మేడమీద రుక్మిణీదేవికి ఓ రాచగుమ్మడీ
కృష్ణమూర్తి పంపినాడే ఓ రాచగుమ్మడీ

### 6

ఒక్కొక్క ముత్యమ్ము బందారుదాకా
ఒక్క ముత్యపు సరులూ బందారుదాకా
గంధమక్షింతలు బందారుదాకా
ఇంత కోటంత కోటా గౌరమ్మా
రాచూరు పల్లెకోటా
పల్లెకోటాలెక్కి పత్రులూ కోయంగ
బంగారు గుండ్లవారే గౌరమ్మ
బాల పేరంటాండ్లమూ

### 7

గొ: గొల్లవారి వాడలాకు కృష్ణమూర్తీ!
నీవేమి పనులకు వచ్చినావు
కృష్ణమూర్తీ! ||గొ||
కృ: పాలు కొన వచ్చినానె గొల్లభామా
మంచి పాలు పోపి పంపు
గొల్లభామా! ||పా||
గొ: కొత్త కోడలనయ్యా నేను కృష్ణమూర్తీ!
మాయత్తగారి నడుగుమయ్యా
కృష్ణమూర్తీ! ||గొ||
కృ: కొత్తకోడ లౌతేనేమే గొల్లభామా!
నా రొక్క మిచ్చి పుచ్చుకొంటే
గొల్లభామా ||పా||
గొ: నీ రొక్కము మాకొద్దయ్య కృష్ణమూర్తీ!
నీవు రొంపు చేయక మళ్ళుమయ్యా
కృష్ణమూర్తీ! ||గొ||

## చిలకమ్మ పెళ్ళి

చిలకమ్మ పెళ్ళి అని - చెలికత్తెలందరూ
చెట్లు సింగారించి - చేరి కూర్చున్నారు
పందిట పిచ్చుకలు - సందడి చేయడ
కాకుల మూకలు - బాకాలూదగ
కప్పలు బెకబెక - డప్పులు కొట్టగ
కొక్కొరొకోయని - కోడికూయడా
ఝుమ్మని తుమ్మెద - తంబుర మీటగా
కుహూకుహూ యని - కోయిల పాడగా
పిల్లతెమ్మెరలు - వేణువూదగా
నెమలి సొగసుగా - నాట్యం చేయగా
సాలీడిచ్చిన చాపు కట్టుకొని
పెళ్ళి కుమారుడు బింకము చూపగ
మల్లీమాలతి - మాధవీ లతలు
పెళ్ళి కుమారుని - పెండ్లి కూతురిని
దీవిస్తూ తమ పూవులు రాల్చగ
మైనా గోరింక మంత్రము చదివెను
చిలకమ్మ మగడంత - చిరునవ్వు నవ్వుతూ
చిలకమ్మ మెడకట్టె - చింతాకుపుస్తె




# పొడుపు కథా గేయాలు



గేయరూపంలో కూడ పొడుపు కథలుండడం విశేషం. తెలుగు సాహిత్యంలో పొడుపు కథా గేయాలకు సముచిత స్థానం ఉంది. పొడుపు కథలు ఎద లోతులను తాకి మేల్కొల్పుతాయి. జ్ఞానోదయాన్ని కలిగిస్తాయి. ఆలోచనకు ప్రేరకాలుగా, జ్ఞాపక శక్తికి దోహదాలుగా ఉంటాయి. మనో వికాసాన్ని పెంచుతాయి. అనేక కొత్త విషయాలను తెలియజేస్తాయి. వ్యంగ్యాన్ని వ్యవహార జ్ఞానాన్ని పెంపొందిస్తాయి తెలంగాణా, రాయలసీమ ప్రాంతాలలో ఇంకా అపారంగా పొడుపు కథలు ప్రచారంలో ఉన్నాయి. ఇవి గేయరూపంలో, పద్యరూపంలో కూడ ఉన్నాయి. పొడుపు కథలు పిల్లలకు, పెద్దలకు అందరికీ ఆలోచనీయాలు, హాస్య, వినోద గుళికలు. పొడుపు కథా గేయాలు చాల భాగం కాల గర్భంలో కలిసిపోయాయి. కొద్దిగా మాత్రం నేటికి మిగిలి అనేక మార్పులకు లోనైనాయి. వీటిలో మచ్చుకు ఈ దిగువ కొన్ని ఉదాహరిస్తున్నాం. (విడుపులు చివర ఉన్నాయి గమనించండి.)

1 అంతులేని చెట్టుకు అరవై ఆరు కొమ్మలు
కొమ్మ కొమ్మకు కోటి పువ్వులు
అన్నిపువ్వుల్లో రెండే కాయలు

2 అంభాల మీద కుంభాలు
కుంభాల మీద కుడిత్తొట్టి
కుడిత్తొట్టి మీద గుండ్రాయి
గుండ్రాయి మీద పచ్చగడ్డి
పచ్చగడ్డిలో ఆవులు మేస్తున్నాయి.

3 అడవిలో పుట్టింది, అడవిలో పెరిగింది
పాడు పాములు వచ్చి, పైన పడ్డాయి
రాజు ఇంటికొచ్చింది, రాజుపై కెక్కింది
చెంబులో నీళ్ళన్ని, చెడ తాగి పోయింది
చెప్పితే నీ నోరు, గప్పుమంటుంది
తప్పితే నీ నోరు, చప్పగుంటుంది

4 అమ్మా! అమ్మా! పెంచావు, అల్లీ బిల్లిగ నుంచావూ
పెద్దదాన్ని చేశావూ, పెనిమిటి వూసు మరిచావూ
ఇంత నేను ఈడేరే, ఈ రాత్రే కూడేమా?
ఈడేరిన ఇల్లాల్నీ, ఎత్తి పెట్టకో యిల్లాలా!
కల్లాగాదు కాపొచ్చు, కాంతా! నిన్నూ మదిమెచ్చు
తల్లీ! తల్లీ! తలపట్టూ, తెల్లారితే తీసెట్టూ

5 అరచేయంత పట్టణం తలలేని తలారివాడు
మొలలేని పెళ్ళాం చేతుల్లేని కూతురు
అంచుల్లేని గుండిగ పట్టుకొని గట్టులేని చెరువుకు నీళ్ళకెళ్ళింది
వేళ్ళులేని గరికను కాళ్ళ లేని లేడి మేస్తుందే
కూతురొచ్చి తండ్రికి చెప్పింది, తండ్రి కత్తితో కొట్టని కర్ర పట్టుకెళ్ళి
కాళ్ళు లేని లేడిని కొట్టి తెచ్చి కట్టేశాడు. దాన్ని ముక్కులేని కాకి
ఎత్తుకొనిపోయి ఊరులేని పాటి మీద మూడు రోజుల పూట తిన్నది

6 ఆకాశమంతా అల్లుకురాఁగా
తెల్లని బియ్యం చల్లుకురాఁగా
కడివెడు నీళ్ళు కారుతూరాఁగా
చాటెడు చెక్కులు చెక్కుకురాఁగా
అందులో వదిహరాజు అల్లల్లాడాడూ

7 పండుకాని పండు పండు వెన్నెల చెండూ
పువ్వుకాని పువ్వూ పూసుకుంటే నవ్వూ
కట్టె కాని కట్టె కరేపాకు జుర్రా
గొడుగుకాని గొడుగూ కోరరాని పిడుగూ

8 పిఠాపురం చిన్నవాడా! పిట్టల వేటకాడా!
వేటకయితే వెళ్ళుతున్నావు కాని అడవికి వెళ్ళరాదు
వెళ్ళితే తుపాకి మందు కూరరాదు - కూరితే గురి చూడరాదు
చూచితే తుపాకి పేల్చరాదు
పేల్చితే పిట్టను కొట్టరాదు, నీచు లేకుండా రారాదు.

9 రాచావారికి నచ్చే చిన్నదీ
రాజ్యాలెల్లా మెచ్చే నన్నదీ
బంగారు వారింటి కోడలూ
పట్టుకుంటే రాదు బేడలూ
చేంతాడుతో తోడకుండా
చెంబుతోనూ ముంచకుండా
నీటుగాను కుల్కుతున్నదీ
నీళ్ళుతెస్తా నంటువున్నది

10 రాజమండ్రివారి ఆడపడుచా, రఘుపతి కోడలా
నీళ్ళకైతే వెళుతున్నావుగానీ, నూతి దగ్గర కెళ్ళరాదు
వెళితే చేద విప్పరాదు, విప్పితే నూతిలో వేయరాదు
వేసితే నీళ్ళు తోడరాదు, తోడితే బిందె పోయరాదు
నీళ్ళు లేకుండా రారాదు.

11 వంకర టింకర మానూ
వయ్యారి మానూ
రాజు లెక్కే మానూ
మా ఊరొచ్చే మానూ
కాపు లెక్కే మానూ
కష్టజీవుల మానూ
ఎత్తుకు తిరిగే మానూ
ఇంతల పెండ్లికానూ

12 వంకర టింకర - శొ
వాడి తమ్ముడు - అ
నల్లని పిల్లా - మి
నాకేమిస్తావు - తే
నాలుగు కాళ్ల - మే

13 వచ్చేవు పొయ్యేవు నా కొరకూ
వంగికూచున్నాను నీ కొరకూ
వైసు చూపుతావూ నా కొరకూ
కాసుకోనున్నాను నీ కొరకూ
సగము చచ్చున్నాను నీ కొరకూ
యిఘను చస్తున్నాను నీ కొరకూ

14 ఎడ్డారం బుజ్జీ, వడ్డారం బుజ్జీ,
నా బిడ్డకు చోటిస్తావా?
వడ్డారం బుజ్జీ, వడ్డారం బుజ్జీ
వడ్డారం వడ్డలేను
నలుగురికి నాలుగు గదులు
రెండు రెండు సరిపోయాయి

15 విసనగిరి పట్నాన వీధెంత సక్కన
వీధిలో వుండే పడుచెంత సక్కన
పడుచు తొడిగిన రైకెంత సక్కన
రైకలో ఉండే గుబ్బెంత సక్కన
గుబ్బధార తాగినోడెంత సక్క

16 సుట్ల సుట్ల బావికాడా
సుందరమ్మ తోటకాడా
ఆకు పుట్టె పోక పుట్టె
కొడుకును కొట్టేసి -
కోడలు ముండమోసె

**విడుపులు**

1 ఆకాశం, చుక్కలు, చంద్రుడు, 2 కాళ్ళు, పిరుదులు, పొట్ట, తల, జుట్టు, పేలు, 3 గంధపు చెక్క, 4 మల్లె మొగ్గ, 5 బండ, 6 గానుగ, నే విడుపు 7 విభూతి పండు, 8 కోడిగుడ్డు, 9 కొబ్బరి కాయ, 10 కొబ్బరి కాయ, 11 పల్లకి, 12 శొంఠి, అల్లం, మిరియం, తేనె, మేక, 13 గాలం, 14 ..........., 15 చాలు, ఆముదం మొక్క కాయ, గింజ, పాప, 16 అరటి చెట్టు.




సూక్తులంటే మంచి మాటలు. మనోజ్ఞమైన పలుకులు వీటిలో ధార్మికత్వం ఇమిడి ఉంటే సుభాషితాలంటారు. సూక్తులలో విపులార్థం చిన్న వాక్యంలో ఉంటుంది. వీటిని మననం చేయడం వలన మనసుకు, బుద్ధికి, ఆత్మకు వికాసం కలుగుతుంది. శుద్ధి కలుగుతుంది. సూక్తుల సేకరణలో విశేష పరిశ్రమ చేసిన తెలుగు రాజు పెనుమత్స సత్యనారాయణరాజుగారు వాటి ఉపయోగాన్ని గురించి ఈ విధంగా చెప్పారు. సూక్తులు-

1 బలహీనులకు బలాన్నిస్తాయి
2 బీరువుకు ధీరత్వాన్నిస్తాయి
3 దుఃఖితులకు సంతోషాన్ని కలిగిస్తాయి
4 లోభికి త్యాగబుద్ధి కలిగిస్తాయి
5 విరోధులకు అన్యోన్య మైత్రిని కలిగిస్తాయి

కనుక ఇవి సాహిత్య సౌందర్యానికి సుమనోహరమైన అలంకారాలు. బాలలకు సంబంధించినవి కొన్నిటిని వేటూరి ప్రభాకరశాస్త్రిగారు సేకరించి "బాలభాష" గ్రంథంలో చేర్చారు.

విద్య లేకుంటేను
విభవమ్ము రోత
వినయమ్ము లేకుంటె
విద్యలూ రోత.

కృష్ణమ్మ వంటివాడు
కొడుకొకడు పుడితే
కష్టాలు కడతేరు
కన్న తల్లులకు.

ఇలాంటివి ప్రచారంలో ఎన్నో ఉన్నాయి. వీటిని సేకరించి సమయానుకూలంగా ఉపయోగిస్తే పిల్లల ప్రవర్తనలో మార్పు రావడానికి వీలుంది.

తెలుగువారి ఆచార వ్యవహారాలను, శ్రేష్టతను మనః ప్రవృత్తులను తెలిపే పలుకుబడులు, పదాలు రాయలసీమ ప్రాంతంలో బాగా ఉన్నాయి. తమిళంలో అవ్వయ్యార్ పదాలు ఎంత విలువగలవో తెలుగులో కూనలమ్మ పదాలకు అంతటి విలువ విశిష్టత ఉంది

జప తపంబులకన్న
చదువు సాములకన్న
ఉపకారమే మిన్న ఓ కూనలమ్మా!

అన్న మిచ్చినవాని
నాలి నిచ్చినవాని
నవహసించుట హాని ఓ కూనలమ్మా!

ఇలాటి వింత పద చిత్రాల మాటలు ఈ కవితలో ఉంటాయి. ఆరుద్ర తనదైన శైలిలో కూనలమ్మ పదాలు రాశారు. ఇవి ఇతిహాసిక గుళికెలేకాదు వేదాంత మకరంద సింధువులు. సాహిత్య మధు బిందువులు.

ఈ గేయాలలో పై వర్గాలలో చేరని మరికొన్ని గేయాలు కూడ ఇందు చేర్చబడ్డాయి

## మంచి మాటలు




ఒంటికణతా నొప్పి వరగాలు తీపు
పంటిపోటూ వద్దు పగవాడికైనా

**2**

విద్య లేకుంటేను విభవమ్మురోత
వినయమ్ము లేకుంటె విద్యలూరోత

**3**

నిదురలో ప్రాణమ్ము అదరునో యేమొ!
నిష్టురాలేలమ్మ కష్టజీవులపై?

**4**

ఓచేడెకూ తగిలె మోచేతిదెబ్బ
అత్తింటి సౌఖ్యమని అంగలార్చింది

**5**

మారుతల్లీ చేత మాటపడలేక
సారంగధరుడమ్మ చావుకొప్పాడు.

**6**

కృష్ణమ్మవంటివాడు కొడుకొకడు పుడితే
కష్టాలు కడతేరు కన్నతల్లులకు.

**7**

బియ్యమ్ము తెల్లన్న పిండి తెల్లన్న
వరుసతప్పినవాని వలికి తెల్లన్న.

8

వరుసగానిదాన్ని వరుసలాడేవు
పాపాత్మ నీ శిరసు టక్కున్న పగులు.

9

కాలినిండా గుడ్డవెయ్యంది రోత
కాని వాళ్ళ కన్నెత్తి చూచింది రోత

10

మంచిగంధపు చెక్క సానసేచీకు
మంచాలి దేహమ్ము మనసులోచీకు

11

ఆయుస్సు మూడిననూ ఆకు చిరిగిననూ
బ్రతికించువారెవరు అతుకువారెవరు?

**కూనలమ్మ**

జప తపంబులకన్న
చదువు సాములకన్న
ఉపకారమే మిన్న ఓ కూనలమ్మా!

అన్నమిచ్చినవాని
నాలి నిచ్చినవాని
నపహహించుటహాని ఓ కూనలమ్మా!

మగని మాటకు మాటి
కెదురు పల్కెడు పోటి
మృత్యు దేవతపాటి ఓ కూనలమ్మా!

కాపువాడే రెడ్డి
గరికపోచే గడ్డి
కానకుంటే గుడ్డి ఓ కూనలమ్మా!

కవితారసపుజల్లు
ఖడ్గాల గలుగల్లు
కరణాలకేచెల్లు ఓ కూనలమ్మా!

దుర్యోధనుడు భోగి
ధర్మరా జొక జోగి
అర్జునుండే యోగి ఓ కూనలమ్మా!

భీష్ముడనుభవశాలి
భీముడే బలశాలి
కర్ణుడే గుణశాలి ఓ కూనలమ్మా!

ఆడి తప్పినవాని
నాలి నేలనివాని
నాదరించుట హాని ఓ కూనలమ్మా!



# మెదడుకు మేతనిచ్చే పొడుపు కథలు

అందమైన చెరువులో
ముద్దంకి పిట్ట
మూతికి బంగారం
తోకతో నీరు తాగును 1

అందరాని వస్త్రంపై
అన్నీ వడియాలు 2

అండపిండ బ్రహ్మాండంలో
ఆబోతు రంకె వేస్తే
కుడి పిర్రకు తగులు
ఇక్కడ తగులు
అక్కడ తగులు
బోడి నెత్తికి తగులు
ప్రక్కనున్న వాని పంటికి తగులు 3

అంబాల మీద కుంభాలు
కుంబాల మీద కుడిత్తొట్టి
కుడిత్తొట్టిమీద గుండ్రాయి
గుండ్రాయి మీద కోరింతా
కోరింత మీద ఆరిక అవురూ
అవురు గడ్డిలో ఆవులు వేలూ 4

అంద చందాల వాడు
రోజు కో ఆకారం
చివరికి నిరాకారం
లేదా నిండు సున్న 5

అడపానికి ఆరు తిత్తు
పగడానికి బొక్కెడు నెత్తురు 6

అడవిలో ఆంబోతు రంకెవేసింది 7

అడవిలో సీతమ్మ
ముగ్గు వేస్తుంది 8

అడుగు లోతు మాను
అడవిలో మాను
అంతా చెక్కిన మాను
ఆ మాను కొట్టించి రాజు
యుద్ధ మాడు చున్నాడు 9

అతని పేరే జిల్‌జిల్
అతనికి మూరెడు తోక
అతను లేకుంటే ఊరంత పాడు 10

అది యేలెడు - దాని తోక బారెడు 11

అద్దు మానంలో పిట్ట తల పగిలె 12

"అన్న" కందవు
"అమ్మ" కందు తాయి 13

అన్నిటికన్నా రుచైన దేది ? 14

అన్నిటి కన్ననూ
వేగంగా పోయేది ఏది? 15

అన్ని దానాల్లోకి గొప్ప దానం 16

అబ్బాయి గారి దొడ్లో
పెద్ద బొప్పాయి పండు
పడితే పరుగెత్త లేక
పదిమంది చచ్చారు 17

---

1 ప్రమిద 2 నక్షత్రాలు 3 కోడిగుడ్డు 4 పేలు 5 చందమామ 6 కుంకుమ 7 గొడ్డలి 8 చీమల బారు 9 టేకు చెక్క 10 చీపురు 11 సూది, దారం 12 పత్తికాయ 13 పసుపు 14 అబద్ధం 15 మనస్సు 16 నిదానం 17 పిడుగు

అమారా దేశం నుంచి
తుమారా పండ్లు తెస్తే
కొనే వారే గాని తినేవారు లేరు 18

అమ్మ కడుపున పడ్డాను
అంతా సుఖాన ఉన్నాను
నీచే దెబ్బలు తిన్నాను
నిలువునా ఎండి పోయాను
నిప్పుల గండం తొక్కాను
గుప్పెడు బూడిద అయ్యాను 19

అమ్మ రెమ్మ లాడి
కూతురు కులుకు లాడి
కొడుకు కోప గాడు 20

అమ్మా నన్ను పెంచావు
పెద్ద దాన్ని చేశావు
ఈడొచ్చింది ఇంట్లో ఉన్నాను
ఎవరికైనా యిచ్చినా సరే
నువ్వెంచు కొన్నా సరే
తెల్లవారే సరికి పనికిరాను మరి! 21

అరంకణం గదిలో
అరవై మంది నివాసం 22

అరకట్టు, మరకట్టు
మరకు ముప్పయి కట్లు 23

అరచిన అరచును
మరి మాటాడను 24

అరణ్యంలో, మహారణ్యంలో
అక్కమ్మ జడవేసె 25

అరటి పండుకు ఉన్నాయి
అయిదు తుత్తులు 26

అరచేతి పట్నాన అరవై వాకిళ్ళు 27

అర్జునుడు, అద్దం పడు
భీముడు సిగపట్టు 28

అయ్య కొయ్యల మారి
అమ్మ గిచ్చుల మారి
బిడ్డలు రత్న మాణిక్యాలు 29

అలాము కొండకు సలాము కొట్టు 30

అవయవాలు కప్పియుంచు
తాకిన వస్తువులు చెప్పు
అందంగా అగుపించు
దాని పేరు చెప్పుకో 31

ఆకారము చూడ పక్షి
ఆకసమున తిరుగు చుండు
దాన్ని మనం ఎక్కచ్చు
ఎక్కడికైనా పోవచ్చు 32

ఆకాశం పచ్చన
నక్షత్రాలు తెల్లన 33

ఆకాశంలో అంబు
అంబులో చెంబు
చెంబులో చేరెడు నీళ్ళు 34

ఆకాశంలో అరవై గదులు
గది గదికీ ఒక సిపాయి
సిపాయికి ఒక తుపాకి 35

---

18 పగడం 19 పిడక 20 మిరపచెట్టు 21 మల్లెపూవు 22 అగ్గిపెట్టె 23 తేరు 24 ప్రతిధ్వని 25 తీగ 26 బొగడ గొట్టాలు 27 అద్దం 28 దూలం, స్తంభం 29 రేగు చెట్టు 30 గొడ్డలి 31 చర్మం 32 విమానం 33 పచ్చిమిరపకాయలు 34 టెంకాయ 35 తేనెపట్టు

ఈనదు కట్టదు
కడుపు నిండితే
ప్రజల కింత ఫలమిచ్చు 73

ఉత్తరం ఊరేగింది 74

ఉత్తరాన చెర్వు ఊరికినే నిండింది 75

ఉన్నచోట ఉండి
పరుల దాటింతురు
పయనమైన అపుడె
పయన మగుదు
నాకు కాళ్ళు రెండు
నరుడు కాళ్ళు రెండు 76

ఉపయోగించే కొద్ది
తరిగి పోతుంది
చివరకు రూపులేక
మాసి పోతుంది 77

ఉరుములు మెరుపులు
ఉటంగి బాణలు
కదలక మెదలక
పొదలో గుడ్లు పెట్టు 78

ఊరంతటికీ ఒకటే దుప్పటి 79

ఊరంత కలసి
చిప్పడు గుగ్గిళ్ళు తినలేరు 80

ఊళ్లో లేని మండలం 81

ఊళ్లో కలి, వీధిలో కలి
ఇంట్లో కలి, వంట్లో కలి 82

ఎండకు ఎండదు
వానకు తడవదు
అది లేకపోతే జరగదు 83

ఎండిన బావిలో
పిల్లలు గంతులేస్తారు 84

ఎంత కోసినా
మూరెడు ఉంటుంది 85

ఎంత వింత బండి
ఎగిరి పోయే బండి
మండుతూ మండుతూ
మాయ మయ్యింది 86

ఎంతెంత గుడి
ఈశ్వరుని గుడి
కొండంత గోపురం
కదలించలేము 87

ఎందరు ఎక్కిన విరగని మంచం
కదలదు జోగదు బెదరదు కూడ 88

ఎక్కడైన తిరుగు చుండు
పలికిన పలుకదు
నవ్విన నవ్వును
భయపడిన భయపెట్టు 89

ఎద్దులు పూనుకొని ఉంటే
పగ్గాలు మేస్తూ పోతాయి 90

ఎన్ని క్రోసులైన యిట్టే పోవు
ఎన్ని నదులైన యిట్టే దాటు
ఎన్ని కొండలనైన యిట్టే దాటు
దీని భావ మేమి? 91

---

73 చెరువు 74 పల్లకి 75 టెంకాయ 76 నిచ్చెన 77 సబ్బు 78 పుట్టగొడుగు 79 ఆకాశం 80 వడగళ్ళు 81 కమండలం 82 చాకలి, వాకిలి, రోకలి, ఆకలి 83 రూపాయి బిళ్ళ 84 పేలాలు 85 గూన 86 సూర్యుడు 87 ఆకాశం 88 అరుగు 89 దయ్యం 90 గుమ్మడి కాయ 91 రైలు బండి

ఎన్నో సరకుల మోస్తూ
ఎడారులలో తిరుగుచుండు
అలసట చెందదు
విసుగు చెందదు 92

ఎముకలేని జంతువు
ఏటికి నీళ్ల కొచ్చు 93

ఎవరు దిగని బావిలో
భీముడు దిగుతాడు 94

ఏటి నీటిన వెంపలి చెట్టు
ఎంత కోసినా గుప్పెడు కాదు 95

ఏడ్చు చున్న వారి
నిట్టె నవ్వించు
తెలియునా అదేదో 96

ఏ రాయి వద్దన్నా
ఆ రాయి కావాలి 97

ఐదక్షరములు గలిగి
ఆంధ్రముఖ్య పట్నమై
వెలయు సొంపు గాను 98

ఐదుగురు పతులుండు ద్రౌపది కాదు
మూల నల్లగ నుండు ముసలి గాదు
తల తోకా నుండు జీవి కాదు
మరి నా పేరేమి ? 99

ఒంకిరి టంకిరి – ఓ
నాలుగు గుడ్లు – మి
దాని తమ్ముడు – సొ
నాలుగు కాళ్ల – మే 100

ఒంటి కంటితో చూచే పక్షి 101

ఒంటి కాలివాడు
లావంటి తలకాయ
ఆకులన్నీ మేయు
రాజుల సభలోన
రంజిల్లు చుండు 102

ఒంటి కంటివాడు
ప్రాణం లేని వాడు
ప్రతి సృష్టి చేస్తాడు 103

ఒంటి స్తంభం మేడపైన
ఒప్పగు చలి పందిరి
చలువ నీటి కుండల్లో
చవులూనే మీగడ 104

ఒక చెట్టు ఉంది
చెట్టుకు నాలుగు కొమ్మలు
కొమ్మకు రెండు కాయలు 105

ఒక చెరువుకు నాలుగు తూములు
నాలుగు తూముల నుండి
తెలవారే సరికి
ఐదు పంటలు పండుతాయి 106

ఒక తిత్తిలో ముగ్గురు భక్తులు 107

ఒక మాను
మానుకు పదిరెండు కళలు
కళకు ముప్పది ఆకులు 108

ఒక సీసాలో రెండే రంగులు 109

జామ చెట్టు క్రింద జానమ్మా
ఎంత గుంజినా రాదమ్మా 110

---

92 ఒంటె 93 జలగ 94 తెడ్డు 95 పొగ 96 చాకొలేట్ 97 ఉప్పురాయి 98 హైదరాబాదు 99 పెన్ను 100 ఒకటి, మిరియాలు, సొంరి, మేక 101 కాకి 102 గంట 103 కెమెరా 104 లేత కొబ్బరి 105 తూర్పు, పడమర, ఉత్తరం, దక్షిణం, సూర్యుడు, చంద్రుడు 106 ఆవు–పొదుగు (పాలు, పెరుగు, మజ్జిగ, వెన్న, నెయ్యి) 107 ఆముదం కాయ 108 మాసాలు, దినాలు 109 గుడ్లు 110 నీడ



# భాషకు సొంపును, ఇంపునూ పెంచే సామెతలు

అంగట్లో అన్నీ వున్నాయి, అల్లుని నోటిలో శని వుంది.

అంత్యనిష్ఠూరం కంటె ఆదినిష్ఠూరం మేలు.

అంధునకు అద్దం చూపినట్లు.

అందరూ అందలమెక్కే వారైతే మోసే వారెవరు?

అందితే జుట్టూ అందకున్న కాళ్ళూ.

అక్క మనది అయితే బావ మనవాడా?

అగ్గిమీద గుగ్గిలం.

అగ్గికి వాయువు తోడైనట్లు.

అచ్చి పెండ్లి బుచ్చిచావుకు వచ్చినది.

అడ్డగోడ మీద పిల్లి.

అడిగినగాని అమ్మయైనను పెట్టదు.

అడిగేవానికి చెప్పేవాడు లోకువ.

అడుసు త్రొక్కనేల; కాలు కడుగనేల?

అత్త చచ్చిన ఆరునెల్లకు కోడలి కంటినీరు వచ్చింది.

అతివినయం ధూర్త లక్షణం.

అత్తలేని కోడలు ఉత్తమురాలు, కోడలులేని అత్త గుణవంతురాలు.

అత్తసొమ్ము అల్లుడు ధారవోసినట్లు.

అత్త ఒకరింటి కోడలే.

అదృష్టం కలసివస్తే ఆలు పెళ్ళామౌతుంది.

అనువుకానిచోట అధికుల మనరాదు.

అనుమానం ప్రాణసంకటం.

అనుమానం పెనుభూతం.

అప్పుచేసి పప్పుకూడు.

అప్పులేదు ఆస్తిలేదు.

అభంశుభం ఎరుగడు.

అబద్ధమాడినా గోడపెట్టినట్లుండాలి.

అమ్మబోతే అడివి కొనబోతే కొరివి.

అమ్మ పెట్టాపెట్టదు అడుక్కు తినానివ్వదు.

అయ్యరాకపోతే అమావాస్య అట్టేవుంటుందా?

అరచేతిలోనే వైకుంఠం చూపుతారు.

అరటిపండు వలిచి అరచేతిలో పెట్టినట్లు.

అరచే కుక్క కరవనేరదు.

అలవాటులో పొరపాటు.

అవ్వ కావాలి, బువ్వ కావాలి.

ఆకలి రుచి ఎరుగదు, నిద్ర సుఖ మెరుగదు, వలపు సిగ్గెరుగదు.

ఆటలో అరటిపండు.

ఆడలేక మద్దెల ఓటిదన్నాడట.

ఆ వూరి కీవూరెంతో ఈ వూరికావూరూ అంతే.

ఆరు మూడైనా, మూడు ఆరైనా సరే.

ఆరు నెలలు స్నేహం చేస్తే వీరు వారవుతారు.

ఆరోగ్యమే మహాభాగ్యం.

ఆలూ లేదు, చూలూ లేదు, కొడుకు పేరు సోమలింగం.

ఆలస్యం అమృతం విషం.

ఆవులిస్తే ప్రేగులు లెక్కపెట్టుట.

ఆవు చేలో మేస్తుంటే దూడ గట్టున మేస్తుందా?

ఆహార వ్యవహారములందు సిగ్గు కూడదు.

ఇంట గెలిచి రచ్చ గెలువు.

ఇంటి దొంగ నీశ్వరుడైనా పట్టలేడు.

ఇంటిలో ఈగల మోత, బయట పల్లకీల మోత.

ఇంట్లో పెండ్లయితే, వూళ్ళో కుక్కలకు హడావిడి.

ఇతరుల సొమ్ముకంటె విషం మేలు.

ఇతర్లను గురించి చెడ్డచెప్పేవాడెప్పుడూ తాను చెడ్డవాడై యుంటాడు.

ఇల్లాలు గ్రుడ్డిదైతే ఇంటికుండలకు చేటు.

ఇల్లుకట్టి చూడు, పెళ్లిచేసి చూడు.

ఇల్లు గెలవలేనివాడు రచ్చ గెలుచునా?

ఇల్లు అలుకగానే పండుగగునా?

ఇల్లుచూచి ఇల్లాలును చూడమన్నట్లు.

ఈ కంటికి ఈ రెప్పలు దూరమా?

ఈతచెట్టు యిల్లు కాదు, తాటిచెట్టు తల్లి కాదు.

ఉంగరాలచేతితో మొట్టితే నొప్పిఉండదు.

ఉట్టికెక్కలేనమ్మ స్వర్గానికెక్కునా?

ఉత్తరాన ఉరిమితే వాన తప్పదు, పాము తరిమితే కరవక తప్పదు.

ఉద్యోగం పురుష లక్షణం.

ఉన్నమాటంటే ఉలుకెక్కువ.

ఉపకారానికి పోగా అపకారం ఎదురైనట్లు.

ఉయ్యాలలో బిడ్డనుంచి ఊరంతా వెతికిందట.

ఉల్లి పదితల్లుల పెట్టు.

ఉల్లిచేసిన మేలు తల్లిచేయలేదు.

ఉసురువుంటే ఉప్పమ్ముకొని బతుకవచ్చు.

ఊరంతా చుట్టాలు, వుట్టికట్ట తావులేదు.

ఊరు పొమ్మంటుంది, కాదు రమ్మంటుంది.

ఊరంతా నాయనకు వణకితే, నాన్న అమ్మకు వణకినట్లు.

ఊళ్ళో పెండ్లికి కుక్కలకు హడావిడి.

ఋణ శేషం, వ్రణ శేషం, అగ్ని శేషం, శత్రు శేషం వుంచరాదు.

ఎంత చెట్టు కంతగాలి.

ఎంత ప్రొద్దువుండగా లేచినా, తుమ్మ గుంట వద్దనే తెల్లవారినది.

ఎక్కడనైనను బావా అనవచ్చుగాని, వంగతోట వద్ద బావా అనవద్దు అన్నాడు.

ఎక్కడవున్నావు కంబళి అంటే, వేసిన చోటనే వున్నాను గొంగళీ అన్నదట.

ఎద్దుతన్నునని భయపడి, గుఱ్ఱముచాటున దాగినాడట.

ఎనుబోతుమీద వానకురిసినట్లు.

ఎరనుచూపి చేపను లాగినట్లు.

ఎలుకకు పిల్లి సాక్షి.

ఎవరి వెర్రి వారికానందం.

ఎవరు త్రవ్వుకొన్న గోతిలో వారే పడతారు.

ఎవరికి వారే యమునాతీరే.

ఏకయి వచ్చి, మేకై బిగిసినది.

ఏ గాలికి ఆ చాప యెత్తినట్లు.

ఏనుగులను తినేవానికి పీనుగులు పిండి వంటలా?

ఏనుగుమీద ఈగ వ్రాలినట్లు.

ఏ పుట్టలో ఏ పామున్నదో ఎవరికెరుక.

ఏమీలేని ఆకు ఎగసెగసిపడితే, అన్నీవున్న ఆకు అణగిమణగి వుంటుంది.

ఏ యెండ కా గొడుగు పట్టరాదు.

ఏరుకొని తినేవాని వెంట గీరుకొని తినే వాడు పడినట్లు.

ఐశ్వర్యానికి అంతులేదు.

ఐసా, పయిసా.

ఒక దెబ్బకు రెండు ముక్కలు.

ఒకరిద్దర్ని చంపితేగాని వైద్యుడుగాడు.

ఒక అబద్ధం కమ్మడానికి వెయ్యి అబద్ధాలు ఆడాలి.

ఓడలు బళ్ళమీద, బళ్ళు ఓడలుమీద వస్తాయి.

ఓలి తక్కువని గ్రుడ్డిదానిని పెళ్ళాడితే నెలకు ముప్పైకుండలు పోగొట్టినట్లు.

కంచు మ్రోగునట్లు కనకంబు మ్రోగునా?

కండ్లకు గంతకట్టి అడవిలో విడిచినట్లు.

కంచే చేనుమేస్తే దిక్కేమిటి?

కందకులేని దురద, పెండలానికెందు కున్నట్లు.

కట్టె వంకర పొయ్యి తీర్చినట్లు.

కడవంత గుమ్మడికాయ, కత్తిపీటకు లొంగె.

కడుపా, చెఱువా?

కడుపుతో ఉన్న అమ్మ కనకా మానదు, పండుకొన్నమ్మ తినకా మానదు.

కడుపులో లేనిది, కౌగిలించుకుంటే వస్తుందా?

కడుపు చింపితే, కాళ్ళమీద పడును.

కడుపు నిండితే గారెలు చేదు.

కతికితే అతకదు.

కత్తిపోటు తప్పినా, కలంపోటు తప్పదు.

కత్తిమీద సాము.

కని పెంచినమ్మ కష్టం గొడ్రాలికేం ఎఱుక.

కనుమూసినంతసేపు పట్టదు.

కనుగొని రమ్మంటే కాల్చి వచ్చునట్లు.

కయ్యానికి కాలు దువ్వుట.

కర్రలేనివానిని గొర్రెయినా కరుస్తుంది.

కరిచేకుక్క మొరగదు, మొరిగేకుక్క కరవదు.

కరవులో అధికమాసమన్నట్లు.

కలిమిలేములు కావడికుండలు.

కలిగినవారికి అంతా చుట్టాలే.

కలకాలం బ్రతికినను కాటికి పోక తప్పదు.

కలుపుతీయని మడి, దేవుడులేని గుడి.

కల్యాణం వచ్చినా, కక్కువచ్చినా ఆగవు.

కష్టసుఖాలు కావడికుండలు.

కష్టే ఫలి

కాకిపిల్ల కాకికి ముద్దు.

కాకిముక్కున దొండపండులాగ.

కాకులను కొట్టి, గద్దలకు వేసినట్లు.

కాచినచెట్టుకు రాళ్ళదెబ్బలు.

కారణం లేకనే కార్యము పుట్టదు.

కాలికివేస్తే వేలికి, వేలికివేస్తే కాలికి.

కాలుగాలిన పిల్లివలె తిరుగుట.

కాలుజారితే తీసుకోవచ్చునుకాని, నోరు జారితే తీసికోలేము.

కాలికివేస్తే మెడకు, మెడకువేస్తే కాలికి.

కాళ్ళదగ్గరకు వచ్చిన బేరం, కాశికి వెళ్ళినా దొరకదన్నట్లు.

కీడెంచి మేలెంచవలెను.

కుక్క కాటుకి చెప్పుదెబ్బ.

కుక్కతోక పట్టుకొని గోదావరీదినట్లు.

కుక్కను చంపిన పాపం గుడికట్టినా పోదు.

కుంటి కులాసం, యింటికి మోసం.



కుమ్మరవీధిలో కుండలమ్మినట్లు.

కులహీనమైనను, గుణహీనం కాదు.

కూటికిపేదైతే, కులానికి పేదా?

కూదు కలిగినవాదు, కులము మరచినట్లు

కొండత్రవ్వి ఎలుకను పట్టినట్లు.

కొండనాలుకకు మందువేస్తే ఉన్న నాలుక వూడిపోయిందట.

కొండకు ఒక వెంద్రుక ముడివేస్తే, వస్తే కొండ వస్తుంది, పోతే వెంద్రుక పోతుంది.

క్రొత్తొకవింత, పాతొక రోత.

క్రొత్త బిచ్చగాదు ప్రొద్దెరుగదు.

కొఅవితో కొప్పు గోకికొనినట్లు.

కోటివిద్యలు కూటికొరకు యన్నట్లు.

కోతికి కొబ్బరికాయ దొరికినట్లు.

గంగలో మునిగినా కాకి హంస కానట్లు.

గంతకు తగిన బొంత.

గడ్డం కాలి ఒకదు ఏదుస్తుంటే, చుట్టకు నిప్పు యిమ్మని ఒకదు వెంబడించినట్లు.

గడుసువాదు మూడిందాల చెదును.

గతకాలం మేలు, వచ్చుకాలంకంటె.

గతిలేనమ్మకు, మతిలేని మగదు.

గ్రహచారం బాగాలేకపోతే, గుఱ్ఱం గాడిదై కూసినట్లు.

గాడిక్రింద పందికొక్కు.

గాలిలో దీపంపెట్టి, దేవుదా నీమహత్మ్యం అన్నట్లు.

గ్రుడ్డిలో మెల్ల.

గ్రుడ్డికన్ను మూసినా ఒకటే, తెరచినా ఒకటే.

గ్రుడ్డివానికి దీపం చూపినట్టు.

గ్రుడ్డువచ్చి, పిల్లను వెక్కిరించినట్లు.

గుందెలు తీసిన బంటు.

గుమ్మడికాయల దొంగ అంటే, భుజాలు తదుముకొన్నట్లు.

గుమ్మడికాయ పోయేదారి ఎరుగదు, ఆవగింజ పోయేదారి అట్టేపట్టిచూస్తాదు.

గ్రుడ్డికన్న, మెల్ల మేలు.

గురివిందగింజ తన క్రిందనున్న నలు పెరుగదు.

గురువుకు తగ్గ శిష్యుదు.

గురువుగారికే పంగనామాలు పెట్టేవాదు.

గుళ్ళు ప్రమింగేవానికి, గుడి లింగాలు లక్ష్యమా?

గొడ్రాలి కేంతెలుసు, బిడ్డనొప్పులు.

గొడ్రాలి తిట్టు, గొడ్డలి పెట్టు.

గొఱ్ఱెకు బెత్తెదే తోక.

గొఱ్ఱె కాచేవాణ్ణి నమ్మదు, కోసేవాణ్ణి నమ్ముతుంది.

గొఱ్ఱెలలో తోడేలు చొరబడ్డట్టు.

గోటితో మీటేది, గొడ్డళ్ళతో చీల్చనా?

గోడలకు చెవులుందును.

గోంగూరలో చింతకాడ వేసినట్లు.
గోతికాడ నక్కవలె.
గోరంతవుంటే, కొండంత చేస్తారు.
గోరుచుట్టుమీద రోకటిపోటు.
ఘటాలు శాశ్వతమా యన్నట్లు.
చంద్రునికొక నూలుపోగు.
చక్కదనానికి మా అక్క సంగీతానికి మా బావ.
చచ్చినవాడి పెండ్లికి వచ్చిందే కట్నము.
చచ్చినవాడు ఏడిస్తేమాత్రం వస్తాడా?
చచ్చేదాకా బ్రతికితే పెండ్లిచేస్తానన్నట్లు.
చచ్చిన పామును కొట్టేందుకు అందరూ బంట్లే.
చచ్చినవాని తల తూర్పుకుంటేనేమి, పడమటకుంటే నేమి?
చదువుకున్న వానికన్న చాకలిమేలు.
చదువవేస్తే ఉన్నమతి పోయినదట.
చదువ వేయనంతవరకూ కాకరకాయ, చదువేసిన తర్వాత కీకరకాయ.
చదివేది రామాయణం, కూలగొట్టేవి దేవస్థలాలు.
చద్దికూడుతిన్నమ్మకు, మగలిఆకలి తెలియదు.
చన్నీళ్ళకు వేడినీళ్ళు తోడు.
చల్లకువచ్చి ముంత దాచనేల?
చావుదప్పి, కన్ను లొట్టపోయినట్లు.
చావా చావనివ్వడు, బ్రతుకా బ్రతుక నివ్వడు.
చింత చచ్చినా పులుపు చావదు.
చిత్తశుద్ధిలేని శివపూజ లేలయన్నట్లు.
చిత్తకార్తెలో కుక్కలు.
చిన్ననాడు లేనిదే పెద్దనాడు వస్తుందా?
చిన్నపామునైనా, పెద్దకర్రతో కొట్టవలెను.
చుట్టమైవచ్చి దయ్యమై పీకేడట.
చుట్ట మాకలి మంచ మెరుగునన్నట్లు.
చుట్టమని చూడవస్తే, యింటివారంతా దయ్యాలై పట్టుకొన్నారట.
చూచిరమ్మంటే, కాల్చివచ్చేరకం.
చూడచూడ జాడలు వేరు.
చెట్టయి వంగనిది మ్రానై వంగుతుందా?
చెట్టుముందా, విత్తుముందా అన్నట్లు.
చెట్టులేనివూళ్ళో ఆముదపుచెట్టు మ్రాను.
చెడు కాలానికి చెడ్డబుద్ధులు.
చెట్టుపేరు చెప్పి, కాయలమ్ముకొన్నట్లు.
చెప్పుడు మాటలు చెడ్డవి.
చెప్పేవానికి వినేవాడు లోకువ.
చెరపకురా చెడేవు.
చెవిటివానివద్ద శంఖమూదినట్లు.
చేతులు కాలిన తరువాత ఆకులు పట్టుకొన్నట్లు.
చేసిన పాపము చెపితే పోవును.
చేసిన పాపము కాశికిపోయినా తీరదు.
జగమెరిగిన బ్రాహ్మణునకు జందెమేల?
జీతంలేని నౌఖరు, కోపంలేని దొర.
జోగీజోగీ రాసుకుంటే బూడిద రాలుతుంది.
డబ్బిస్తే కొండమీద కోతి దిగివస్తుంది.
డబ్బులేని డాబుసరియన్నట్లు.
తడిగుడ్డలతో గొంతుకు తెగకోస్తాడు.
తనబంగారం కాకపోతే వన్నెలేదు, వెరవూలేదు.

తనకుమాలిన ధర్మం, మొదలు చెడ్డ బేరం.
తనదాకవస్తే తగవే లేదు.
తనకోపమే తన శత్రువు.
తప్పులేనివాడు ధరణిలో ఉండడు.
తలప్రాణం తోకకు వచ్చింది.
తల్లిపుట్టిల్లు మేనమామకెరుక.
తల్లయినా అడుగనిది అన్నం పెట్టదు.
తల్లిదండ్రులకు మించిన పూజ్యులులేరు.
తాటాకు చప్పుళ్ళకు కుందేళ్ళు బెదురునా?
తాడితన్నేవాని తలతన్నే వాడొకడుండును.
తాతకు దగ్గులు నేర్పవలెనా.
తాను పట్టిన కోడికి నాలుగేకాళ్ళు.
తానుచెడినకోతి వనమంతా చెరచినట్లు.
తానొకటితలిస్తే, దైవమొకటి తలచినట్లు.
తావలచినది రంభ, తామునిగినది గంగ.
తిండికి తిమ్మరాజు, పనికి పోతురాజు.
తిన్నయింటి వాసాలు లెక్క పెట్టినట్లు.
తినగా తినగా గారెలు చేదెక్కినవి.
తినమరిగిన కోడి యిల్లెక్కి కూసినట్లు.
తిమ్మిని బ్రహ్మి, బ్రహ్మిని తిమ్మి చేశాడు.
తీగెకు కాయ బరువా?
తుమ్మితే ఊడే ముక్కు ఎన్నాళ్ళుండును?
తులసివనంలో గంజాయి మొక్క
మొలచినట్లు.
తెగించినవానికి తెడ్డే లింగం.
తెలివి తక్కువ ఆకలెక్కువ.
పండా కాయా?
పండినా ఎండినా పన్ను తప్పదు.
పంచెకేలరా ప్రత్తిధర.

పక్కలో బల్లెము.
పగటి మాటలు పనికిచేటు, రాత్రిమాటలు
నిద్రకుచేటు.
పచ్చగడ్డివేస్తే భగ్గున మండిపడుతున్నది.
పచ్చి వెలగకాయ గొంతుకపడ్డట్లు.
పట్టపగ్గాలు లేవు.
పదిమందితోటి చావు పెండ్లితో సమానం.
పదిమందిలో పడ్డపాము చావదు.
పనిచేయనివాడు యింటికి దొంగఅన్నట్లు
పనివాడు పందిరివేస్తే పిచ్చుకలు
పడద్రోసిన వన్నట్లు.
పనివానికడుపున తినేవాడు పుట్టినట్లు.
పని తక్కువ, పాకులాట యెక్కువ.
పల్లంవుండేచోట నీళ్ళు నిలుస్తవి.
పిండికొద్ది రెట్టె అన్నట్లు.
పిచ్చికమీద బ్రహ్మాస్త్రమా?
పిచ్చివాడికి లోకం అంతా పిచ్చే అనిపిస్తుంది.
పిట్టకొంచెము, కూత ఘనము.
పిలువని పేరంటానికి వెళ్ళినట్లు.
పిల్లికి భిక్షం పెట్టదు.
పిల్లికి ఎలుక సాక్షి.
పిల్లిని చంకబెట్టుకొని పెండ్లికి వెళ్ళినట్లు.
పుట్టుట గిట్టుట కొరకే.
పుండుకు పుల్ల మగడు.
పులినిచూచి నక్క వాతపెట్టుకొన్నట్లు.
పెండ్లి నడక నడిచినట్లు.
పెరుగుట విరుగుట కొరకే.
పేదవాని కోపం, పెదవికి చేటు.
పేనుకు పెత్తనమిస్తే, తలెల్లా తెగకొరికిందట.

పేరు గొప్ప ఊరు దిబ్బ.
పొట్టి వానికి పుట్టెడు బుద్ధులు.
పొదుగు కోసి పాలు త్రాగినట్లు.
పొమ్మనలేక పొగబెట్టినట్లు.
పొరుగింటి పుల్లకూర రుచి.
పోరు నష్టము, పొందు లాభము.
ప్రీతితో పెట్టినది పిడికెడు చాలును.
బూడిదలోపోసిన పన్నీరు.
బ్రతికియుండిన బలుసాకు తినవచ్చును.
భోజనానికి ముందు, స్నానానికి వెనుక.
మంచివానికి మరణమే సాక్షి.
మంచివానికి ఒకమాట, మంచి గొడ్డుకు ఒక దెబ్బ.
మంది యెక్కువైతే మజ్జిగ పలుచన.
మంచికిపోగా చెడ్డ ఎదురాయెనన్నట్లు.
మన్ను తిన్న పామువలె నున్నాడు.
మనస్సుంటే మార్గమున్న దన్నట్లు.
మనోవ్యాధికి మందు లేదు.
మతిలేని మాట, శృతిలేని పాట.
మనస్సుకు మనస్సే సాక్షి.
మనుష్యుడు పేద అయినా మాట పేద కాదు.
మసిపూసి మారేడుకాయ.
మాతృభాషను, మాతను గౌరవింపుము.
మితము తప్పితే అమృతమైనా విషమే.
ముందరికి వస్తే గొయ్యి, వెనుకకుపోతే నుయ్యి.
ముందున్నది ముసళ్ళపండుగ.
ముసుగులో గ్రుద్దులాట.
మూడునాళ్ళ ముచ్చట.
మూలిగేనక్క మీద తాటికాయపడ్డట్లు.
మెత్తనివానిని చూస్తే మొట్టబుద్ధి.
మెయ్యబోయి మెడకు తగిలించుకొన్నట్లు.
మెతుకులు చల్లితే కాకులకుకొదవా?
మేకులు పెరికిన కోతివలె.
మేడలు గుడిసెలు కావడంకన్న, గుడిసెలు మేడలు కావడం మేలు.
మేలుమేలంటే మెడబడ్డట్టు.
మొండిచేతితోటి మొత్తుకొన్నట్లు.
మొండి చేతులవానికి నువ్వులు తినడం నేర్పినట్లు.
మొక్కపోయిన దేవుడు యెదురుగా వచ్చినట్లు.
మొండివాడు రాజుకన్న బలవంతుడు.
మొగమాటానికెడితే, కడుపువచ్చినదట.
మొక్కయై వంగనిది, మ్రానైవంగునా?
మొగవాడు తిరుగక చెడితే, ఆడుది తిరిగి చెడినదట.
మొగుడు కొట్టినందుకు యేడ్వలేదట, తోడికోడలు నవ్వినందుకు ఏడ్చిందట.
మౌన మర్ధాంగీకారము.
యోగికి, రోగికి, భోగికి నిద్రుండదు.
రవుతు కొద్దీ గుఱ్ఱము.
రాగల శని రామేశ్వరం వెళ్ళినా తప్పదు.
రాజాజ్ఞకు మించిన శాసనము లేదు.
రాజుల సొమ్ము రాళ్లపాలు.
రాజు మెచ్చినది రంభ.
రాజు భార్య మేడయెక్కితే, కుమ్మరవాని కోడలు గుడిసెయెక్కిందట.
రాజుతలిస్తే దెబ్బలకు కొదవా?
రాజుకూతురైనా ఒకని ఆలే.

# నారదగాన రామాయణం



**బాలకాండ**

శ్రీకర బ్రహ్మ పరాత్పర రామ -

కాలాత్మక పరమేశ్వర రామ

శేషతల్ప సుఖనిద్రిత రామ -

బ్రహ్మాద్యమర ప్రార్థితరామ

భక్తబృంద పరిపాలన రామ -

ముక్తిప్రద సురమునినుతరామ

చండ కిరణకుల మండనరామ -

శ్రీ మద్దశరథనందనరామ

కౌశల్యాసుత వర్ధనరామ విశ్వామిత్ర

ప్రియధనరామ

ఘోరతాటకాఘాతక రామ -

మారీచాది నిపాతక రామ

కౌసిక మఖసంరక్షక రామ -

శ్రీ మదహల్యోద్ధారక రామ

గౌతమముని సంపూజితరామ -

సురమునివరగణ సంస్తుతరామ

శంకరాది సంసేవిత రామ -

పంకజాక్ష పరమాత్మకరామ

సమస్త జగదుద్ధారక రామ -

హిమధామ నిభాననరామ

కవికథావిత మృదుపదరామ -

మిథిలాపురజనమోదకరామ

విదేహమానస రంజక రామ -

త్ర్యంబక కార్ముక భంజక రామ

సీతార్పిత వనమాలిక రామ -

కృత వైవాహిక కౌతుకరామ

భార్గవదర్ప నివారణరామ -

శ్రీమదయోధ్యానందన రామ



## అయోధ్యాకాండ

దేవరాజ సంసేవిత రామ -
భావజారివిధి ప్రార్థితరామ
అగణిత గుణగణభూషితరామ -
అవనీకామిని కామిత రామ
రాకా చంద్ర సమానన రామ -
పితృవాక్యాశ్రిత కాననరామ
ప్రియగుహ వినివేదితపదరామ -
తత్క్షాళితనిజ మృదుపద రామ
భరద్వాజ దృగానందనరామ -
చిత్రకూటాద్రి నికేతనరామ
దశరథ సంతత చింతితరామ -
కైకేయీసుత ప్రార్థితరామ
విరజిత నిజ పితృకర్మక రామ -
భరతార్పితనిజ పాదుక రామ
జనకనృప తనూజాధిపరామ -
దనుజకులాటక విదాహనరామ
దండకావన జన పాపనరామ॥

## అరణ్యకాండ

దుష్టవిరాధ వినాశన రామ -
శరభంగ సుతీక్ష్ణార్చితరామ
అగస్త్యానుగ్రహవర్ధిత రామ -
గృధ్రాధిప సంసేవితరామ
పంచవటీతట సుస్థిర రామ -
శూర్పణఖార్తివిదారకరామ
ఖరదూషణముఖ సాధక రామ -
సీతాప్రియకృదాశుగరామ
మారీచార్తిహరినానుగ రామ -
వినష్టసీతాన్వేషకరామ
గృధ్రాధిపగతిదాయక రామ -
శబరీదత్త ఫలాశనరామ

కబంధబాహుచ్ఛేదన రామ -
భూరి విబుధ సంపూజిత రామ
సారసాక్షబుధ సన్నుతరామ

**కిష్కింధాకాండ**

హనుమత్సేవిత నిజపదరామ -
నత సుగ్రీవాభీష్టదరామ
గర్వితవాలి సంహరక రామ -
వానరదూత ప్రేక్షకరామ
హితకర లక్ష్మణసంయుతరామ॥

**సుందరకాండ**

కపివనసంత సంస్మృతరామ -
తద్గతి విఘ్నధ్వంసకరామ
పరమభక్త పరిపాలితరామ -
నరనరేంద్రసన్నుతరామ
ఇంద్రాది త్రిదశవందితరామ -
సాంద్రసమాన గంభీర శ్రీరామ
సీతా ప్రాణధారకరామ -
దుష్టదశాననదూషితరామ
శిష్టహనూమద్భూషితరామ -
శీతోదిత రాకాననరామ
కృతచూడామణి దర్శనరామ -
కపివరవచనా శాశ్వతరామ
రావణనిధనప్రస్థితరామ -
వానర సైన్యసమావృతరామ
శోషితసిర దీశార్థితరామ -
విభీషణభవదాయకరామ

పర్వతసేతు నిబంధక రామ -
ఘటకర్ణ శిరచ్ఛేదకరామ
రాక్షసకోటి విమర్దక రామ -
అహిమహి రావణమారకరామ
సంహృత దశముఖ రావణరామ -
విధి భవసురముఖ సంస్తుతరామ
ఖస్థిత దశరధ వీక్షిత రామ -
సీతాదర్శన మోదితరామ
అభిషిక్త విభీషణనుతరామ -
మేచకాంగపరమాత్మక రామ
నీచదనుజ మదనాశన రామ -
పుష్పకయా నారోహణ రామ
భరద్వాజాది నిషేవణరామ -
భరత ప్రాణావితరణరామ
సాకేతపురి భూషణరామ -
సకలస్వీయ సమావృత రామ
రత్న సత్పీరస్థితిరామ -
పట్టాభిషేకాలంకృత రామ
పార్థివ కుల సమ్మానితరామ -
విభీషణార్పితరంగక రామ
కీశకులానుగ్రహక రామ -
కందర్ప సుందరాకార శ్రీరామ
బంధరహిత నృపనందనరామ -
సకలజీవ సంరక్షకరామ
సమస్తలోకాధారకరామ -
రామరామ జయ రాజారామ
రామరామ జయ సీతారామ॥

# కృతజ్ఞతలు

నేను తెలుగు బాల సాహిత్యం పైన పరిశోధన చేస్తున్న తరుణంలో (1977-80) వందల సంఖ్యలో పిల్లల జానపద గేయాలు, వేల సంఖ్యలో పొడుపు కథలు సేకరించాను.

నేను పిల్లల జానపద గేయాలు సేకరిస్తున్నానని తెలియగానే తమ వద్ద గల గేయాలను ఇచ్చి ప్రోత్సహించిన హితవరులు పండిత గొర్రెపాటి వెంకట సుబ్బయ్యగారికీ -

గేయాల సేకరణలో తమ ఆశీస్సులను అందజేసిన శ్రేయోభిలాషులు, జానపద సాహిత్యోద్ధారకులు డాక్టర్ బిరుదురాజు రామరాజుగారికి, డాక్టర్ తంగిరాల వెంకట సుబ్బారావుగారికీ -

నా విజ్ఞప్తిని అనుసరించి ప్రార్థన గేయాలను అందించిన సహృదయులు, సాహితీవేత్త డాక్టర్ అల్లూరి వేంకట నరసింహరాజుగారికీ -

నేను కోరగానే తాము సేకరించిన బాల గేయాలను అందించిన మిత్రులు టేకుమళ్ళ కామేశ్వరరావు, చిత్తూరు; అమళ్ళదిన్నె గోపీనాథ్, అనంతపురం; మెండా ప్రభాకర్, నిజామాబాద్; డి. సుజాతాదేవి, విజయవాడ; చొక్కాపు వెంకట రమణ, హైదరాబాదు పల్లి తిరుపతిరావు గజపతినగరం (విజయనగరం జిల్లా) గార్లకూ-

తాము వినిపించిన పాటలను రాసుకోడానికి అనుమతించిన సహృదయులకూ -
ఈ సేకరణలో తోడ్పడిన ఎందరో మిత్రులకూ, అభిమానులకూ -

నా కోరికను మన్నించి క్రైస్తవ బాలల గేయాలను సహృదయంతో అందించిన పాస్టర్ టి. ప్రశాంతరాజుగారికీ -

సేకరణలో అనేక సలహాల నిచ్చిన బహుముఖ ప్రజ్ఞాశాలి బి సుబ్బరాయన్‌గారికీ-

ఈ ముద్రణలో చేర్పులు, మార్పులు సూచించిన బాల సాహితీవేత్త రెడ్డి రాఘవయ్య, సహజకవి ఐనాల మల్లేశ్వరరావుగార్లకూ -

అంకితానికి అంగీకరించిన సౌజన్యమూర్తులు, చిరకాల మిత్రులు, బాల సాహిత్యవేత్తలూ, బాలబంధువులూ వేజండ్ల సాంబశివరావు, కవిరావు, అలపర్తి వెంకట సుబ్బారావు గార్లకూ -

– సంపాదకుడు